# నవీన విద్య

రచన

మహాత్మా గాంధీజీ

అనువాదము

దశిక సూర్యప్రకాశరావు



ప్రకాశకులు :
నవజీవన్ ట్రస్టు అనుమతితో
సర్వోదయ విచార్ ప్రచార్ ట్రస్టు
పక్షమున
గాంధి సాహిత్య
ప్రకాశన్ సమితి - ఆంధ్ర

సంచాలకుడు
ఠోకర్సీలాల్ జీ కాపడియా
గాంధీభవన్ : : హైద్రాబాదు.

*

తొలి ముద్రణ
జూలై 1958
ప్రతులు : రెండు వేలు
వెల : రు. 1-50

*

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు.

**नवीन विद्या**

महात्मा गांधी जी

कृत

**बुनियादी शिक्षा**

का

तेलुगु अनुवाद

अनुवादक: **दशिक सूर्यप्रकाश राव**

*

पहलीबार : २०००
मूल्य : १-५०
जुलै १९५८

*

प्रकाशक
सर्वोदय विचार प्रचार ट्रस्ट
के लिए गांधी साहित्य
प्रकाशन समिति-आंध्र
संचालक
**ठोकरसी लालजी कापडिया**
गांधी भवन, हैद्राबाद

# విన్నపము

పూజ్య గాంధీజీ సిద్ధాంతములను, ఆదర్శములను ప్రచారము చేయు తలంపుతోను, ఆ మహాత్ములు సంకల్పించిన నిర్మాణ కార్యక్రమమును కొనసాగించు నుద్దేశముతోను, 1956 మే నెలలో "సర్వోదయ విచార ప్రచార ట్రస్టు" స్థాపింపబడినది. ఆ యాదర్శములను కార్యరూపములోనికి తెచ్చుటకుగాను మునుముందుగా 1957 లో "గాంధీ జ్ఞానమందిర"మను పేరుతో ఒక గ్రంథాలయము నెలకొల్పబడినది. అందు గాంధీ సాహిత్యమునకు సంబంధించిన వివిధ భాషలలోని గ్రంథములు గలవు. ఇంగ్లీషు, తెలుగు, కన్నడ, మరాటీ, ఉర్దూ, హిందీ భాషలలో గల గాంధీజీ జీవితము, వారి ఉపదేశములు, వారి గ్రంథములు, ఇంకను తత్సంబంధమయిన వాఙ్మయము అందు సంతరింపబడినది. అంతియగాక, ఈ జ్ఞానమందిర యాజమాన్యమున ప్రతివారమును సభలు జరుగుచుండును. ఆ సమయమున కొందఱు కొందఱు మహానుభావులు దయచేసి గాంధీజీ సిద్ధాంతములను గుఱించి అవి మానవజాతి నెట్లు కల్యాణమార్గమున నడపింపగలవో, ఆ విషయములను గుఱించి ఉపన్యసించుచుండెదరు.

ఈ ట్రస్టు యాజమాన్యమున, ఆంధ్రములో "గాంధీ సాహిత్య ప్రకాశక సమితి" ఏర్పాటు చేయబడినది. ఈ సమితివారు గాంధీజీ గ్రంథములను తెలుగులోనికి అనువాదము చేయించి ప్రకటించుచుండెదరు. అహమదాబాదులోని "నవజీవను ట్రస్టు"వారు ప్రస్తుతము పూజ్య బాపూజీ రచించిన 1. బేసికు (నవీన) విద్య 2. నిర్మాణ కార్యక్రమము 3. సర్వోదయము అను మూడు గ్రంథములను అనువాదము చేసి ప్రకటించుకొనుటకు ఈ ట్రస్టువారికి అనుమతిని

ఇచ్చియున్నారు. ఈ విధముగా గాంధీజీ గ్రంథములు ముందు ముందు అనువాదము చేయించి ప్రకటింపగలము.

పూజ్య బాపూజీచే వెలిగింపబడిన జ్యోతిని మూలమూలలకును వ్యాపింపజేయుటకయి ఈ ట్రస్టువారు తమ శక్తికొలది పాటుపడ గలరని విన్నవించుచున్నాను.

పూజ్య బాపూజీ రచనలలో ఇంతవఱకును తెలుగులో ప్రకటింప బడని గ్రంథములనే తొలుదొలుత ప్రకటింప సంకల్పించితిమి. శాశ్వత గ్రాహకులగువారికి పుస్తకములను తక్కువ వెలల కందింపదగు యోజన నేర్పఱచితిమి. కావున శాశ్వత గ్రాహకులు కాగోరువారు ఈ దిగువ చిఱునామాకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపగోరెదము.

ఆంధ్రమున గాంధీ సాహిత్యమును ప్రకటించు మా సంకల్పము పూజ్య బాపూజీ అంతరంగిక సహచరులు, మన ప్రియరాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్‌గారు తమ కరకమలములతో ఈ నవీనవిద్య, నిర్మాణ కార్యక్రమము అను రెండు పుస్తకములద్వారా ఈ యోజనను ఆవిష్కరింప నంగీకరించుటతో ద్విగుణీకృత సాఫల్యము నందినది. ఇది మా సౌభాగ్య విశేషమని భావించుచున్నాము.

గాంధీ భవనము
హైదరాబాదు (దక్కను)
15-7-1958.

**టోకర్సీ లాల్జీ కాపడియా**
*మేనేజింగు ట్రస్టీ*
సర్వోదయ విచార ప్రచార ట్రస్టు

# నివేదిక

గాంధిమహాత్ముడు భారతదేశ స్వతంత్ర ప్రదాతయే గాక సత్యయుగ స్థాపనాచార్యుడు. ప్రపంచమునందు అధర్మము ప్రబలి చిన్నజాతులను పెద్దజాతులు, బలహీనులను బలవంతులు అణగద్రొక్కి బానిసలుగ చేసికొనుచున్నారు. ద్వేషముతోను హింసతోను జాత్యహంకారముతోను లోకము నిండియున్నది. మానవకోటిని అవలీలగ భస్మము చేయగల ఆటంబాంబులను హైడ్రోజను బాంబులను వివిధ రాజ్యములు తయారు చేసికొనియున్నవి. మానవజాతి యంతయు యుద్ధభయములోను అశాంతిలోను మునిగి యున్నది. ఇట్టి విపత్సమయమున గాంధిమహాత్ముడు గొప్ప నైతిక ఆధ్యాత్మిక విప్లవమును జరిపి మానవజాతుల కాశాజ్యోతిని వెలిగించియున్నాడు. సమానత్వము, స్వతంత్రము, సోదరత్వము, ప్రేమ ధర్మము, అహింసలమీద మానవకోటిని పునరుద్ధరించగల మార్గములను చూపియున్నాడు. ఆటంబాంబు యుగమునుండి ధర్మసంస్థాపనా యుగమునకు తీసుకొని పోయినాడు. భారతదేశ పునర్నిర్మాణమునకే గాక మానవకళ్యాణమునకు కూడ గాంధిగారి జీవితాదర్శముల బోధలు శరణ్యములు. స్వతంత్ర భారతదేశమందొక యుజ్జ్వల భాగమైన ఆంధ్రదేశములో వాటిని బాగుగ వ్యాపించగల సాహిత్యమున కెంతేని ఆవశ్యకత గలదు. ఇంగ్లీషులో గాని, గుజరాతిలో గాని, హిందీలో గాని యున్న మహాత్మాగాంధిగారి రచనలను, వారినిగూర్చి వ్రాయబడిన గ్రంథములను హైదరాబాదు సర్వోదయ విచార ప్రచార ధర్మనిధివారి తోడ్పాటుతో తెనుగులోకి తర్జుమా చేయించి అచ్చువేయించి సరస

మైన ధరలకు విక్రయించుటకుగాను గాంధి సాహిత్య ఆంధ్ర ప్రచురణ సంఘమును హైదరాబాదులో నెలకొలిపితిమి.

ప్రథమ పుస్తకముగ (నయీతాలీమ్) నవీన విద్య అను గ్రంథముయొక్క తెనుగు అనువాదమును ప్రచురించుచున్నాము. మహాత్మా గాంధిగారు బేసికు విద్యావిధానము (నవీనవిద్య) ను గూర్చి యెక్కువగ శ్రద్ధచూపిరి. దీనిని ఆంధ్రప్రభుత్వమువారు వృద్ధి చేయవలసియున్నది. ఈ గ్రంథమును ఆంధ్రప్రజలు చదివి విశేషలాభ మును పొందెదరని ఆశించుచున్నాను. తెనుగులో గాంధి సాహిత్య మును ప్రచురించు మా కృషికి ఆంధ్ర మహాజనులు సర్వవిధముల ప్రోత్సహించి తోడ్పడెదరుగాక యని కోరుచున్నాను.

హైద్రాబాదు.
14-7-1953

అయ్యదేవర కాళేశ్వరరావు
అధ్యక్షుడు
గాంధి సాహిత్య ఆంధ్ర ప్రచురణ సంఘము

# తొలిపలుకు

గాంధీజీ హిందుస్తానమునకు ఉపయోగకరమగు నవీన విద్యను ఇటీవలనే ప్రతిపాదన చేసినప్పటికిని, విద్యను గురించిన విస్పష్టమయిన, విప్లవాత్మకమైన ఉద్దేశములు వారికి చిరకాలము క్రిందటనే ఉండెను. వారు దక్షిణాఫ్రికాలో టాలుస్టాయి ఫారమును స్థాపించి తమ బిడ్డలకు తమ ఉద్దేశముల ప్రకారము విద్యాబోధ చేసినట్లు వారే చెప్పుకొనియున్నారు. నాటినుండి, ఇండియాలో తమ కార్యకర్తలు, బిడ్డలుగల ఆశ్రమములలో చదువు నేర్పవలసిన అవసరము కలిగినప్పుడెల్లను, తమ పద్ధతినే అనుసరించుచున్నారు. కనుక 1937 లో భారతదేశమందంతట వారు విరివిగా బోధచేయుచున్న ఈ నవీనవిద్య వారికి ఏమంత క్రొత్తదికాదు. ముప్పది సంవత్సరములనుండి చిన్న చిన్న విద్యార్థి దళములకు బోధచేయుచు, ఇది ఉపయోగకరమైనదని నిగ్గుతీసి తేల్చుకొన్న విషయము.

బ్రిటీషువారు ఇంగ్లీషుభాషను బోధనా మాధ్యమముగా చేసి భారతదేశములో విద్యాపద్ధతిని ప్రవేశపెట్టియున్నారు. దాని మూలమున గవర్నమెంటు వారికి కావలసిన గుమాస్తాలు ఉత్పత్తిఅయినారు కాని ఉత్పాదన సాధకములగు ఉత్సాహశక్తి, నైపుణ్యము రాలేదు. అటువంటి విద్యవల్ల విద్యావంతులు సామాన్యప్రజలనుండి దూరమయిపోయినారు. అదిగాక అది ప్రజలకు నిరుపయోగకరమయిపోయినది. గాంధీజీ ఈ సంగతులను కనిపెట్టినారు. బ్రిటీషువారు గ్రామవ్యవస్థను చెడగొట్టినారు. విదేశములలో తయారయిన వస్తువులను గ్రామములలో ప్రవేశపెట్టి, చౌకగా అమ్మి, గ్రామములలో తయారయిన వస్తువులను నాశనముచేసినారు. అందువల్ల గ్రామప్రజలు చిందరవందర అయి, వృత్తులు పోగొట్టుకొని, నిరాధారులయి అన్నమో రామచంద్రాయని అల్లాడిపోవుచున్నారు. బీదప్రజలు ఏమయిపోయినను మాకేమి లెక్క

యని ధనవంతులు స్వలాభము నిమిత్తము తమ విద్యను సాధనముగా చేసికొనుచున్నారు. ఇటువంటి స్థితిగతులలో మరల గ్రామములలో ఆర్థిక నిర్మాణము గావించి, దానిని విద్యను జోడించుట ఉత్తమమని గాంధీజీ భావించిరి. అందువలన వారి అభిప్రాయము ప్రకారము విద్య చేతిపరిశ్రమపయి ఆధారపడి యుండవలెను. ఉత్పత్తిదారు డగుటకొఱకే చిన్న బిడ్డకు శిక్షణ యివ్వవలెను. చిన్న పిల్లవాడు గ్రామములోని అర్థవ్యవస్థకు సహాయపడవలెనను ఉద్దేశముతో పిల్ల వాని భారమంతయు గాంధీజీ పైన వేసికొని యున్నారు. అందువలన విద్య చేతిపరిశ్రమపై ఆధారపడి యుండవలెననియు, దానిమూలమున విద్యార్థికి చేతినైపుణ్యమేగాక బుద్ధివికాసము, హృదయ వికాసము కూడ కలుగవలెననియు గాంధీజీ పట్టుపట్టుచున్నారు. పూర్వమువలె ఇప్పుడు విద్య ఊకదంపుడు చదువుగా నుండదు. జీవితమునకు పొత్తు లేకుండ ఉండదు. ఇందు ఇంగ్లీషు ఉండదు. ఈ నవీన విద్య పరమ ప్రయోజనమును సాధించునట్టిది. పిల్లవాని మాతృభాషలోనే విద్యాబోధ జరుగగలదు. ఈ విద్య పిల్లవాని రక్తములో రక్తమయి కలిసిపోవును. పిల్లవాని సామాజిక, సాంస్కృతిక వాతావరణమును ప్రధానముగా చేసికొనియే ఈ విద్యాబోధ జరుగుచుండును.

మన ఆర్థిక, సాంస్కృతిక జీవనము శిథిలమయి పోవుచుండగా చూచి గాంధీజీ ఈ విద్యద్వారా దానిని పునరుద్ధరించుటకు పూను కొనిరి. చేతి పరిశ్రమద్వారా విద్యాబోధ జరుగవలెనని వారు చెప్పు టలో మఱియొక ఉద్దేశముకూడ ఉన్నది. ఈనాడు లోకములో యంత్రనాగరికత, స్వేచ్ఛావిహారము చేయుచున్నది. దాని మూల మున దేశములోని అధిక ప్రజకు హానిసత్వము, బీదఱికము, అజ్ఞా నము ప్రాప్తించినవి. వారికి స్వేచ్ఛ, స్వావలంబము లేకపోగా వారు ధనవంతులైన మిల్లు యజమానుల పైనను, గవర్నమెంటుపైనను ఆధారపడవలసిన వారయిరి. అంతేగాక దేశములకు దేశములకు మధ్య

విద్వేషములు, ప్రపంచయుద్ధములు, జన ప్రళయములు సంభవించు చున్నవి. అందువలన మన దేశములోని సామాన్య ప్రజలకు సుఖ జీవనము గలుగవలెనన్న, యంత్ర పరిశ్రమలజోలికి పోరాదనిన్ని, మన ఆర్థిక జీవనము చిన్న చిన్న గ్రామ పరిశ్రమలపైననే ఆధారపడి యుండ వలెననిన్ని గాంధీజీ సంకల్పించిరి. అట్లు చేసినయెడలనే ప్రజలకు స్వేచ్ఛ, శాంతి, సర్వతోముఖ వికాసము గలుగునని గట్టిగా నమ్మియుండిరి. యంత్రముల మూలమున వస్తువులు అధికముగా ఉత్పత్తి యగు చుండుట వారికిష్టము కాదు. అంతకంటె గ్రామ పరిశ్రమల ద్వారా ప్రజలకు, అల్పముగా నైననుసరే, స్వతంత్రము, ఆత్మవికాసము గలు గుట వారికిష్టము. అందువలన గ్రామములలో గ్రామ పరిశ్రమలు, వ్యవసాయము నిండుగా వృద్ధిపొందవలె ననియు, గ్రామ ప్రజలు పరస్పర సహకారముతోను, ప్రేమానురాగములతోను జీవించుచు గ్రామ సౌభాగ్యమునకు అందఱును కలసి పాటుపడుచుండవలె ననియు గాంధీజీ అభిప్రాయము. చిన్న బిడ్డలు అటువంటి పౌరులుగా తయారగుటకు గాను విద్య చేతి పరిశ్రమపైననే ఆధారపడి యుండ వలెను. ఈ విధముగా గాంధీజీ విద్యాపద్ధతి అంతకును మూలము అహింస, కడజాతిలోని కడపటివానికి కూడ స్వేచ్ఛ, శాంతి, సౌఖ్య ములు కలుగుటయే పరమ ప్రయోజనము.

ఈ కాలమునాటి వారు స్వతంత్రము, ప్రజాతంత్రము, శాంతి అనుమాటలు పైకి తేలికగా చెప్పుచుందురు. కాని చక్కని ఆర్థిక వ్యవస్థ పునాదిగా లేనిదే, అట్టివి లభింపనేరవని వారికి తెలియదు. ఆర్థిక వ్యవస్థలో మనమెంత గట్టిగా కాలు నిలద్రొక్కుకొన్న అంత గట్టిగా నిలబడగలమన్న సంగతి ఒక్క గాంధీజీకే తెలియును. అధిక వస్తూత్పత్తియే మన ఆర్థిక వ్యవస్థా ప్రయోజనమైన యెడల అది లభింపగలదు. సరే అంతకు మించి స్వేచ్ఛగాని, శాంతిగాని లభింపవు. అట్లుగాక మనము శాంతిని, స్వేచ్ఛనే పరమ ప్రయోజనములుగా

కోరుకొన్న యెడల మన ఆర్థిక, రాజకీయ, సామాజిక విద్యావ్యవస్థ అంతయు మారిపోయి, పై వానిని సంపాదించుటకు సాధనచేయ వలెను. ఆ ప్రయత్నములో వస్తువులు తక్కువ ఉత్పత్తిఅయినను మనము లెక్కచేయరాదు. ఈ రోజులలో జనులందరు శాంతి, స్వతంత్రము కావలెనని తహతహలాడు చున్నారు. అవి ఈ నవీన విద్యాపద్ధతివల్ల లభింపగలవని గాంధీజీ బోధించుచున్నారు. ఈ పద్ధతిలోని గొప్ప సుగుణ మిది.

(1) బ్రిటీషువారు ఇండియాలో ప్రవేశపెట్టిన అనాచరణ యోగ్యమయిన చదువు (2) గాంధీజీ ప్రవేశపెట్టదలచిన అహింసాత్మక నవ్య సమాజము.

ఈ రెండును నవీన విద్యకు మూలాధారములు. ఈ మూలాధారములను మనము దూరముగాపెట్టి విచారించినను ఈ నవీన విద్యలో అసలు విద్యాతత్త్వము ఇమిడి యున్నది.

(1) కర్మద్వారా విద్యాబోధ జరిగినప్పుడే మానవునికి పూర్ణ వికాసము గలుగ గలదన్నదే ఆ విద్యాతత్త్వము. కర్మ సహాయము వల్ల బుద్ధి వికసింపగలదని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఆ ప్రకారము గాంధీజీ విద్యాపద్ధతిలో పారిశ్రామిక కర్మ ప్రధానముగానున్నది గనుక విజ్ఞానము, నైపుణ్యము సహజ సిద్ధములు కాగలవు. కర్మకు సంబంధింపని విషయ పరిజ్ఞానమువల్ల మనస్సు బరువెక్కును. దానికి అజీర్ణవ్యాధియు సంభవించును. అప్పుడు ప్రకృతి కొన్ని విషయములను మఱచిపోవునట్లు చేసి మనస్సునకుగల బరువును దించివేయును.

(2) బాలకునిలో నిగూఢముగా పడియున్న అంతశ్శక్తులను వెలికిదీయు విద్య, చేతి పరిశ్రమద్వారానే ఉండవలెను. దాని మూలమున నే అతనిబుద్ధి, నడవడి, హస్తనైపుణ్యము ప్రబుద్ధములగును.

మామూలు పుస్తకాల చదువులో విద్యాబోధ గదులు గదులుగా విడదీసినట్లుండును. మానసిక శిక్షణకును, చేతిశిక్షణకును

సంబంధములేదు. చేతి పరిశ్రమలో పనిచేయుచున్న చేతులకు, కన్నులకును, మనస్సునకును సంబంధములేదు. కొంత కళాబోధ, కొంత మతబోధ జరుగుచు హృదయ వికాసమునకును, బుద్ధివికాసమునకును ప్రయత్నములు జరుగుచుండును. ఏమి జరిగినను పరస్పర సమన్వయముతో జరుగవు. కాని గాంధీజీ పద్ధతి అదికాదు. బాలకుడనగా సమస్త శక్తులుగల ఏకరూపము. అందువలన అతనిశక్తులన్నియు ఏకరూపతతో సమముగా వికసింపవలెను. పరస్పర సమన్వయము ఉండవలెను. ఈ లక్షణములన్నియు గాంధీజీ పద్ధతిలో ఉన్నవి. ఈ రోజులలో ప్రత్యేక ప్రత్యేక విషయములను గుఱించి విడదీసి విశేష ప్రాముఖ్యము చూపబడుచున్నది. అట్టిస్థితిలో అన్నిటిని సమన్వయపఱచెడి ఈ నవీన విద్యా సమయమునకు పనికివచ్చియుండుటయేగాక బాలకుని సర్వతోముఖ వికాసమునకు అత్యంతము తోడ్పడుచున్నది.

గాంధీజీకి తమ అభిప్రాయములను క్రమబద్ధ మొనర్చుటకు తగిన తీఱికలేదు. అదిగాక, ఆడంబరముతో సిద్ధాంతములు ప్రకటించుటయందును వారికి నమ్మకములేదు. తామునమ్మిన విషయమును వెంటనే ఆచరణలో పెట్టెదరు. ఆచరణ వల్లనే తమ అభిప్రాయములు గట్టివో, ఓటివో తేలిపోగలవని వారి అభిప్రాయము.

గాంధీజీ రచనలను, మాటలను వీలయినంతవఱకు విషయ క్రమము ననుసరించియు, తారీఖులవారీగాను ఈ పుస్తకమునందు పొందుపఱచితిమి. అందువలన పాఠకులకు కొంత సౌలభ్యమేర్పడును. "విమర్శ - విపులీకరణ" అను అయిదవ భాగము మిక్కిలి ముఖ్యమయినది. అందు గాంధీజీ తన సిద్ధాంతమును ధ్రువపఱచి సందేహములను, చిక్కులను తొలగించియున్నారు.

1 అక్టోబరు, 1950,
బొంబాయి.

భరతన్ కుమారప్ప

# విషయ సూచిక

# మొదటి భాగము

# నవీన విద్యా

## 1 నవీన విద్య - దాని అవసరము

*సంపాదకుడు :* విద్య అనగా అక్షరజ్ఞానము కలిగియుండుట అని సామాన్యమైన అర్థము. పిల్లలకు చదువుట, వ్రాయుట, లెక్కలు చేయుట నేర్పిన యెడల, దీనిని ప్రారంభవిద్య అందురు. ఒక రైతు కష్టపడి న్యాయముగా అన్నము సంపాదించుకొనును. అతనికి సామాన్యమైన లోకజ్ఞానము కలదు. తలిదండ్రుల యెడ, భార్యాపుత్రులయెడ తోడి గ్రామస్థుల యెడ ఎట్లు ప్రవర్తింపవలయునో బాగుగా తెలియును. నీతి నియమములు తెలియును. అతడా ప్రకారమే నడచుకొనుచుండును. కాని తన పేరును తాను వ్రాసికొనలేడు. అట్టి వానికి అక్షరములు నేర్పినందువలన లాభమేమి ? అతని సౌఖ్యమును రవంతయైన వృద్ధిచేయగలవా ? ఇప్పుడతడు తన కుటీరములో సుఖముగా కాలము గడపుచుండగా అతని కీ చదువు నేర్పి తన జీవితమును గురించి వెగటు గలిగింప దలచితివా ? నీవట్లు చేయదలచినను, అతనికి ఈ చదువుతో పనిలేదు. పశ్చిమదేశ వాసనలు మనకు వఱదవలె వచ్చిపడినవి. దానిలో పడి మనముకూడ కొట్టుకొనిపోవుచు, ముందు వెనుకలు ఆలోచింపకుండ, మన ప్రజలకు ఇటువంటి చదువునే ప్రసాదింపవలెనని నిశ్చయించుకొంటిమి.

ఇప్పుడు మనము ఉన్నత విద్యను గురించి ఆలోచింతము. నేను భూగోళము, జ్యోతిశ్శాస్త్రము, అంకగణితము, రేఖాగణితము మొదలయినవి నేర్చియుంటిని. వానివల్ల ప్రయోజన మేమి ? నాకేమి లాభము గలిగినది ? నా చుట్టుప్రక్కల వారి కేమి లాభము గలిగినది ?

ఈ విషయములు నేనెందుకు నేర్చుకొంటిని ? ప్రొఫెసరు హాక్సులీ విద్యను గురించి ఈ విధముగా నిర్వచనము చెప్పియున్నాడు.

"ఏవాని శరీరము, అతని మనోనిశ్చయమును బట్టి యంత్రము వలె నడచుకొనుచు, సులభముగాను, సంతోషముతోను పనిపాటులు చేయుచుండునో; ఏవాని బుద్ధి, నిర్మలమై, స్థిరమై, విచక్షణ గలిగి చురుకుగా నుండునో; ఏవాని మనస్సు, ప్రధాన నిత్యసత్యముల జ్ఞానముతో నిండియుండునో; ఏవాని మనోవికారములు దృఢ సంకల్ప సాధనవల్ల అణగి మణగి పడియుండునో; ఏవానికి కోమల చిత్త ముండునో; ఏవాడు అకార్యముల నేవగించుకొనుట నేర్చి యుండునో, ఇతరులను తనవలె గౌరవించుట నేర్చియుండునో విశా లార్థమున అతనికి విద్య అబ్బినదని చెప్పవలెను. అతడు ప్రకృతితో సమన్వయమును కుదుర్చుకొనినాడు గనుక అతనికే విశాలార్థమున విద్య లభించినది, ఇతరులకు కాదు అని నా అభిప్రాయము. అతడు ప్రకృతి ధర్మములను లెస్సగా ఉపయోగించుకొనును. ప్రకృతి కూడ అతనిని గురించి అంతే."

ఇదే నిజమైన విద్య అయినచో, నా ఇంద్రియ వికారములను అణచుకొనుటకు పైన ఉదాహరించిన శాస్త్రము లేవియు నాకు సాయపడలేదని స్పష్టముగా చెప్పగలను. కనుక నీవు ప్రారంభవిద్యను తీసికొన్నను, ఉన్నత విద్యను తీసికొన్నను అది ప్రధాన ద్రవ్యమునకు పనికిరాదు. అది మనలను మానవులుగా చేయదు. మన కర్తవ్యమును పాటించుటకును తోడుపడదు.

పాఠకుడు : అట్లయినచో, నేను మిమ్మొక ప్రశ్న యడుగ వలెను. ఇన్ని సంగతులు మీరు నాకు చెప్పుచున్నారే, దేనివల్ల ? మీకే ఉన్నత విద్య రానియెడల ఇన్ని సంగతులు మీరు నాకు చెప్పగలిగెడి వారేనా ?

సంపాదకుడు : మంచిమాట అడిగితివి. దాని సమాధానము చిన్నది. ప్రారంభ విద్యగాని, ఉన్నత విద్యగాని నేను నేర్చియుండ నిచో, నా జీవితము వృథా అయ్యెడిదని నే నెన్నడును తలంపను. మాటలు నేర్చితిని గనుక నే ప్రజాసేవ చేయగలుగుచున్నానని ఎన్న డును అనుకొనను. నాకు ప్రజలను సేవింపవలెనను అభిలాష గలదు. ఆ ప్రయత్నములో నా నేర్చిన విద్యను ఉపయోగించుకొనుచున్నాను. ఒకవేళ దానిని సదుపయోగము చేయుచున్నయెడల, అది నీవంటి వారికొఱకేగాని కోట్లకొలది ప్రజల కొఱకు కాదు. ఇప్పుడు నా వాదము బలపడినదిగదా. నీవును నేనును ఈ కృత్రిమ విద్య వలలో పడిపోతిమి. దాని దుష్టలక్షణములనుండి విముక్తి పొందినానని తలచి, నా అనుభవమునుబట్టి నీకు బోధచేయుచున్నాను. అట్లు బోధించు టలో ఈ చదువు బొత్తిగా నిరుపయోగమైనదని నీకు ప్రత్యక్షము చేయదలచితిని.

అదిగాక, స్థితిగతులన్నిటిలోను, అక్షరజ్ఞానము పనికిరాదని నే ననను. కాని దానిని కొండంతలు చేయరాదనియే నా అభిప్రాయము. అది మన కామధేనువుకాదు. మనము ఇంద్రియ వికారములను అణచుకొన్నపిదప, మన నీతి నియమములు సుదృఢమైన తరువాత ఆ చదువు ఉపయోగించును. అప్పుడా చదువును నేర్వదలచినయెడల దానిని నేర్చి సదుపయోగము చేసికొనవచ్చును. అప్పుడది శరీరముపై ధరించిన అలంకారమువలె శోభ నిచ్చును. అందువలన ఆ చదువును నిర్బంధముచేయవలసిన అవసరములేదని తెలియగలదు. మన ప్రాచీన విద్యాలయ పద్ధతి చాలును. అందు గుణశీల నిర్మాణము ప్రధాన విషయము. అదే ప్రారంభ విద్య. ఆ పునాదులపై గట్టిన భవనము గట్టిగా చిరకాలము నిలువగలదు.

పాఠకుడు : స్వరాజ్య సంపాదనకయి ఇంగ్లీషు చదువు అవస రము కాదని మీ అభిప్రాయమా ?

*సంపాదకుడు :* దానికి అవును, కాదు అని నా సమాధానము. కోట్లకొలది జనులకు ఇంగ్లీషు నేర్పుట వారిని బానిసలు చేయుటయే. విద్యకు "మెకాలే" వేసిన పునాదులు మనలను బానిసలు చేసినవి. ఇట్టి ఉద్దేశముతోనే అతడా పని చేసినాడు. స్వరాజ్య సంపాదనను గురించి మనము ఇంగ్లీషులో చర్చించుట దురదృష్టము కాదా ?

ఇంగ్లీషువారు తమకు పనికిరావని విడిచిపెట్టిన పద్ధతులను మనము పట్టుకొని వ్రేలాడుచున్నాము. వారిలోని విద్వాంసులు ఎప్పటికప్పుడు మార్పులు చేసికొని వచ్చుచునేయున్నారు. వారు తీసి పాఱవేసిన పద్ధతులను మనము తెలివితక్కువగా అనుసరించు చున్నాము. వారు తమలోని ప్రతిచిన్న వర్గమువారును స్వీయాభివృద్ధి పొందుటకు పాటుపడుచున్నారు. 'వేల్సు' ఇంగ్లాండులో చేరిన ఒక చిన్న దేశము. వేల్సు దేశ ప్రజలకు వేల్సు భాషను పునరుద్ధరింపవలెనని గట్టి ప్రయత్నములు జరుగుచున్నవి. వేల్సు బాలకులకు వేల్సు భాషను నేర్పింపవలెనను ఉద్యమములో ఇంగ్లీషు ఛాన్సలరైన లాయడుజార్జి ప్రధానపాత్ర వహించుచున్నాడు. వేల్సు బిడ్డలు వేల్సు భాష మాట్లాడుచున్నారు. మన మేమి చేయుచున్నాము ? మనము తప్పులు కుప్పలుగాగల ఇంగ్లీషులో ఒకరొకరికి ఉత్తరములు వ్రాసికొనుచున్నాము. మనలో ఎం. ఏ. ప్యాసయిన వారికికూడ ఈతప్పులు తప్పుటలేదు. మనలోని ఉత్తమ భావములను ఇంగ్లీషులో వెల్లడించుచున్నాము. మన కాంగ్రెసు వ్యవహారములు ఇంగ్లీషులో నడపబడుచున్నవి. మనలోని ఉత్తమ వార్తాపత్రికలు ఇంగ్లీషులో ప్రచురింపబడుచున్నవి. ఈవిధముగా చిరకాలము జరిగిన యెడల, రాబోవు తరములలోని మన బిడ్డలు మనలను తిట్టి దుమ్మెత్తి పోసెదరు. ఇది నాదృఢమైన అభిప్రాయము.

ఇంగ్లీషుచదువు నేర్చుకొని మనము మనజాతిని బానిసత్వము లోనికి కూలద్రోసితిమన్న సంగతి మఱవరాదు. కపట వర్తనము,

క్రూరత్వము మొదలయినవి పెచ్చుపెరిగిపోయినవి. ఇంగ్లీషు చదువు కొన్న భారతీయులు ఇతరులను మోసగించుటకుగాని, భయకంపితు లను చేయుటకుగాని వెనుకాడరు. ఇప్పుడు మనము ప్రజలకేమయిన ఉపకారము చేయుచున్నయెడల వారికి చెల్లింపవలసిన ఋణములో కొంతభాగము మాత్రమే తీర్చుచున్నామని యర్థము.

నేను న్యాయస్థానమునకు పోయినయెడల ఇంగ్లీషు భాషలోనే వ్యవహారములు జరుపుకొనవలెను. నేను బారిష్టరును గనుక నా స్వభాషలో మాట్లాడరాదు. ఇతరులెవ్వరో నాభాషనే అనువాదము చేసి నాకు చెప్పవలెను. ఇది పరమ ఘోరము కాదా? ఇది బానిసత్వ లక్షణము కాదా! ఈదోషము ఇంగ్లీషువారిదా, నాదా? ఇంగ్లీషు నేర్చిన మనమే మనదేశమును బానిసత్వములోనికి దింపినాము. అందుకు మనదేశప్రజలు మనలనే శపింపవలెనుగాని ఇంగ్లీషువారిని కాదు.

నీవు చివర అడిగిన ప్రశ్నకు అవును, కాదు అని జవాబు చెప్పితిని. అవును అని ఎందుకు అనియుంటినో వివరించితిని. కాదు, అని ఎందుకనుచున్నానో వివరించెదను.

మనలను ఈ నాగరికతా రోగముపట్టి పీడించుచున్నది. అందు వలన ఇంగ్లీషుచదువును పొంతముగా విడిచిపెట్టజాలము. ఇంగ్లీషు చదువు నేర్చినవారు అవసరమైన తావులలో దానిని సదుపయోగము చేసికొనవచ్చును. మనము ఇంగ్లీషువారితో వ్యవహరించునప్పుడును, మనలోమనకు ఉత్తరములు వ్రాసికొనునప్పుడు ఇంగ్లీషుభాషతప్ప గత్యంతరము లేనప్పుడును, ఇంగ్లీషువారే తమ నాగరికతను గుఱించి ఎంత విసుగుదల పొందియున్నారో తెలిసికొనుటకున్ను, ఇంగ్లీషు భాషను మనము నేర్వనువచ్చును, దానిని ఉపయోగించుకొనను వచ్చును. ఇంగ్లీషు నేర్చినవారు తమబిడ్డలకు వారి స్వభాషలో గుణ శీలములు నేర్పవచ్చును. మఱియొక భారతీయ భాషను బోధింప

వచ్చును. ఆ బిడ్డలు పెద్దవారయినవెనుక ఇంగ్లీషు నేర్చుకొనవచ్చును. లక్ష్యముమాత్రము మన వ్యవహారములకు ఇంగ్లీషు అక్కఱలేదనియే ఉండవలెను. ఇంగ్లీషు నేర్చుకొని ధనసంపాదన చేయవలెనను తలంపు ఉండరాదు. మనము నేర్చుకొన్న ఆ కొద్దిపాటి ఇంగ్లీషువల్లనైనను, మనము ఏమి నేర్చుకొనవలెనో, ఏమి నేర్చుకొనరాదో ఆలోచించుకొనవలెను. ఏమేమి శాస్త్రములు నేర్వవలెనో ఆలోచించుకొనవలెను. మనకు ఇంగ్లీషు డిగ్రీల వ్యామోహము పోయినదని తెలిసికొన్ననాడు, మన ఇంగ్లీషు పాలకులకు ఎంతో ఆశ్చర్యము కలుగును. ఈ సంగతి ఏమాత్రము ఆలోచించినను తెలియగలదు.

*పాఠకుడు :* అయితే మనము ఎట్టి విద్యనేర్పవలెను.

*సంపాదకుడు :* ఈ విషయమయి పైన కొంత చెప్పబడినది. అయినను, ఇంకను వివరముగా పరిశీలింతము. మన భాషల నన్నిటిని వృద్ధిచేయవలెనని నా అభిప్రాయము. ఆ భాషలద్వారా ఏయే విషయములు నేర్చుకొనవలెనన్న సంగతి ఇప్పుడు ఆలోచింపవద్దు. విలువగలిగిన ఇంగ్లీషు పుస్తకములను మన భాషలలోనికి అనువదించుకొనవలెను. అనేక శాస్త్రములు నేర్చుకొనవలెనను కపటభావమును మనము విడిచిపెట్టవలెను. మునుముందుగా, గుణశీలములు దిద్దగల ధార్మికవిద్య మనకు కావలెను. విజ్ఞానవంతుడైన ప్రతిభారతీయుడు తనప్రాంతీయభాషతోపాటు హిందువుడైనచో సంస్కృతము, మహమ్మదీయుడైనచో అరబ్బీ, పార్సీ అయినచో ఫారసీ, మొత్తమునకు అందఱు హిందీ నేర్వవలెను. కొందఱు హిందువులు అరబ్బీ, ఫారసీ భాషలు నేర్చుకొనవలెను. కొందఱు మహమ్మదీయులు, పార్సీలు సంస్కృతము నేర్వవలెను. పెక్కండ్రు ఉత్తరదేశీయులు, పశ్చిమదేశీయులు అరవము నేర్చుకొనవలెను. ఇండియాలో సార్వదేశిక భాషగా హిందీ ఉండవలెను. దానిని నాగరిలిపిలోగాని ఫారసీలిపిలో గాని వ్రాయుటకు అనుమతించవలెను. హిందూ మహమ్మదీయులకు

పరస్పర మైత్రి ఏర్పడుటకుగాను రెండు లిపులు నేర్చియుండుట అవసరము. ఈ పని మనము చేయగలిగితిమా ఇంగ్లీషు భాషను అచిర కాలములోనే దాని స్థానమునుండి తఱిమివేయగలము. బానిసలమైన మనకీపని అంతయు అవసరము. మనము బానిసలమగుటవల్ల మన దేశమునకుకూడ బానిసత్వము పట్టినది. మనము స్వతంత్రులమగుటతో మన దేశమునకును స్వతంత్రము ప్రాప్తించును.

*పాఠకుడు :* ధార్మిక (మత) విద్య చాల కష్టమైనదే.

*సంపాదకుడు :* కాని దానిని విడిచిపెట్టి ఉండజాలము. ఈశ్వర రహితముగా ఇండియా ఎన్నడును ఉండజాలదు. శుద్ధ నాస్తికత్వము ఈ గడ్డపైన వృద్ధిపొందజాలదు. ధార్మిక (మత) విద్యఅని పేరు చెప్పగానే నాతల తిరుగుచుండును. మన మత విద్యాబోధకులు కపటులును స్వార్థపరులు నయి యున్నారు. వారిని సంస్కరింపవలెను. ముల్లాలు, దస్తూరులు, బ్రాహ్మణులు, వీరి చేతిలో ఆధిపత్యము ఉన్నది. వారు సద్భావముతో వ్యవహరింపని యెడల ఇంగ్లీషు చదువులవల్ల మనకు వచ్చిన శక్తినంతయు మనము ధార్మిక విద్యాబోధనకయి వినియోగింపవలెను. ఇది ఏమంత కష్టముకాదు. సముద్రము అంచులు మాత్రమే మైలపడిపోయినవి. ఆ అంచులలో నున్నవారిని మాత్రమే శుభ్రపరచిన మనకు చాలును. మనమును ఈ తరగతిలోని వారమే. మనలను మనముకూడ శుద్ధిచేసికొనగలము. నేను పైనచేసిన రిమార్కులు కోట్లకొలది జనులకు వర్తింపవు. భారతదేశమునకు ప్రాచీనోన్నతి గలుగజేయుటకు గాను మనము దానిని మరల దర్శింపవలెను.

(హింద్‌స్వరాజ్య - 18 ప్రకరణము)

# 2
# వృత్తి ద్వారా విద్య

[గాంధీజీ చాలమందితో ఈ విషయమయి మాట్లాడి నప్పుడు, ఈ విద్యా విషయమయిన ప్రాతిపదికను గుఱించియు, వృత్తికిని, విద్యకును గల సమన్వయమును గుఱించియు ఈ విధముగా ముచ్చటించి యున్నారు.]

నేను దక్షిణాఫ్రికానుండి ఈ దేశమునకు తిరిగి వచ్చినప్పుడు పెక్కండ్రు విద్యార్థులు నన్ను చూచుటకయి వచ్చిరి. వారితో సంభాషించినప్పుడు, ఇప్పటి విద్యావిధానము పనికిమాలినదనిన్ని, ఏదో నవీన విద్యాపద్ధతిని అవశ్యము స్థాపింపవలసి యున్నదనిన్ని నాకు తోచినది. అందువలన ఆశ్రమ విద్యాలయములో చేతి పనులను ప్రవేశ పెట్టితిమి. నిజమునకు, చేతివృత్తులకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చితిమి. దానితో, మాకు సాహిత్యపు చదువు కావలెను గాని, ఈ చేతిపనుల చదువు మా కెందుకని పిల్లలు గగ్గోలు పెట్టసాగిరి. కాని విద్యార్థుల భావన తప్పు. కారణ మేమనగా పిల్లలు మామూలు విద్యాలయములలో నేర్చుకొను చదువుకంటె ఇక్కడ ఎక్కువ నేర్చుకొనుచున్నారు. అయినను నేను దీర్ఘముగా ఆలోచించి, చేతిపనులు మఱియు సాహిత్యపు చదువు చెప్పుటకు బదులు చేతిపనుల ద్వారానే సాహిత్యపు చదువు జరుగవలెనను నిర్ణయము చేసికొంటిని. అప్పుడు చేతిపనులలో విసుగుదల ఉండదు. సాహిత్య విద్యలో కూడ క్రొత్త రుచి కలుగును. పైగా దానివల్ల ప్రయోజనముకూడ ఉండును.

ఇంగ్లీషును విడిచి పెట్టవలెననియే నిశ్చయించుకొంటిమి. కారణ మేమనగా పిల్లలు ఇంగ్లీషు మాటలు, ప్రయోగములు వల్లించుటకు

అధిక సమయము వృథా చేయుచున్నారు. ఇంత చేసినను తాము నేర్చినది స్వభాషలో విప్పిచెప్పుట వారికి చేత కాదు. పైగా ఉపాధ్యాయుడు బోధించినది వారికి అర్థము కాదు. మఱియొకటి పై పెచ్చు. కేవలము నిర్లక్ష్యమువల్ల తమ స్వభాషను మఱచిపోవుచున్నారు. కాబట్టి ఈ రెండు దోషములు పోవలెనన్న వృత్తి ద్వారానే విద్యాబోధన జరుగవలెను.

నేను మొదటి దినముననే పిల్లలశక్తి సామర్థ్యములను గ్రహింపవలెను. వారికి చదువను, వ్రాయను, లెక్కలు, భూగోళము వచ్చునో, రావో తెలిసికొని అనంతరము తక్లీని ప్రవేశపెట్టవలెను.

ఎన్నో చేతిపను లుండగా, మీరు తక్లీని ఎందుకు ఎంచుకొంటిరని నీవు అడుగవచ్చును. ప్రధాన గృహ పరిశ్రమలలో తక్లీ ఒకటి. అనేక యుగములనుండి తక్లీ వాడుక చేయబడుచున్నది. ప్రాచీన కాలమున మనకు కావలసిన వస్త్రమంతయు తక్లీ నూలువల్లనే తయారు చేయబడుచుండెడిది. చేతి రాటము తరువాత వచ్చినది. మిక్కిలి సన్నని దారము తీయుటకు తక్లీయే ఉపయోగించినది. ఈ తక్లీని కనిపెట్టినవారి ప్రతిభను గుఱించి మెచ్చుకొనక తప్పదు. ఎన్నడును ఇంత మహోన్నత కార్యము జరిగి యుండలేదు. చేతివ్రేళ్ళ మెలకువలు బహు నిపుణముగా ప్రదర్శింపబడినవి. అయితే తక్లీ, చదువురాని చేతిపనివారి చేతులలో పడియుండుట వలన దాని వాడుక తగ్గిపోయినది. దానిని తిరిగి మహోచ్ఛదశకు తీసికొని రావలెనన్న, మన గ్రామ జీవితములను పునరుద్ధరింపవలెనన్న, బాల విద్యను తక్లీతోనే ప్రారంభము చేయవలెను. మన నిత్యజీవితములో తక్లీ మనకు ఎంత ఉపయోగకరముగా నుండెడిదో బోధించుటయే పిల్లలకు నేను చెప్పదలచుకొన్న రెండవ పాఠము. అనంతరము ఆ తక్లీ చరిత్ర కొంచెము చెప్పి, అదియెట్లు క్రమక్రమముగా క్షీణించిపోయినదో వివరించెదను. అటుపిమ్మట కొంచెము హిందూదేశ చరిత్ర

చెప్పెదను. ఈస్టిండియా కంపెనీవారి పాలనలోను, ఇంకను అంతకుముందు మహమ్మదీయ పరిపాలనలోను ఈస్టిండియా కంపెనీ వారు తమ వ్యాపార లాభముకొఱకు ఈ చేతిపనిని ఎట్లు క్షీణింప చేసినారో, చివరకు దీని మెడ నులిమి ఎట్లు చంపివేసినారో విస్తారముగా వివరించెదను. అటుతరువాత తక్లీ నిర్మాణమును గుఱించి బోధించెదను. ఒక మట్టిబిళ్ళగాని, ఎండిన పిండిబిళ్ళగాని తెచ్చి దానిమధ్యలో వెదురు పుల్లను గ్రుచ్చియుండవలెను. ఇటువంటి తక్లీలు బీహారులోను, బెంగాలు లోను కొన్నిచోట్ల కనబడుచున్నవి. తరువాత మట్టిబిళ్ళకు బదులు పెంకుబిళ్ళను తగిలించెడివారు. అనంతరము మనకాలములో పెంకు బిళ్ళకు బదులు, ఇనుము, ఉక్కు లేక ఇత్తడి బిళ్ళలను, వెదురు పుల్లలకు బదులు సన్నని ఇనుపచువ్వలను వాడుచున్నాము. ఇక్కడ కూడ ఆ బిళ్ళలు ఆ సైజులో మాత్రమే ఎందుకు ఉండవలెనో, ఆ చువ్వలు అంతపొడుగుమాత్రమే ఎందుకుండవలెనో ఈ మొదలయిన విషయములు బోధించిన ఎంతో ఉపయోగకరము. కాని తరువాత ప్రత్తి, దాని పుట్టుచోటు, దాని రకములు, ఇప్పుడు ఇండియాలో ఏ యే ప్రదేశములలో అది పండుచున్నది, ఈ మొదలయిన విషయము లన్నియు తరువాత పాఠములలో బోధింపబడును. ప్రత్తిపంటకు ఎటు వంటి భూమి కావలెను, దాని వ్యవసాయమెట్లు చేసెదరు ఈ విషయ ములు సయితము చెప్పెదము. ఈ విధముగా కొంచెము వ్యవసాయ భాగముకూడ బోధచేయబడును.

ఈ సంగతులన్నియు పిల్లలకు బోధించుటకుగాను ఉపాధ్యా యుడు ఎన్నోవిషయములు నేర్చుకొని జీర్ణముచేసికొని యుండవలెను. వడుకునూలు ఎన్నిగజములున్నదో లెక్కకట్టుట, ఎన్నవ నెంబరు నూలో లెక్కతీయుట, చిలపలు లెక్కించుట, సాలెవానికిచ్చు చిలపలు లెక్కచూచుట, ఫలానా రకము నేతబట్టకు పడుగుపేకలలో పేకకు ఇన్ని అడ్డపోగులుండవలెనని లెక్కకట్టుట ఈ మొదలగు విషయ

ములు నేర్పుటలో ప్రారంభగణితమంతయు బోధింపవచ్చును. ప్రత్తిని సాగుచేయుట మొదలు, బట్ట తయారగువఱకుగల అంతర్దశలు అనగా ప్రత్తి పరుట, గింజలు విడదీయుట, ఏకుట, వడుకుట, సరిచేయుట, నేయుట ఈ మొదలగు వానిని గుఱించిన శాస్త్రీయచర్చ, చరిత్ర, గణితము బోధచేయబడును.

విద్యార్థికి చేతిపనిద్వారా శారీరిక, మానసిక, ఆత్మిక విద్యను సాంగముగా బోధించుటయే ప్రధానోద్దేశము. చేతిపనిలోని అంతర్దశలను బోధించుచు, విద్యార్థిలోని నిగూఢశక్తులను వెలికి తీయవలెను. చరిత్ర, భూగోళము, గణితములకు సంబంధించిన పాఠములన్నియు చేతిపనికి సంబంధించినవే అయియుండవలెను.

---

# 3 బుద్ధి వికాసమా, బుద్ధి విక్షేపమా?

ఈమధ్య నేను తిరువాన్కూరు, మదరాసు ప్రాంతములలో సంచారము చేయుచున్నపుడు నన్ను చూచుటకు కొందఱు విద్యార్థులును, బుద్ధి విశారదులును వచ్చియుండిరి. వారిని చూడగా, వారిలో బుద్ధివికాసముకంటె బుద్ధివిక్షేపము ఎక్కువగా గోచరించినది. దానికి కారణము ఇప్పటిచదువులే. ఈచదువులు బుద్ధివిక్షేపమునకు దారితీసి, మనస్సును పెడదారులపెట్టించి, దాని వికాసమునకు బదులు, దాని ఉన్నతికి ఆటంకము కలుగజేయుచున్నవి. నేను సేవాగ్రామములో చేసిన పరిశోధనవల్లకూడ నాకీ సంగతియే ధ్రువపడినది. కాని నా పరిశీలనలు పూర్తికానందువల్ల ఇప్పుడే ప్రామాణికమైన అభిప్రాయము చెప్పుటకు వీలులేదు. విద్యాపద్ధతిని గుఱించిన నా అభిప్రాయములు ఈనాటివికావు. 1904 లో దక్షిణాఫ్రికాలో నేను ఫినిక్సు ఆశ్రమము స్థాపించినప్పటినుండియు నాకీ యభిప్రాయములే యుండినవి.

బుద్ధి వికసింపవలెనన్న, శరీరాంగములైన చేతులు, కాళ్ళు ముక్కు, కన్నులు, చెవులు మొదలగువానికి తగిన పరిశ్రమ, శిక్షణ యివ్వవలెను. అప్పుడే నిజమైనవిద్య కాగలదు. అనగా బాలుని శరీరావయవములను మంచి విచక్షణశక్తితో వికసింపచేసిన యెడల వాని బుద్ధివికాసముకూడ అత్యంత శీఘ్రముగాను, సర్వోత్తమముగాను కాగలదు. మనస్సు, శరీరము వికసించుటతోపాటు ఆత్మకూడ సరిసమానముగా వికసించుచుండవలెను. అట్లు జరుగక, మొదట చెప్పిన రెండు మాత్రమే వికాసము చెందినయెడల కొంతభాగము మాత్రమే వృద్ధిచెందినదని చెప్పవలసివచ్చును. ఆధ్యాత్మిక శిక్షణ యనగా హృదయమునకిచ్చు శిక్షణయని నా యభిప్రాయము. బాలకునియందు గల

శరీర, ఆత్మశక్తులను వృద్ధిపొందించినప్పుడే, బుద్ధివికాసము పూర్ణముగా ఏర్పడినదని చెప్పవలెను. అవి అన్నియు అవిభక్తమగు ఏకవస్తు స్వరూపములని గ్రహింపవలెను. ఈ సిద్ధాంతము నంగీకరించిన యెడల, మేము విడివిడిగా, కొంచెము కొంచెముగా వానిని వృద్ధిపొందించెదమని చెప్పుటలో అర్థములేదు. పైన చెప్పిన శారీరిక, ఆత్మిక, మానసిక శక్తుల పెరుగుదలలో సరియయిన సమన్వయము, సంయోగము లేనందువల్ల కలిగెడు అనర్థములను మనము చూచుచునే యున్నాము. అవి మనచుట్టును ఆవరించియే యున్నవి. కాని మనకు ప్రస్తుతము గల విషమ సాంగత్యములవల్ల వానిని చూడలేకపోవుచున్నాము. మన గ్రామప్రజల సంగతి ఆలోచింతము. వారు బాల్యమునుండి ఉదయము మొదలు రాత్రి పరుండువఱకు పశువులవలె పొలములలో పాటుపడుచుందురు. వారు పశువులమధ్యనే మెలగుచుందురు గదా! వారు నిత్యము విసుగు విరామములేకుండ ఆ గాడిద బరువును మోయవలసినదే. వారికి జ్ఞానప్రకాశముగాని, జీవితానందము గాని లేదు. మానసిక, ఆత్మిక వికాసమునకు దారి దొరకనందువల్ల వారు పశువుల క్రింద జమపడిపోయినారు. వారి జీవితము దుఃఖపూర్ణము. ఎట్లో కన్నులు మూసికొని కాలక్షేపము చేయుచుందురు. ఇంక మఱియొక వంకచూతము. మన నగరములలోని విద్యాలయములలోను, కళాశాలలలోను చెప్పబడునట్టిది పేరునకు విద్యయేగాని దానిని నిజమునకు బుద్ధివిక్షేపమనవలెను. అక్కడ మానసిక శిక్షణ వేరు, శరీర శిక్షణ వేరు, అనియే అక్కడ వారి యభిప్రాయము. శరీరము ఆరోగ్యవంతముగా నుండుటకు శరీరవ్యాయామము కావలెను గనుక ఆ పేరుతో చిత్రనాటక మాడుచుందురు. అది పరమ పాపిష్ఠిపద్ధతి. దానివలన ఎవరికిని లాభము కలుగదు. ఆ విద్యాలయములలో చదివి వచ్చిన ఒక పడుచువానికిని, ఒక కూలివానికిని శరీరకష్టము విషయమయి పోటీ పెట్టినయెడల ఆ పడుచువాడు ఏమాత్రము నిలువలేడు. చిన్న

బరువెత్తుకొమ్మందుమా, తలపోటని చతికిలబడును. సూర్యకిరణములలో రవంత నిలుచుండెనా, ముచ్చెమటలు పోసి మూలబడగలడు. అసలు విశేషమేమనగా ఇదంతయు న్యాయమేయని తలచుచుండుట. ఇక ఆత్మశక్తులను గాలికి విడిచిపెట్టెదరు. అందువల్ల అవి ఎట్లును క్రమ పోషణ లేక పెరుగుచుండెడి అడవిమొక్కలవలె నియమ రహిత ముగా పెరుగుచుండును. అందువలన నైతిక, ఆత్మిక విక్షేపము గలుగుచున్నది. ఇదేదో ఘనకార్యమని సంతోషింతురు.

ఇంక ఒక బాలకుని తీసికొందము. అతనికి చిన్నతనమునుండియు ఆత్మశక్తులు వృద్ధిపొందుటకు తగిన శిక్షణ యివ్వబడుచుండును. అతనికి వడకు, వడ్రంగము, వ్యవసాయము మొదలగు ఉపయోగ కరమగు వృత్తి విద్యలో ప్రవేశపెట్టి ఆ విద్యకు సంబంధించిన శాస్త్ర జ్ఞానము, మెలకువలు, పరికరముల ఉపయోగము, నిర్మాణము మున్నగు విషయములను పూర్ణముగా బోధించితిమనుకొనుడు. అప్పు డతడు సుందర శరీరమును పెంచుకొనుటయేగాక ఎంతో బుద్ధి వికా సమును పొందగలుగును. ఆ వికాసము కేవలము పుస్తకములవల్ల వచ్చినదిగాక, నిత్యానుభవమువల్ల అరూఢమయి యొప్పుచుండును. అతనికి తన వృత్తిని మిక్కిలి నిపుణముగాను, శాస్త్రానుగుణముగాను నడపుకొనుటకు తగిన గణితము, శాస్త్ర విషయములు బోధింపబడుట వలన, మంచి మానసిక శిక్షణ గలుగుచున్నది. ఇంక దీనికితోడు, మనోరంజనమునకుగాను అతనికి కొంత సాహిత్య పరిచయముగూడ గలిగించితిమా శారీరిక, మానసిక, ఆత్మిక వికాసమున కవసరమగు పూర్ణవిద్య అతనికి లభించినదన్నమాట. మానవుడనగా కేవలము మనస్సుగాని మొద్దు పశుశరీరముగాని, ఆత్మగాని కాదుగదా. అందు వలన నిండు మనుష్యుడగుటకుగాను ఈ మూడింటి సమన్వయమే కావలసియున్నది. అప్పుడది నిజమయిన అర్థశాస్త్ర సమ్మతవిద్య యని పించుకొనును. స్వతంత్రము వచ్చిన వెనుకనే యిటువంటి విద్యా

పద్ధతికి పూనుకొందుమని చెప్పుట గుఱ్ఱము ముందు బండికట్టుదమని చెప్పుట కాగలదు. మనము మన కోట్లకొలది ప్రజలకు పై విధముగా విచక్షణతో వృత్తిద్వారా విద్యలను బోధించితిమా, వారు ప్రజాసేవ కొఱకే జీవించుచున్నామని తెలిసికొనగలరు. పైగా స్వరాజ్యము కూడ మిక్కిలి వేగముగా రాగలదు.

(హరిజన్ 8-5-37)

# 4 జాతీయవిద్య - ప్రధాన విషయములు

మే 22 వ తేదీన తీతల్ గ్రామములో గుజరాతు జాతీయ విద్యాలయోపాధ్యాయుల మహాసభ జరిగినప్పుడు, ఆ సభా సంధాన కర్త ఆహ్వానితులకు ఈ దిగువ ప్రశ్నావళిని పంపియున్నాడు. దానిని గురించిన వ్యాఖ్య అనవసరము.

1. మన గ్రామస్థుల అవసరములకు తగినట్టిదియు, వారికి శ్రేష్ఠముగా ఉపయోగపడునట్టిదియు అయిన విద్యయేది? అటువంటి విద్యను గ్రామములలో వ్యాప్తి చేయుటెట్లు?
2. గ్రామీణుల నిరక్షరాస్యతను, అజ్ఞానమును తొలగించుటెట్లు?
3. బుద్ధివికాసమునకు అక్షరాస్యత అత్యంతావశ్యకమా? చదువుట, వ్రాయుటతో ప్రారంభమగు విద్యాపద్ధతివల్ల బుద్ధివికాసమున కాటంకము గలుగునా?
4. యావత్తు విద్యాబోధనకు వృత్తివిద్యనే యాధారముచేయుటను గురించి మీ యభిప్రాయమేమి?
5. ముందు ముందు ఇప్పటి జాతీయ విద్యాలయముల నడక యెట్లుండవలెను?
6. విద్యాబోధ యావత్తు పిల్లల మాతృభాషలో జరుగవలెనను విషయమై మీ యభిప్రాయమేమి?
7. ఇప్పటి విద్యాలయములలో ఏయే జాతీయ విద్యా ప్రధాన లక్షణములు లోపించినవి?
8. ప్రాథమిక, మాధ్యమిక విద్యలలో, హిందీ-హిందూస్థానీని నిర్బంధముగా బోధించుటను గురించి మీ యభిప్రాయమేమి?

ఈ విషయములను గుఱించి మీ అభిప్రాయములు చెప్పవలసిన దని కోరినప్పుడు వారు ఈవిధముగా సమాధానము చెప్పియున్నారు. సారాంశమును పొందుపఱచుచున్నాము.

గ్రామస్థుల అవసరములకు తగిన ఉత్తమ విద్యను వారికి అంద జేయవలెనన్న మనము విద్యాపీఠమును గ్రామములోనే స్థాపింప వలెను. దానిని మనము ట్రెయినింగు విద్యాలయముగా మార్చవలెను. అట్లు మార్చి అక్కడ గ్రామావసరములకు తగినట్టియు ఆచరణతో గూడినట్టియు శిక్షణను ఉపాధ్యాయున కివ్వవలెను. నగరములో ట్రెయినింగు విద్యాలయము నెలకొల్పి, అక్కడ గ్రామీణ శిక్షణను ఉపాధ్యాయుల కివ్వరాదు. అప్పుడు వారికి గ్రామ విషయములం దాసక్తిని పుట్టింప జాలరు. నగర వాస్తవ్యులకు గ్రామములందు ఆసక్తిని కలుగజేయుటయు, వారిని గ్రామములలో నివసించునట్లు చేయుటయు సామాన్యమైన పనులుకావు. మా సేవాగ్రాం అనుభ వమువల్ల, ఈ విషయము నాకు మఱింత ధ్రువపడుచున్నది. మేము ఒక సంవత్సరమునుండి ఈ గ్రామములో నివసించుచున్నప్పటికి గ్రామీణులుగా మాఱిపోయితిమనియు, గ్రామసేవ నిమిత్తము, ఆ గ్రామస్థులు మేము ఒక్కటే అయిపోయితిమనియు చెప్పజాలను.

ఇక ప్రారంభవిద్యను గుఱించి స్పష్టమయిన నా అభిప్రాయ మును చెప్పెదను. అక్షరములు వ్రాయుట, చదువుటతో ప్రారంభ మయిన విద్యవల్ల విద్యార్థికి బుద్ధివికాసము కలుగజాలదు. ఆ బాలకు నకు ముందుగా భూగోళము, చరిత్ర, నోటిలెక్కలు, వడుకు మొద లయిన వృత్తి ఒకటి నేర్పెదను. అటుపిమ్మట అక్షరములు నేర్పెదను. ఈ మూడిటివల్లను అతనికి బుద్ధివికాస మేర్పడవలెను. తక్లీవల్లగాని, రాటమువల్లగాని బుద్ధి యెట్లు వికసింపగలదని అడుగవచ్చును. శాస్త్రబోధతో వానిని త్రిప్పిన యెడల అద్భుత వికాసము కలుగ గలదు. వడుకులోని ప్రతి భాగమును గుఱించి నీవు బాలకునికి బోధ

చేయుటవల్లను, తక్లీగాని రాటముగాని ఎట్లు నిర్మింపబడుచున్నవో వివరించుటవల్లను, ప్రత్తిని గుఱించి వివరించి దానికిని నాగరికతకును గల సంబంధమును బోధించుటవల్లను, ప్రత్తి పండు పొలములకు అతనిని స్వయముగా తీసికొనిపోయి చూపుటవల్లను, తాను వడకిన నూలును లెక్క పెట్టించుటవల్లను నూలునకు సమానత్వము, బలము ఎట్లు రాగలవో తెలుపుటవల్లను, అతనికి ఆసక్తిని పుట్టింప గలవు. అంతేగాక ఏకకాలమందు ఆ బాలుని చేతులకు, కన్నులకు, బుద్ధికి శిక్షణ యిచ్చినవాడ వగుదువు. ఈ ప్రారంభ శిక్షణకు ఆఱు నెలలు కావలెను. అట్లు చేసినయెడల అతడు అక్షరములు నేర్చుకొనదగిన వాడు కాగలడు. ఆ యక్షరములు వేగముగా చదువగలిగి నప్పుడు చిన్న చిన్న బొమ్మలు వ్రాయుటకు తగినవాడగును. చతుర్భుజములు, త్రికోణములు మున్నగు రేఖాసంబంధములును, చిన్న చిన్న పిట్టలును వ్రాయగలిగినప్పుడు అతనికి అక్షరములు గుండ్రముగా వ్రాయుట నేర్పవలెను. పిచ్చిగీతలు గీయించరాదు. నేను అక్షరములు నేర్చు కొన్ననాటి నా చిన్నతనము స్ఫురణకు వచ్చుచున్నది. అదెంత విసుగు పనియో నాకు తెలియును. నా బుద్ధి త్రుప్పుపట్టిపోవుచున్న సంగతి ఎవరును గుర్తింపరైరి. వ్రాత ఒక చక్కని కళయని నా అభిప్రాయము. చదువునకు మొదటనే అక్షరములు నేర్చుకొన వలెనని పిల్లవానిని బాధించుటవల్ల ఆ కళ నశించిపోవుచున్నది. అదను రాకుండగనే పిల్లవానికి అక్షరములు నేర్పుటవల్ల వ్రాత కళకును అపకారము గలుగుచున్నది. పైగా అతని బుద్ధియు మందగించుచున్నది.

గ్రామీణులకు అక్షరములు రాకపోయెనే యని మనము దిగులు పడరాదు. అయ్యో, వారిని అజ్ఞానము ఆవరించి యున్నదే యని బాధపడవలెను. కనుక వయోజనవిద్యాబోధకు కూడ, మంచి సమర్థులగు ఉపాధ్యాయు లున్నయెడల, మంచి పాఠ్య ప్రణాళికను నిర్ణయించుకొని, ఆ ప్రకారము బోధజరిపిన యెడల గ్రామీణుల

అజ్ఞానము పొఱద్రోలవచ్చును. ఆ విధముగా వయోజనులకు బుద్ధి వికాసము గలిగింపవచ్చును. దీనివల్ల వారికి అక్షరములు నేర్పవలెనని అర్థముకాదు. విద్యాసాధనకు వర్ణమాల అవసరము కాదని నేను ఎన్నడును చెప్పను. ప్రొఫెసరు లాబాక్ అనువారు అక్షరములు సులభముగా బోధించుటకు గొప్ప పరిశ్రమచేసి యున్నారు. ప్రొఫెసరు భాగవత్ అనువారు కూడ ఆచరణయోగ్యమగు సాధనలను ఎన్నిటినో చేసియున్నారు. ఈ భాగవత్‌గారిని తమకు తీరినప్పుడు సేవాగ్రామము రావలసినదని, అక్కడి (స్త్రీ) పురుష బాలకులకు తమ నూతన పద్ధతి ప్రకారము బోధింపవలసినదనియు కూడ కోరియుంటిని.

చేతిపనుల ఆధారముపైన విద్యాబోధన చేయుటను గురించి నాకు రవంతకూడ సందేహములేదు. విద్య అనగా మనుష్యులలో దాగియున్న శక్తులను వెలికి దీయుటయని యర్థము. ఈ పని భారత దేశములోని విద్యాలయములలో జరుగుచున్నదని నేనను. అక్కడ బుద్ధిభ్రష్టత మాత్రమే జరుగుచున్నది. ఏవో కొన్ని విషయములు బుద్ధికి అందుచుండును. కాని మొదటినుండియు విద్యార్థికి గ్రామ పరిశ్రమలనే ఆధారము చేసికొని విద్యాబోధన జరిగినయెడల ఆ బుద్ధికి క్రమశిక్షణ యేర్పడి వికాసము గలుగుటయేగాక అంతర్నిహితమైన బుద్ధి శక్తివలన గౌణముగా ఆత్మవికాసము గలుగుటకును వలను ఏర్పడును. ఇట్లు చెప్పితినని, నేను లలితకళలను అనాదరించుచుంటినని ఎవరును తలంపరాదు. కాని వానినితగనిచోట్ల ప్రవేశపెట్టను. అనుచిత స్థలమున ఉంచబడిన వస్తువు మురికియని పెద్దలు లెస్సగానే చెప్పి యున్నారు. ప్రమాణము చెప్పెదను చూడుడు. మన కన్నులయెదుట ఎంత చెత్తసారస్వతము తయారగుచున్నదో, ఎన్ని టన్నుల పుస్తకములు, అసభ్య విషయములతో కూడినట్టివి వ్యాప్తమగుచున్నవో పరిశీలించినవారికి బోధపడగలదు.

(హరిజన్ 5-6-37)

# 5 అక్షరాస్యత

విద్యను గుఱించి ఈ పత్రికలో నా అభిప్రాయములు వెల్లడించుచుంటిని. వానిని పురస్కరించుకొని కొందఱు తమ అభిప్రాయములు కూడ నాకు పంపియున్నారు. వానిలోని ప్రధాన విషయములను ఈ పత్రికలో ప్రకటింపదలచితిని. అక్షరాస్యతకు నేను వ్యతిరేకుడనని తలచి ఒక విద్వాంసుడు ఒక వ్యాసము వ్రాసిపంపియున్నాడు. దానికి సమాధానము చెప్పెదను. నేను వ్రాసిన వ్యాసములలో ఎక్కడను కూడ అట్టి అభిప్రాయమునకు తావేలేదు. నేననుకున్న ప్రకారము విద్యాబోధ జరిగినయెడల చేతిపనులవల్లనే విద్యఅంతయు రాగలదని నేను చెప్పియుండలేదు. అక్షరాస్యతకూడ అవసరమని చెప్పుచుంటిని. అయితే నా ప్లానుప్రకారము విద్యార్థి మొదట తన చేతితో పనిముట్లను పట్టుకొనవలెను. ఆ తరువాత కలమో, పెన్సిలో పట్టుకొని వ్రాయవచ్చును. జీవితములో కన్నులు ఎన్నో విషయములు చూచుచుండును గనుక బొమ్మలరూపములో ఉన్న అక్షరములను, మాటలను చదువగలవు. చెవులు వాని పేరులను, అర్థములను గ్రహింపగలవు. ఈ శిక్షణ ఎంతో సహజముగాను, ఆసక్తిజనకముగాను ఉండును. ఈ దేశములో ఇంతకంటె వేగముగాను, చౌకగాను చెప్పెడి చదువు మఱియొకటి ఉండదు. కనుక నా పాఠశాలలోని బాలకులు వ్రాయుటకంటె మిక్కిలి వేగముగా చదువగలరు. నా గురువుల కటాక్షమువలన నేను నేటికిని పిచ్చిగీతలు గీయుచున్నట్లువలెగాక వారు ముచ్చటగా వ్రాయగలరు. వారు చూచిన వస్తువులను అక్షరములను తప్పులేకుండ గుర్తింపగలుగుదురు. నా మనస్సులో ఉన్న విద్యాలయములే ఎన్నటి కయినను అమలులోనికి రాగలిగినయెడల వేగముగా చదువుటలోగాని,

తప్పులులేకుండ వ్రాయుటలోగాని మహోన్నతిని సాధించిన విద్యాలయములకంటె శ్రేష్ఠముగాఉండగలవని ఘంటాపథముగా చెప్పగలను. ఈరోజులలో చాల విద్యాలయములలో తప్పులు వ్రాయుచుండుటయే జరుగుచున్నదిగదా. సేవాగ్రామములోని బాలకులు ప్రాతపద్ధతి ప్రకారమే వ్రాయుచు పలకలు, కాగితములు, కలములు చెడగొట్టుచున్నారు.

(హరిజన్ 28-8-37)

#  నవీన విద్యా లక్ష్యమేమి?

[వర్ధాలోని హిందుస్తానీ తాలిమీ సంఘమువారు ప్రకటించుచున్న 'నయీ తాలీమ్' అను మాసపత్రిక ప్రారంభ సంచికకు పంపిన సందేశము.]

నవీన విద్యలోని క్రొత్తదనమేమో, మూలసూత్రములేమో గ్రహించుట అవసరము. ప్రాతవిద్యాపద్ధతిలోగల శుభలక్షణము లన్నియు ఈ విద్యలో ఉండనే ఉండును. అంతేగాక, క్రొత్త విషయములు చేర్పబడును. నవీన విద్యలో నూతనత్వము వచ్చినయెడల దాని పరిణామ మిట్లుండవలెను. ఇప్పుడు మనల నావరించిన నిరాశ తొలగిపోయి ఉత్సాహము గలుగవలెను. మన దరిద్రము ఆకలిబాధ తొలగి జీవిత నిర్వహణమున కవసరమగు సాధన సంపత్తి అమరియుండవలెను. నిరుద్యోగముపోయి, చేతినిండ పని, పరిశ్రమ ఉండవలెను. విభేదములు పోయి ఏకభావన రావలెను. మన బిడ్డలకు చదువను, వ్రాయను రావలెను. దానితోపాటు ఒక చేతిపని రావలెను. దానిద్వారా జ్ఞాన సముపార్జన జరుగవలెను.

(ఉత్సంగ—14-10-38)

# రెండవ భాగము

# నవీన విద్యామహాసభ

## 7 ఆలోచింపవలసిన విషయములు

వర్ధాలోని మార్వాడీ హైస్కూలునకు నవభారత విద్యాలయ మని పేరుపెట్టబడినది. దానికి రజత జయంతి మహోత్సవము జరుగు చున్నది. ఈ పత్రికలో నేను నవీనవిద్యనుగురించి కొన్ని క్రొత్తవిషయ ములు వ్రాయుచున్నానుగదా. వానినిగురించి చర్చించుట మంచిదని తలచి ఆ విద్యాలయ నిర్వాహకులు జాతీయ విద్యాభావ పూరితులను కొందఱిని పిలిపించుట యుక్తమనియెంచి, అందుకు ఈ అదను మంచిదని మహాసభను ఏర్పాటుచేసి యున్నారు. కార్యదర్శి శ్రీ శ్రీమన్నారాయణ అగర్వాలా ఇటువంటి మహాసభ జరుపవచ్చునా, కూడదా యని సంప్రదించి నన్ను అధ్యక్షునిగా ఉండవలసినదని కోరి యున్నాడు. నే నంగీకరించితిని. కనుక ఈ మహాసభ వర్ధాలో అక్టో బరు 22, 23 తేదీలలో జరుగును. ఇందుకు ఆహ్వానింపబడినవారు మాత్రమే హాజరుకావలెను. ఈవిషయములో మిక్కిలి శ్రద్ధగలట్టియు, మా ప్రయత్నములకు తోడుపడగలట్టియు కొందఱికొఱకు మాత్రమే సభలో అవకాశము కలుగజేయబడినది. ఈ మహాసభ ప్రదర్శనమునకు గాను ఏర్పాటుచేయబడలేదు. ఇందు ప్రేక్షకులుండరు. ఇది కేవలము వ్యవహార నిర్వహణసభయే. పత్రికా ప్రతినిధులకు పరిమితముగా టిక్కెట్లు ఇవ్వబడును. పత్రికా ప్రతినిధులు ఎవరో ఒకరిద్దఱనుమాత్రమే పంపి వారు వ్రాసికొనివచ్చిన విషయాలను తాముకూడ కాపీచేసి కొనుట మంచిదని సలహా యిచ్చుచున్నాను.

ఈ మహాకార్యమును విశ్వాసముతోను, వినయముతోను, నిష్కల్మష చిత్తముతోను సాధింపదలచి యున్నాను. ఎవరయినను నూతన విషయములు చెప్పినప్పుడు, దానిని నేర్చుకొనుటకును అవసరమయినచో నాపద్ధతులు మార్చుకొనుటకును, సవరించుకొనుటకును సిద్ధముగానున్నాను.

ఈ మహాసభలో నేను ప్రవేశపెట్టబోవునవి, నాకు ప్రస్తుతము తోచినవి అయిన అంశములను ఈ క్రింద పొందుపఱచుచున్నాను.

1. ఇప్పటి విద్యా పద్ధతి దేశావసరములకు ఏవిధముగాను, ఏ రూపములోను సహాయపడదు. ఉన్నత విద్యలో ఇంగ్లీషు బోధనామాధ్యమమగుటవల్ల విద్యార్థికులగు కొద్దిమందికిని, విద్యావిహీనుల పెక్కండ్రకును మధ్య శాశ్వతముగా నొక అడ్డగోడ పెట్టినట్లయినది. అట్లగుటవల్ల జ్ఞాన ప్రవాహము సామాన్య జనులవఱకు దిగజాఱుటలేదు. ఇంగ్లీషునకు అత్యధిక ప్రాముఖ్యమిచ్చుటవలన విద్యార్థికులపైన మోయరాని బరువు పడినది. దానిమూలముగ శాశ్వతముగా వారి బుద్ధి వికాసమునకు ఆటంకము ఏర్పడినది. పైగా స్వదేశములోనే వారు క్రొత్తవారయిపోయినారు. ఈ విద్యావంతులకు వృత్తి విద్య రాకపోవుటవల్ల వారు ఉత్పాదన కార్యములకు అసమర్థులగుటయేగాక, శారీరకముగా దుర్బలులై పోయినారు. ప్రారంభిక విద్యకుగాను ఖర్చుచేయు ద్రవ్యమంతయు వట్టి దండుగ. కారణమేమనగా అక్కడ బాలురు తాము చదివిన చదువు వెంటనే మఱచిపోవుచున్నారు. లేదా ఏ కొంచెమయిన నేర్చియున్న యెడల, ఆ చదువు గ్రామావసరములకుగాని, పట్టణావసరములకుగాని నిరుపయోగమగుచున్నది. ఇప్పటి విద్యాపద్ధతివల్ల ప్రధానమైన పన్నులు చెల్లించువారి బిడ్డలకు ఏమాత్రము ప్రయోజనము కలుగుచుండుటలేదు.

2. ప్రారంభిక విద్య ఏడేండ్లపాటు జరుగవలెను. అప్పటికి ఇంగ్లీషు లేకుండ ఇతర విషయములలో మెట్రిక్కు స్థాయి రావలెను. పైగా ఒక గట్టి వృత్తి రావలెను.

3. బాల బాలికలకు సర్వతోముఖాభివృద్ధి గలుగుటకుగాను, వీలయినంతవఱకు లాభప్రదమగు వృత్తిద్వారా శిక్షణ ఇవ్వవలెను. వృత్తి విద్యవల్ల రెండు లాభములు కలుగవలెను. విద్యార్థి తాను నేర్చిన వృత్తివల్ల తయారయిన వస్తువులతో స్కూలు జీతము చెల్లింపవలెను. రెండవది అతడు నేర్చిన వృత్తిద్వారా సర్వతోముఖ వికాసము పొందవలెను.

బాలుర శ్రమవల్లవచ్చిన ఆదాయముతో భూములు, ఇండ్లు పరికరములు సంపాదింపవలెనని ఆశింపరాదు.

ప్రత్తి, ఉన్ని, పట్టు విషయములో ఏరుట, శుభ్రము చేయుట, ప్రత్తి విషయములో గింజలు తీయుట, ఏకుట, వడకుట, రంగులు వేయుట, సరిచేయుట, వడుగు తయారు చేయుట, జములుదారము పురివేయుట, డిజైనులు, నేత, అల్లికలు, కుట్టుపని, కాగితముచేయుట, కోత, బైండింగు, పెట్టెలు చేయుట, బొమ్మలుచేయుట, బెల్లము చేయుట ఇవి నిస్సందేహమైన వృత్తులు. వీనిని సులభముగా నేర్చుకొనవచ్చును. ఎక్కువ పెట్టుబడిలేకుండ నడపుకొనవచ్చును.

ఈ ప్రారంభిక విద్యవలన విద్యార్థులు తమ అన్నమును తాము సంపాదించుకొనునట్లుండవలెను. ప్రభుత్వము ఆవృత్తులు నేర్చుకొన్న విద్యార్థులకు పని చూపించెదమని గ్యారంటీ చేయవలెను. విద్యార్థులవల్ల తయారయిన వస్తువులకు ప్రభుత్వము ఒక ధర నిర్ణయించి వానిని ఆ ప్రభుత్వమే కొనవలెను.

4. ప్రయివేటు వ్యక్తులే ఉన్నత విద్యను నడపవలెను. ఆ విద్య దేశమునకు కావలసిన వివిధ పరిశ్రమలు, వృత్తి విద్యలు, లలిత కళలు మొదలయినవానికి ఉపయోగపడవలెను.

ప్రభుత్వ విశ్వవిద్యాలయములు కేవలము పరీక్షా సంస్థలుగా నుండవలెను. పరీక్షా రుసుము ద్వారా స్వయంపోషకములుగా నుండవలెను.

విశ్వవిద్యాలయములవారు యావత్తు విద్యా విధానమును పరిశీలించుచుండగలరు. వివిధ విద్యాశాఖలకు పాఠ్యక్రమములు తయారు చేసెదరు. ఆయా విశ్వవిద్యాలయముల అనుమతి లేనిదే ప్రయివేటు విద్యాలయములను నడపరాదు. యూనివర్సిటీ చార్టర్లు బుద్ధిమంతులు, సమర్థులతో గూడిన ప్రతిసంస్థకును విరివిగా ఇవ్వవలెను. ప్రభుత్వమునకు కేంద్ర విద్యాశాఖను నడపుటకు వ్యయము తప్ప, అట్టి యూనివర్సిటీలవల్ల ఖర్చుతగులుబాటు ఏమియుఉండరాదు. పై ప్రణాళిక గలదుగదా అని, ప్రభుత్వము తమ అవసరములకు గాను విద్యార్థికుల సమావేశములు జరుపకుండ ఉండరాదు.

ఈ ప్లాను యావత్తు అంగీకరింపబడిన యెడల యువకులను, భావి పౌరులను విద్యావంతులుగా చేయునట్టి గురుతర బాధ్యత ప్రభుత్వమునకు తప్పిపోవును.

(హరిజన్ 2-10-37)

## 8 ప్రధాన విషయము

[1937 అక్టోబరు 22, 23 తేదీలలో వర్ధాలో జరిగిన విద్యా మహాసభలో గాంధీజీ ఒసంగిన ప్రారంభోపన్యాసము—మొదట గాంధీజీ, తమ ఆహ్వానము నందుకొని వచ్చినవా రందరకు నమస్కరించిరి.]

"నే నిక్కడ అధ్యక్షునిగా నుంటినా, సభ్యునిగా నుంటినా? నేను కొంతకాలమునుండి కొన్ని అభిప్రాయములను వెల్లడించు చుంటిని. వానిమీద మీ అభిప్రాయములు సలహాలు నాకు కావలెను. ముఖ్యముగా వ్యతిరేకులనుండి కోరుచున్నాను. నాకు ఆరోగ్యము సరిగా లేనందువలన ఈ సభా మంటపమునకు వెలుపల నున్న మిత్రులను కలిసికొనుటకు అవకాశములేదు. అందువలన ఇక్కడ నున్న మిత్రులు నాతో దాపరికము లేకుండ, స్వేచ్ఛగా, స్వతంత్రముగా అన్ని సంగతులను చర్చింపవలెనని కోరుచున్నాను. నా ప్రతిపాదనలు ప్రారంభ విద్యకును, కళాశాల విద్యకును కూడ సంబంధించి యున్నవి. అయితే ప్రస్తుతము మీరు ప్రారంభవిద్యను గురించియే చర్చింపదగుదురు. మాధ్యమిక విద్యనుకూడ నేను ప్రాథమిక విద్యలోనే చేర్చియున్నాను. కారణ మేమనగా ఈ ప్రారంభవిద్య ఒక్కటే మన గ్రామములలో నివసించుచున్న ప్రజలలో చాల కొద్దిమందికి మాత్రమే అందుబాటులో ఉన్నది. నేను 1915 నుండి గ్రామములలో సంచారము చేయుచున్నాను గనుక మన గ్రామీణులనుగురించి నాకు పరిచయము గలదు. పల్లె ప్రాంతములలో ఈ గ్రామీణ బాలబాలికలు విద్యాహీనులుగా నున్నారు. నేను ముఖ్యముగా వీరికి కావలసిన అవ

పరములను గురించియే మాట్లాడుచున్నాను. నేను వందలకొలది కళాశాల విద్యార్థులను కలిసికొని వారితో హృదయము విప్పి మాట్లాడి యున్నాను. వారికిని నాకును ఉత్తరప్రత్యుత్తరములుజరుగు చుండును. వారి అవసరములు, లోపములు, వారిని బట్టుకొన్న వ్యాధి నాకు తెలియును. ఏమయినను నాకు కళాశాల విద్యలో అను భవములేదు. అందువలన మీరిప్పుడు ప్రారంభవిద్యను గుఱించి మాత్రమే ఆలోచింపదగుదురు. ప్రారంభ విద్యావిషయము తేలి పోయెనా, ఇక రెండవది యయిన కళాశాల విద్యకూడ పరిష్కరింప బడగలదు.

## చేతివృత్తి ద్వారా విద్య :

ఇప్పటి ప్రారంభ విద్యా విధానము వ్యయభూత మగుటయేగాక అపకారకమని కూడ నా స్పష్టమయిన అభిప్రాయము. చాల మంది బాలురు తమ తలిదండ్రులకును తమ కులవృత్తికిని పనికిరాక పోవుచున్నారు. దురభ్యాసములు నేర్చుకొనుచున్నారు. బస్తీ బడాయి వేషములు వేయుచున్నారు. ఏవేవో పిచ్చి పిచ్చి విషయములలోని నాలుగు మాటలు నేర్చుకొనుచున్నారు. అవి ఏ వయినను కావచ్చు గాని చదువు మాత్రము కాదు. కనుక ఈ దుర్గుణములు పోవుటకు చేతిపనిద్వారా విద్య నేర్పవలెను. అదే దీనికి మందు. ఈ విషయములో నాకు కొంత అనుభవమున్నది. నేను దక్షిణాఫ్రికాలో టాలుస్టాయి ఫారములో ఉన్నప్పుడు నా కుమాళ్ళకు, అక్కడ నున్న బిడ్డలకు చదువు చెప్పితిని. అక్కడ అన్ని కులాలు, మతాలవారు ఉండిరి. మంచిబిడ్డలు, చెడ్డబిడ్డలు, నిర్లక్ష్యము గలవారు కూడ నుండిరి. వారికి చేతిపని అనగా వడ్రంగము, చెప్పులు కుట్టుట ద్వారా విద్య నేర్పితిని. నేను 'కాలనుబాకు' నుండి చెప్పులు కుట్టుట నేర్చుకొంటిని. అతడు ట్రాపిస్టు ధర్మసంస్థనుండి ఆ పని నేర్చుకొనెను. నేను చెప్పించిన

చదువులవల్ల నా బిడ్డలకుగాని, అక్కడి పిల్లలకుగాని చెలుపు కలుగ లేదు. అయితే నాకు నూలు వ్యాపకము లుండుటవలన ఆ చదువువల్ల నాకుగాని, బిడ్డలకుగాని తృప్తికలుగలేదు.

నేను గట్టిగా కోరునవి వృత్తులు కావు. చేతిపనిద్వారా విద్యాబోధ జరుగవలెను. యావత్తు చదువు, వర్ణమాల, చరిత్ర, భూగోళము, గణితము, భౌతికశాస్త్రము మొదలయిన వన్నియు చేతిపనివల్లనే రావలెను. మధ్యయుగములో వృత్తులతో ఇతర విషయములు చేర్చబడలేదుగదా యని ఆక్షేపణ చేయవచ్చును. కాని అప్పటి వృత్తిశిక్షణలో విద్యాప్రయోజనము లేదుగదా. ఈ కాలములో ఫలానా ఫలానా కులములలో పుట్టినవారు తమ కులవృత్తులను మఱచి, గుమాస్తా ఉద్యోగములు చేయుచు దేశమునకు ఎందుకును పనికిరాకపోవుచున్నారు. దాని పర్యవసానమేమయిన దనగా దేశములో ఏ మూలకుపోయినను, చిన్న చిన్న పల్లెగ్రామములలో గట్టి వడ్రంగికాని, గట్టి కంచరి, కమ్మరి, కమసాలిగాని కనబడదు. చేతిపనులన్నియు నశించిపోయినట్లే, చేతి రాటమును ఆదరింపకపోవుటవల్ల దానిని లంకాషైరువారు నిండుగా అభివృద్ధిలోనికి తెచ్చిరి. ఇంగ్లీషువారి పుణ్యమాయని, ఇటువంటి చేతి పనుల నెన్నిటినో వారు తమ యంత్రపరిశ్రమలుగా మార్చుకొని యున్నారు. వీనినన్నిటిని మన కన్నులార చూచుచునే యుంటిమి. పారిశ్రామిక క్రాంతిని గురించి నా యభిప్రాయము లెట్లున్నను జరిగిన పనిమాత్రము ఇది.

## తక్లీ - ఉత్పాదన ఆటవస్తువు :

చేతిపనిలోని కళానిపుణత, శాస్త్రజ్ఞానము ప్రాక్టికలు ట్రైనింగు ద్వారా చదువుచెప్పుటవల్లనే రాగలవు. దుర్గుణములు పోవుట కదే మందు. తక్లీ వడుకు శిక్షణను ఉదాహారణగా తీసికొనుడు. ఆ వడుకు నేర్పుచున్నామనగా ప్రత్తిలో ఎన్ని రకములున్నవో చెప్పవలెను.

ఇండియాలోని భిన్న భిన్న ప్రాంతములలోని నేలలు ఎటువంటివో బోధింపవలెను. ఈ చేతిపని ఎందుకు నశించిపోయినదో దాని చరిత్ర చెప్పవలెను. దానికిఉన్న రాజకీయ కారణములు చెప్పవలెను. దానిలో ఇండియాలోని బ్రిటిషుపాలనా విషయములుకూడ రాగలవు. గణితము మొదలయినవి నేర్పవలెను. నా చిన్న మనుమనిపై ఈ విద్యాప్రయోగములు చేయుచున్నాను. వాడు నిరంతరము గంతులువేయుచు, పాటలు పాడుచు కిలకిల నవ్వుచుండును. అట్టివానికి నేను బోధచేయుచుండగా ఇది చదువనే వాడు తలచుచుండుటలేదు.

నేను ముఖ్యముగా తక్లీని గుఱించి ప్రస్తావించుచున్నాను. దానిని గుఱించి అనేక ప్రశ్నలు మీరడుగుటకే అట్లు చేసితిని. దానితో చాలపని ఉన్నది. దాని శక్తి, దాని అద్భుత చరిత్ర నాకు తెలియును. వస్త్ర గృహపరిశ్రమ ఒక్కటే అందఱకును బోధింపతగినట్టిది. అదిగాక తక్లీకి ధనవ్యయమేమియు లేదు. అది ఎంతో ఉపయోగకరమయినదని ఋజువు చేయబడినది. నిర్మాణ కార్యక్రమము నమలు జరిపినందువల్లనే ఏడు రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గములు స్థాపింపగలిగితిమి. ఆ కార్యక్రమమును అమలు జరుపుట పైననే వారి విజయముకూడ ఆధారపడి యున్నది.

నేను తక్లీ విషయమయి ఏడేండ్ల శిక్షణ నిర్ణయించితిని. దానిలో ఆచరణపూర్వకముగా నేత, రంగులు వేయుట, డిజైనులు వేయుట మొదలగునవి రావలెను. మనము తయారుచేయు వస్త్రమంతయు వినియోగమగునట్టి సంప్రదాయము ఉండనేఉన్నది.

విద్యార్థుల చేతిపనులవల్ల వచ్చిన సొమ్ముద్వారా ఉపాధ్యాయుని జీతము సరిపోవలెను. కోట్లకొలది బిడ్డలకు చదువు చెప్పుటకు ఇంతకంటె మంచి ఉపాయము కనబడుటలేదు

వైసురాయి తన మిలిటరీఖర్చులు వగయిరాలు తగ్గించుకొనునంతవఱకు మనము ఓపికపట్టజాలము. ఈ ప్రారంభవిద్యలో ప్రధాన

మయిన ఆరోగ్య సూత్రములు, పారిశుద్ధ్యము, బలవర్ధకమగు ఆహారము, స్వయంసేవ, ఇండ్లదగ్గఱ తలిదండ్రులకు సాయముచేయుట మొదలగు పనులన్నియు విద్యార్థులకు బోధింపబడును. ఈతరములోని బాలకులకు పారిశుద్ధ్యము తెలియదు. స్వయం సహాయము తెలియదు. శారీరకముగా పనికిరారు. అందువలన వారికి బలవంతముగాసంగీతము, డ్రిల్లు మొదలయినవానిద్వారా శరీర పరిశ్రమ నేర్పెదను.

## ఒక్కటే మార్గము :

నేను సాహిత్య విద్యకు వ్యతిరేకుడనని కొందఱు నాపై నింద మోపెదరు. ఎన్నడును నేనట్టివాడను కాను. దానిని ఎట్లు బోధింపవలెనో ఆ ఉపాయమును మాత్రము చెప్పితిని. విద్య స్వయంపోషకముగా నుండవలెననుటకూడ కొందఱకు నచ్చలేదు. ప్రారంభ విద్యకు గాను కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టి బాలకుల విషయములో గొప్ప అన్యాయము చేయబోవుచున్నామని కొందఱనుచున్నారు. పైగా వల్లమాలిన దండుగ రాగలదనికూడ కొందఱి భయము. అట్టి భయమునకు అవకాశమే లేదని అనుభవమువల్ల తెలిసికొంటిమి. ఇంకా, బాలకులకు అన్యాయముజరుగుట, అనగా వారిపైన మోయరాని బరువు పడుచుండుట అన్నవిషయమును ఆలోచింతము. వారు వినాశములో పడిపోకుండ వారిని కాపాడుట వారిపై బరువు వేయుటాయని యడుగుచున్నాను. తక్లీ ఆడుకొనుటకుగాను పనికి వచ్చు మంచి ఆటవస్తువు. దానిని ఆటవస్తువే అనవలెను. అది ఉత్పాదన ఆటవస్తువు. నేటికికూడ బిడ్డలు తమ తలిదండ్రులకు సాయపడుచునే యున్నారు.

సేవాగ్రామములోని పిల్లలు పొలములలోనికి పోయి తమ తలిదండ్రులకు సాయపడుచునే యున్నారు. అందువల్ల ఆ పిల్లలకు నాకంటె ఎక్కువ వ్యవసాయ జ్ఞానముగలదు. బాలుడు నూలు వడక

వలెననియు, తనతలిదండ్రులకు వ్యవసాయములో తోడుపడవలెననియు ప్రోత్సహింపబడును. ఆ బాలుడు కేవలము తలిదండ్రులకు మాత్రమే చెందినవాడు కాడనియు, గ్రామమునకును, దేశమునకునుకూడ చెందిన వాడనియు అందువలన ప్రతిఫలముగా కొంతసేవ చేయవలెననియు జ్ఞానముకూడ వానికి కలుగజేయబడును. ఇదొక్కటే మార్గము. పిల్లలకు దానధర్మముగా విద్యను పంచిపెట్టినయెడల వారు నిస్సహాయులై పోగలరని నేను మంత్రులతో చెప్పదలచితిని. విద్యార్థులు తమ శరీరకష్టముతో ఉపాధ్యాయులకు జీతమివ్వగలిగినయెడల ఆబిడ్డలలో ధైర్యము, ఆత్మవిశ్వాసము ఏర్పడగలవు.

ఈ పద్ధతి హిందువులకు, ముసల్మానులకు, పార్శీలకు, క్రైస్తవులకు అందఱకును సమానముగా నుండగలదు. నేను మత విద్యను గుఱించి ఏమియు మాట్లాడుచుండుటలేదని కొందఱడుగుచున్నారు. కారణమేమనగా ఆత్మసహాయమను ఆచరణాత్మక మతవిద్యనే బోధించుచున్నాను గదా!

## నిర్బంధసేవ :

ప్రభుత్వమువారు ఈ విధముగా శిక్షణపొందిన విద్యార్థులందఱకు, తమ కవసరమయినచో, విధిగా పనిపాటులు చూపవలెను. ఇంక ఉపాధ్యాయుల విషయములో ప్రొఫెసరు షా నిర్బంధసేవను సూచించి యున్నారు. ఇటలీ మొదలయిన దేశములలో ఈ పద్ధతివల్ల చాలమేలు గలిగినదని ఋజువుచేసియున్నారు. ముసోలినీ దేశసేవ మిక్కిలి అవసరమని తన ఇటలీదేశపు యువకులను నిర్బంధముగా సేనలో చేరవలసినదని యుద్బోధింప గలిగినప్పుడు ఇంకొక విధముగా మనము మాత్ర మెందులకు చేయరాదు. మన యువకులను తమ ఉద్యోగములలో చేరుటకు పూర్వము, ఒక ఏడాది గాని అంతకంటె ఎక్కువ కాలముగాని ఉపాధ్యాయ వృత్తిలో

నిర్బంధ సేవ చేయవలెనని ఒత్తిడి చేసిన యెడల అది బానిస లక్షణ మనిపించుకొనునా ? గత 17 సంవత్సరముల నుండి జరుగుచున్న స్వతంత్ర సమరమునకు గాను మన యువజనులు ఎన్నో విధముల పాటుపడి ఎంతో త్యాగము చేసియున్నారు. అటువంటి విషయములో ఒక సంవత్సరము గాని అంతకంటె కొంచెము ఎక్కువ కాలముగాని దేశమునకుగాను ఉచితముగా ఉపాధ్యాయ వృత్తిని స్వీకరింపుడని నేను యువజనులను అడుగదలచితిని. ఈ సందర్భములో ఒకవేళ శాసనము చేయవలసివచ్చినను, దానిని నిర్బంధ మనరాదు. ఏమనగా అధిక సంఖ్యాకుల అంగీకారము పైనగదా శాసనము చేయబడుచుండును.

కనుక చేతిపనుల ద్వారా విద్యాబోధ జరుగవలెనన్న సంగతి మీకు నచ్చినదో, లేదో నాకు తెలియపఱుప దగుదురు. ఆ విద్య స్వయంపోషకముగా ఉండగలిగినప్పుడే సమర్థమైనదని నేను తలచెదను. బాలకులు ఏడు సంవత్సరములు శిక్షణ పొందిన తరువాత తమ విద్యాబోధకు గాను ఉపాధ్యాయులకు జీతములు చెల్లించుటకును, తాము కొంత సంపాదించుటకును శక్తిమంతులై యుండవలెను.

కళాశాల విద్య అందురా, అది కేవలము నగరవాసులకు సంబంధించినది. ప్రారంభ విద్యవలె అది కేవలము నిష్ఫలమైనదని అనను గాని దాని ఫలితములు నిరాశాపూరితములని అనక తప్పదు. కళాశాలలో ఉత్తీర్ణులయిన పట్టభద్రులు నిరుద్యోగులుగా నుండవలసిన కర్మ యేమిపట్టినది ?

తక్లీని గురించి ప్రస్తావించితిని. ఆ విషయమయి వినోబాజీ అపూర్వమయిన అనుభవమును ఆచరణ పూర్వకముగా గడించియున్నాడు. అతడు మీ సందేహములను తీర్చగలడు. కాకాసాహెబు జ్ఞానము ఎక్కువ సిద్ధాంత రూపమయినది. అయినను అతడు కూడ మీ ఆక్షేపములకు సమాధానము చెప్పగలడు. ఆరమ్‌స్ట్రాంగ్ అను

మహనీయుడు "జీవితావసర విద్య" అను గ్రంథము వ్రాసియున్నాడు. అందు "చేతి శిక్షణ" అను ప్రకరణము గలదు. దానిని ముఖ్యముగా చూడవలసినదని కాకాసాహేబు నాతో చెప్పియున్నాడు. కీ. శే. మధుసూదనదాసు లాయరు. మన చేతులు, కాళ్ళు పనిచేయని యెడల మన మెదడు సక్రమముగా పనిచేయజాలదని అతడు నమ్మి, ఒకవేళ అది పనిచేసినను శనీశ్వరుని నడకవలె నుండునని చెప్పియున్నాడు, టాలుస్టాయి తన కథలద్వారా ఈ సంగతినే బోధించియున్నాడు.

## అహింసా మూలము :

స్వయంపోషక ప్రారంభవిద్యకు కావలసిన ప్రధానాంశములను మీకు వివరించెదను. మన దేశములో మతకలహము లున్నవి. ఇవి మనకే ఉన్నవని చెప్పరాదు. ఇంగ్లాండులో "రోజు" కుటుంబములకును పరస్పర యుద్ధములు జరిగినవి. ఈ నాడు బ్రిటిషు సామ్రాజ్యవాదము ప్రపంచమునకే శత్రువయినది. మన దేశములో మత కలహములు పోవలెనన్నను, అంతర్జాతీయ విభేదములు మాసిపోవలెనన్నను, మనము మనబిడ్డలకు నేనిప్పుడు బోధించిన విద్యాపద్ధతికి సౌష్ఠవమయిన, పవిత్రమయిన పునాదులు వేయవలెను. నా విద్యా పద్ధతికి మూలము అహింస. మద్యనిషేధమును అమలు జరుపవలెనని దేశము నిశ్చయించిన సందర్భములోనే ఈ విద్యాపద్ధతినికూడ నేను ప్రతిపాదించితిని. ఒకవేళ ప్రభుత్వాదాయములో తఱుగు లేకపోయినను, వారి ధనాగారము సమృద్ధమైయున్నను, నేను బోధించిన ఈ పద్ధతి యిట్లుగానే ఉండితీరవలెను. లేనియెడల మన బిడ్డలు నగరవాసులయిపోయెదరు. మన బిడ్డలు మన సంస్కృతికి, మన సభ్యతకు, మన జాతిమూల ప్రతిభకు, ప్రతినిధులుగా నుండవలెను. అట్లుండవలెనన్న వారికి స్వయంపోషక ప్రారంభ విద్యనే బోధింపవలెను. మనకు యూరపు పద్ధతులు అనుకరణీయములు కావు. ఆ దేశములకు హింసయందు

నమ్మకము గలదు కనుక తదనుగుణముగా వారు తమ పద్ధతులను నిర్ణయించుకొందురు. రష్యాలో ఉత్తమ ఫలితములు సాధింపబడిన మాట సత్యమే. కాని ఆ నడక అంతయు హింసాపద్ధతిపైనను, బల వంతముపైనను నడచినది. భారతదేశము హింసాపద్ధతిని విడిచిపెట్ట దలచిన యెడల ఈ విద్యాపద్ధతినే అంగీకరించి గొప్ప క్రమశిక్షణను సాధింపవలెను. ఇంగ్లాండు, అమెరికాలు విద్యకుగాను కోట్లకొలది ద్రవ్యమును ఖర్చుచేయుచున్నవని చెప్పుదురు. ఆ సొమ్మంతయు ప్రజాపీడనవల్ల వచ్చినదే. అయితే ప్రజాపీడన వారికి శాస్త్రవిద్య అయిపోయినది. అందువలన వారు తమ బిడ్డలకు మిక్కిలి వ్యయ భూతమయిన విద్యను ఇవ్వగలుగుచున్నారు. మనము ఆ ప్రజాపీడన పద్ధతిని పెట్టుకొనజాలము. పెట్టుకొనకూడదు. అందువల్ల మనకు అహింసామూలకమగు ఈ విద్యయే శరణ్యము.

(హరిజన్ 30-10-37)

# 9 యంత్రయుగము

[గాంధీజీ మధ్యాహ్నసభా ప్రారంభమును చేయుచు, కొన్ని ఆక్షేపములకు సందేహములకు సమాధానము చెప్పి యున్నారు.]

తక్లీ ఒక్కటే ప్రధానమయినదికాదు. కాని సర్వత్రవినియోగము చేయుటకు అది ఒక్కటే పనికివచ్చును. ఇంకను కాగితపు పరిశ్రమ, తాటిబెల్లపు పరిశ్రమ మొదలయినవి గలవు. ఏ పాఠశాలకు ఎటువంటి చేతిపని తగినదో నిర్ణయింపవలసినపని మంత్రులది. యంత్రముపై మోజుగలవారికి నేనొక హెచ్చరిక చేసెదను. యంత్రము నంగీకరించితిమా, మనుష్యులే యంత్రములుగ మాఱిపోగల ప్రమాదమున్నది. యంత్రయుగమే కావలెనని కోరుకొన్నవారికి నాప్రణాళిక నిరుపయోగము. కాని యంత్రములద్వారా మన గ్రామములను సజీవములుగా చేయజాలమని మాత్రము చెప్పదలచితిని. 30 కోట్ల సజీవయంత్రములే యుండగా ఇంకను క్రొత్త నిర్జీవయంత్రములను తేవలెనని ప్రాకులాడుట అర్థములేనిమాట. డాక్టరు జాకిరు హుస్సేను ఈ విద్యాపద్ధతిలోని మూలతత్త్వమును అంగీకరింపకుండ మిగిలిన విద్యాపద్ధతిని అంగీకరించితినని చెప్పియున్నాడు. అతనితో నేనేకీభవింపను. క్రిందటి దినమున ప్రాజెక్టుపద్ధతి తెలిసిన ఒక యిల్లాలు నన్ను కలిసికొనుటకు వచ్చినది. నా పద్ధతికిని, ప్రాజెక్టు పద్ధతికిని చాల అంతరముగలదని చెప్పినది. కనుక మీరెవరును అంతరాత్మ విశ్వాసము లేకుండ నాపద్ధతి నంగీకరింపవద్దు. మన ప్రజలు ఆత్మవిశ్వాసముతో వ్యవహరించినయెడల మన దేశములో హానిసలుండరు. ఈ విద్యా

లయములనుండి సమర్థులయిన గృహపరిశ్రమ వేత్తలు బయలుదేరగలరు. బాలకులుపడిన శ్రమకు గంటకు రెండుకానులవిలువ కట్టవచ్చును.

నాయందలి భక్తిశ్రద్ధలచే ఈపద్ధతి నంగీకరింపవద్దని మీతోగట్టిగా చెప్పుచున్నాను. నేనును చావునకు కాళ్లుచాచుకొని యున్నాను. అందువలన మిమ్ము బలవంతముచేసి ఒప్పింపవలెనను తలంపులేదు. ఇదేవచ్చె, ఆదేపోయె ననకుండ, మీరందఱు కుణ్ణముగా పరిశీలనచేసి దీనినంగీకరింపదగుదురు. ప్రభుత్వము తన దేశప్రజల నిరుద్యోగమును పోగొట్టజాలనియెడల అది కొఱగానిదని ప్రొఫెసరు షా చెప్పి యున్నాడు. నేనును అంగీకరింతును. ప్రజలకు గ్రాంట్లు మొదలయిన విధముల దానధర్మములు చేయుటవల్ల నిరుద్యోగ పరిష్కారము కాజా లదు. నేనందఱకు పనిచూపించి వారికి అన్నమో లేక సరిపడిన ద్రవ్యమో ఇవ్వదలచితిని. భగవంతుడు మనలను తినుటకును, త్రాగుట కును, గంతులువేయుటకును సృజించియుండలేదు. మనము చెమటోడ్చి కష్టపడి సంపాదించుకొని తినవలెను.

(హరిజన్ 30-10-37)

# 10 విద్యామహాసభ - తీర్మానములు

మహాసభలో రెండవదినమునను, చివరిదినమునను ఈ దిగువ తీర్మానములు ప్యాసుచేయబడినవి.

1. దేశమందంతట ఏడు సంవత్సరములపాటు ఉచిత నిర్బంధవిద్యను ప్రవేశపెట్టవలెను.
2. బోధనా మాధ్యమము మాతృభాష అయియుండవలెను.
3. ఈ కాలములో జరుగు విద్యాపద్ధతి యావత్తు ఏదేనొక చేతిపని నాధారము చేసికొని యుండవలెననిన్ని, ఆ చేతిపని బాలకులకు చుట్టును గల వాతావరణమునకు అనుగుణముగా నుండవలెననిన్ని, విద్యఅంతయు ఆ ప్రధాన గృహపరిశ్రమనే పెనవేసికొని యుండవలెననిన్ని, తద్ద్వారాయే బాలకునికి సర్వతోముఖ వికాసము కలుగవలెననిన్ని, ఆ పరిశ్రమ ఉత్పత్తిసాధకమై యుండవలెననిన్ని గాంధీజీ బోధించియున్నారు. ఆ యభిప్రాయములను ఈ సభవారు సమర్థించుచున్నారు.
4. ఇట్టి విద్యాపద్ధతివల్ల ఉపాధ్యాయుల జీతములు క్రమముగా పూడగలవని ఈ సభవా రభిప్రాయ పడుచున్నారు.

అటుపిమ్మట పైతీర్మానముల ననుసరించి ఒక పాఠ్య ప్రణాళిక తయారుచేయుటకును, సభాధ్యక్షులకు ఒక నెలలోపుగ రిపోర్టువ్రాసి సమర్పించుటకును ఒక కమిటీ ఏర్పాటుచేయబడినది.

(హరిజన్ 30-10-37)

# 11 సభా సమాప్తి

మహాసభను పరిసమాప్తి చేయుచు గాంధీజీ ఇట్లు చెప్పిరి: మీరందఱు ఇక్కడకువచ్చి నాతో సహకరించినందులకు మీకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు. ఇటువంటి మహాసభలను మనము ఎన్నిటినో జరుపవలసియున్నది. వానిలో ఇది మొదటిది మాత్రమే. కనుక ముందుముందుకూడ మీరు నాతో ఈవిధముగానే సహకరింప గలరని ఆశించుచున్నాను. మాలవీయజీ నన్ను హెచ్చరించుచు ఒక టెలిగ్రాము పంపియున్నారు. ఈసభ కేవలము జిజ్ఞాసువుల సభమాత్రమే యనియు, అందఱును తమకుతోచిన సలహాలను, ఆక్షేపములను తెలుపుటకే యీ సభ యేర్పాటు చేయబడినదనియు, ఈ సభలో చేయబడిన వేవియు తుదినిర్ణయములు కావనియు శ్రీ మాల వీయజీ మనస్సుకు శాంతి కలిగించుచు సమాధానము వ్రాసియుంటిని. పెద్ద తుపానును లేవదీసి కార్యసాధన చేయవలెనను సంకల్పము నా కెన్నడును లేదు. జాతీయవిద్య, మద్యనిషేధము అను అంశములు అసహాయోద్యమమువలెనే ప్రాచీన మయినవి. దేశములో జరుగు చున్న మార్పులను చూచినప్పుడు విద్యావిధానము ఈ రూపములో నున్న యెడల బాగుండునని నాకు తోచినది.

(హరిజన్ 30-10-37)

విద్యా మహాసభా వివరములు వేఱొకచోట ముద్రింపబడినవి. ప్రజలకును, కాంగ్రెసు మంత్రులకును నా ప్లాను తెలియపఱుప గలిగితి ననుట ప్రధాన విషయమే. ఎంతోమంది మంత్రులు సభకు హాజరయి యుండుటకూడశుభసూచక మే. స్వయంపోషక భాగమునుగుఱించియే చాలమంది ఆక్షేపములు తెలుపుచు విమర్శనలు చేసియున్నారు. కాబట్టి మహాసభలో మిక్కిలి జాగ్రత్తగా ఆలోచించియే నిర్ణయములు చేయబడినవి. ఈ మహాసభా ప్రయాణము త్రాడు, చుక్కాని లేకుండ సముద్రములో ప్రయాణము చేయుటవంటిదే కాగలదు. ఇటువంటి ఏర్పాటు పూర్వ మెన్నడును లేదు. నేను సూచించిన మార్గము సిద్ధాంతరూపకముగా ఉత్తమమయిన యెడల ఆచరణలో కూడ, ఉత్తమముగానే యుండగలదు. చివరకు, స్వయంపోషక విద్యయందు నమ్మక మున్నవారే అటువంటి విద్యాలయములు నెలకొల్పి, అట్టి విద్య సఫలీకృతము కాగలదని రుజువు చేయదగినవారు.

ప్రారంభవిద్యలో, ఇంగ్లీషు లేకుండ మధ్యమవిద్యను చేర్చు టకును, ఈ విద్య, వృత్తిద్వారా నేర్పించుటకును అందఱును ఏకాభి ప్రాయులయి యుండుట ముఖ్యముగా గమనింపదగిన విషయము. బాలబాలికలలో ఉన్న పూర్ణశక్తులను వృత్తిద్వారా స్వాభావికముగా వెలికి దీయగలుగుటయే ఈ విద్యా ప్రయోజనము. అట్లు కానినాడు ఈ విద్యాలయములు ఫ్యాక్టరీలుగా దిగజాఱిపోగలవు. బాలబాలికలు తమ నేర్చుకొనుచున్న వృత్తియందు మంచి ప్రావీణ్యమును గడింప వలసి యుండుటయే గాక, తాము నేర్వవలసిన యితర విషయము లందుకూడ సమాన ప్రావీణ్యమునే సంపాదింపవలసి యున్నది.

డాక్టరు జాకిరు హుస్సేను కమిటీవారు ఒక స్కీము తయారు చేసియున్నారు. దానిలో ప్రతి సంవత్సరము బాలబాలికలు ఆచరణ పూర్వకముగ ఎంతెంత పని చేయవలసి యున్నారో నిర్ణయింప బడినది.

ఈ సభా తీర్మానములు, అంతకు పూర్వమే చేసి పెట్టుకొన్న నిర్ణయములని ఒక ఆక్షేపణ చేయబడినది. దాని కాధారమేమియు లేదు. విద్యావేత్తలు ఈ ప్రణాళికను విప్లవాత్మక మయినదని తలచు సందర్భములో వారిని ఆకస్మికముగా పిలిచి తమ అభిప్రాయములు చెప్పవలసినదని ఆహ్వానించుట ఇప్పుడున్న స్థితిగతులలో సాధ్యముకాని పని. కాబట్టి వృత్తివిద్యలతో సంబంధమున్న ఉపాధ్యాయులను కొందరను మాత్రమే ఆహ్వానింప గలిగితిమి. జాతీయ విద్యాక్షేత్రములో పని చేయుచున్న నా మిత్రులే ఈ నూతన విద్యాపద్ధతికి నాతో సహాకరించెదరని నాకే నమ్మకము లేకుండెను జాకిరుహుస్సేను కమిటీవారు వివరములన్నియు పొందుపరిచి తమ రిపోర్టు తయారుచేసి మన కందజేసినప్పుడు, దానిని గురించి చర్చించుటకుగాను మహామహులయిన విద్యావేత్తల నందరను ఆహ్వానించెదము. ఈ ప్రణాళికకు సహాయము చేయు తలంపుతో ఏ విద్యావంతులైనను తమ సలహాలు పంపదలచిన యెడల, ఈ కమిటీ కార్యదర్శి శ్రీ ఆర్యనాయకమ్‌గారికి, వర్ధా వ్రాసి పంపవచ్చును.

బాలబాలికలకు సౌష్ఠవముగా విద్యనేర్పవలెనన్న పురుషుల కంటె స్త్రీలును, కన్యలకంటె తల్లులును లెస్సగా ఉపయోగపడగలరని మహాసభలో నొక్కి చెప్పబడినది. ప్రొఫెసరు షా సూచించిన నిర్బంధ సేవాపద్ధతిని గురించికూడ నాకంటె వారే సమాధానము చెప్పుటకు తగినవారు. ఈ జాతీయవిద్య ఉత్తమోత్తమ సేవా కార్యము. కాబట్టి దేశభక్తితో నిండిన స్త్రీలు తమ తీరికసమయములందు ఈ విద్యా కార్యమును తప్పక చేపట్టదగుదురు. అయితే వారు ఈ పని చేయదల

చినయెడల వారికి ముందుగా గట్టిశిక్షణ యివ్వవలెను. ఉద్యోగులు, అన్నము కావలసిన స్త్రీలు, దీనివల్ల మనకేదో వృత్తిఏర్పడునన్న ఉద్దేశముతో ఇందు చేరరాదు. వారీ ఉద్యమములో చేరదలచినప్పుడు కేవలము సేవాభావముతోనే చేరవలెను. అంతేగాక జీవితాంతము వఱకు ఈ విద్యాకార్యమునే సాధింపగలమని దీక్షనుగూడ కలిగియుండ వలెను. స్వార్థబుద్ధితో ఇందు ప్రవేశించినయెడల వారికి ఆశాభంగము కలుగగలదు. భారతదేశమందలి విదుషీమణులు గ్రామస్థులతోను, ముఖ్యముగా వారి బిడ్డలతోను సమైక్యభావనను పొంది ఈ మహత్కార్యమును సాధింపగలిగిరా, గ్రామజీవితములో నడి చప్పుడు కాకుండ అద్భుతమయిన మార్పును తేవచ్చును. వారట్టిపనికి పూనుకొందురా?

(హరిజన్ 30-10-37)

---

## మూడవ భాగము

# స్వాయంపోషక విద్య

## 13 విద్య - త్రాగుడువలన ఆదాయము

త్రాగుడు ఆదాయమును వదలుకొనుటతో, విద్యా సమస్యను ఎట్లు పరిష్కరింపవలెను అన్నది చిక్కుప్రశ్న అయిపోయినది. ఇందుకు క్రొత్తపన్నులు విధించు మార్గములేకపోలేదు. ఈ నిఱుపేద దేశములో కూడ క్రొత్తపన్నులు వేయుటకు సావకాశమున్నదని ప్రొఫెసరు షా, ప్రొఫెసరు ఖంభట్టా తెలియజేసియున్నారు. ధనవంతులపైన పడవలసి నన్ని పన్నులు ఇంకను పడియుండలేదు. ఈ విషయములో ముఖ్యముగా లోకములోని దేశములన్నిటికంటెను మనదేశములో అత్యధిక ధనమునుగలిగి యుండుట భారత ప్రజలయెడల ద్రోహముచేయుటయే యని గ్రహింపవలెను. అయినను ఏదో ఒక హద్దుదాటి అత్యధికముగా పన్నులు వేయజాలము. ఇంగ్లాండులో ఫలానా ఆదాయముకంటె పై వచ్చిన ఆదాయములో నూటికి 70 వంతులపయిన పన్నులు వేయుచున్నారని నాకు తెలిసినది. భారతదేశములో అంతకంటె ఎక్కువ పన్నులుకూడ వేయవచ్చును. మరణసుంకములు ఎందుకు వసూలు చేయరాదు. కోటీశ్వరుల కుమారులు యుక్తవయస్సు వచ్చికూడ తమ తండ్రుల ఆస్తులను, ఐశ్వర్యమును వారసత్వరూపేణ పొందుచున్నారనగా వారు నష్టపడిపోవుచున్నారు. దేశము రెండు విధాలుగా నష్టపడుచున్నది. ఆ వారసత్వ ధనము యావత్తు న్యాయముగా దేశమునకు చెందవలసి యున్నది. ఆ ధనవంతుల కుమారులు ధనములో కూరుకొనిపోయి యుండుటవల్ల వారిలోని నిగూఢశక్తులు బయటకు

వచ్చుటకు సావకాశము లేదు. ఆ విధముగా కూడ దేశము నష్టపడి పోవుచున్నది. ప్రాంతీయ ప్రభుత్వములు మరణ సుంకములు విధింప రాదు అన్న సంగతి నా వాదమునకు అడ్డురాదు.

దేశము మొత్తముమీద చూచుకొన్న యెడల మనము విద్యలో ఎంతో వెనుకబడి యున్నాము. ఫలానా గడువులోపల మన బిడ్డ లందఱను విద్యావంతులు చేయవలెనన్న, డబ్బుపైన ఆధారపడిన యెడల, మన కర్తవ్యమును మనము నెరవేర్పనేలేము. కనుక నా ప్రతిష్ఠ పోయినను సరే అనుకొని స్వయంపోషక విద్యయే మనకు ఉత్తమ మయినదని నిరూపింప సాహసించితిని. విద్య అనగా బాలకుని సర్వతోముఖాభివృద్ధి, అతని శారీరక, మానసిక, ఆత్మిక శక్తులను వెలికి దీయుట అనియే నా అభిప్రాయము. అక్షరములు నేర్పుట విద్యకు మొదలునుకాదు; చివరనుకాదు. పురుషుడు గాని, స్త్రీ గాని విద్యావంతు లగుట కది యొక సాధనము మాత్రమే. అక్షరాస్యతయే విద్యకాదు. కనుక బాలకునకు విద్య ఉపయోగ మగు చేతివృత్తితో ప్రారంభించెదను. ఆ పిల్లవాడు శిక్షణ పొందుచునే కొంత ఉత్పత్తికూడ చేయుచుండగలడు. ఈ విధముగా ప్రతి విద్యాలయము స్వయంపోషకముగా ఉండగలదు. అయితే బాలకులవల్ల ఉత్పత్తియగు వస్తువుల్ను ప్రభుత్వము తీసికొనుచుండవలెను.

బాలకునకు మానసికముగాను, ఆత్మికముగాను సర్వోత్తమ మయిన అభివృద్ధి గలుగవలెనన్న ఈ విద్యా పద్ధతియే శరణ్యమని నా యభిప్రాయము. అయితే యిప్పటివలె చేతి వృత్తులను, గుడ్డెద్దు చేలబడ్డట్లు గాక, శాస్త్రీయ విధానముపైని ప్రతి అంగమును పరిశీలించుచు, దాని అవసరమేమి, పుట్టు పూర్వోత్తరములేమి ఈ మొదలగు విషయములు తెలియజేయుచు, నేర్పుచుండవలెను. నే నిట్లు చెప్పుచున్నాననగా అనుభవము లేకుండ, విశ్వాసము లేకుండ చెప్పుచుండుటలేదు. కార్యకర్తలకు వడుకు నేర్పు సమయములలో యీ

పద్ధతియే అవలంబింప బడుచున్నది. నేను చెప్పులు కుట్టుట, నూలు వడుకుట యితరులకు నేర్పినప్పుడు, స్వయముగా యీ పద్ధతినే అవలంబించి యుంటిని. మంచి ఫలితములు వచ్చినవి. ఈ పద్ధతిలో చరిత్ర, భూగోళము విడిచిపెట్టబడలేదు. ఇట్టి జ్ఞానము, నోటితో బోధచేయబడినప్పుడే ఎక్కువ గలుగుచుండునని నేను గ్రహించితిని. వ్రాత, చదువువల్లకంటె ఈ విధముగా పదిరెట్లు ఎక్కువ జ్ఞానము గలిగింపవచ్చునని తెలిసికొంటిని. విద్యార్థి చేతిపనియందు కొంత శిక్షణ పొందిన వెనుక, మంచిచెడ్డలు తెలిసికొనదగు అనుభవము గలిగిన పిమ్మట రుచి భేదములు గుర్తింప గలిగిన తదుపరి, అతనికి అక్షరములు నేర్పవచ్చును. ఇది విప్లవాత్మకమగు సూచన అయినమాట సత్యమే కాని విద్యార్థికి ఎంతో కష్టము తప్పిపోవును. అతడు దీర్ఘకాలములో నేర్చుకొనునట్టిది ఒక్క సంవత్సరములో నేర్చుకొన గలుగును. అనగా అనేక విధముల పొదుపరితనము ఏర్పడును. విద్యార్థి చేతివృత్తిని నేర్చుకొనుచునే గణితము కూడ నేర్చుకొనుచుండును.

నా దృష్టిలో ప్రారంభవిద్యయే అత్యంత ప్రధానమైనది. అది, ఇంగ్లీషులేకుండ మెట్రిక్యులేషను స్థాయిలో ఉండవలెనని నా తలంపు. ఈ కళాశాల విద్యావంతులందఱు ఏదో దైవమాయవల్ల తమకుగలిగిన జ్ఞానమంతయు ఒక్కసారిమఱచిపోయినా రనుకొందము. వారు కొద్ది లక్షలమంది గదా ఉందురు. అందువల్ల దేశమునకు గలిగిన నష్టము గొప్పదికాదు. ఇప్పుడు ముప్పదికోట్ల జనులను ఆవరించిన, ఆవరించుచున్న అజ్ఞానాంధకారమువల్ల గలిగిన నష్టము అంతకంటె ఎన్నోరెట్లు గొప్పది. కోట్లకొలది గ్రామీణులను ఆవరించిన అజ్ఞానము ముందు, వారికి అక్షరములు రాకపోవుట ఒక లెక్కలోనిది కాదు.

నేను కళాశాల విద్యలో బ్రహ్మాండమైన మార్పుతెచ్చి, ఆ విద్యకును, దేశావసరములకును ముడిపెట్టెదను. మెకానికల్ ఇంజనీర్లకు, తదితర ఇంజనీర్లకు డిగ్రీలు పెట్టెదను. దేశములో అనేక

పరిశ్రమలున్నవి. ఆ పరిశ్రమలకు ఇంజనీర్లు కావలెను. కాబట్టి ఆ ఇంజనీర్లకు శిక్షణ ఇచ్చుటకగు వ్యయము ఆ పరిశ్రమాధిపతులే భరింప వలెను. అప్పుడు టాటాకంపెనీవారు తమకు కావలసిన ఇంజనీర్ల కొఱకు ఒక కళాశాల ప్రభుత్వమునకు లోబడి నడపుకొనవలెను. ఆవిధముగానే మిల్లు అసోసియేషన్లవారు తమకు కావలసిన పట్ట భద్రుల కొఱకు కళాశాలలు స్థాపించుకొందురు. అట్లే ఇతర పరిశ్రమల వారుకూడ. వ్యాపారసంస్థలకు వేఱుకళాశాలలు ఉండగలవు. ఇంక ఆర్ట్సు (కళలు), వైద్యము, వ్యవసాయము మిగులును. ఇప్పుడుండే ఆర్ట్సు కళాశాలలు చాలవఱకు స్వయంపోషకముగానే యున్నవి. కనుక ప్రభుత్వమునకు వేరుగా అట్టి కళాశాలలను నడపవలసిన పని యుండదు. ఇంక వైద్య కళాశాలలు ధ్రువపత్రము పొందిన ఆసు పత్రులకు అనుబంధములుగా నుండగలవు. అవి ధనవంతులకు ప్రియ మైనవి గనుక వారి స్వేచ్ఛావిరాళములతో వైద్యకళాశాలలను నడప వచ్చును. అటుపిమ్మట వ్యవసాయ కళాశాలలు తమ పేరు నిలబెట్టు కొనుటకుగాను స్వయంపోషకములుగా నుండవలెను. ఈ వ్యవసాయ పట్టభద్రుల జ్ఞానమును చూచినప్పుడు నాకు విచారము గలిగినది. వారిది మిడిమిడిజ్ఞానము. అనుభవసిద్ధమైనది కాదు. దేశావసరములకు తగినట్లుగాను, స్వయంపోషకములుగాను ఉన్న వ్యవసాయ కమతము లందు వారికి శిక్షణ ఇచ్చియున్న యెడల, పట్టభద్రులయిన వెనుక వారికి అనుభవము గలుగుటకుగాను, వారి యజమానులు వారి నిమిత్తము మరల ద్రవ్యము వ్యయము చేయవలసినపని యుండదు.

ఇదేదో తమాషాకొఱకు చెప్పిన విషయముకాదు. ఈ విద్యా సమస్య మన కాంగ్రెసుమంత్రులకును, తద్వారా కాంగ్రెసునకును కొఱకరానికొయ్య అయినది. మనకుగల మానసిక దుర్బలతను పోగొట్టుకొన్న యెడల నేను సూచించిన విధానము ఎంతో న్యాయబద్ధ మైనది, ఆచరణ సాధ్యమయినది అయియున్నది. ఈమధ్య బ్రిటిషు

వారు చేసిన ప్రకటనలు, చెవికి ఇంపుగాఉన్నట్టువలె యథార్థముగా కూడ ఉన్న యెడల మంత్రులచేతిలో సర్వసమర్థులయిన సివిలుశాఖ ఉద్యోగులున్నారు. వారు వ్యవస్థను నిర్మించుటయందు, నిర్వహించుట యందు కడు దిట్టలు. అందువలన వారిద్వారా మంత్రులు తమ ప్రణాళికలను అమలు జరుపుకొనవచ్చును. ఎటువంటి ప్రణాళికల నైనను సరే వారు చిటికెలో అమలు జరిపెదరు. ఆ కళను వారు నిండుగా అభ్యసించియున్నారు. చపలచిత్తులయిన గవర్నర్లు, వైసు రాయిలు వేసిన ప్రణాళికలను కూడ అవలీలగా అమలు జరిపి యున్నారు. కనుక మంత్రులు లెస్సగా ఆలోచించి, దృఢసంకల్ప ముతో ఒక స్కీమును తయారుచేసి ఇవ్వవలెను. అప్పుడు సివిలుశాఖా ఉద్యోగులు, తమపక్షమున చేయబడినప్రకటనలకు తగినట్లుగాను, వారు ఎవరి ఉప్పు, పులుసు, కారము తినుచున్నారో, వారియెడల విశ్వా సము కొలఁకును ఆ విధానములను పూర్తిగా అమలు జరుపగలరు.

ఇంక ఉపాధ్యాయుల ప్రశ్న మిగిలినది. దేశములోని విద్యా వంతులైన స్త్రీ పురుషుల నందరను ప్రభుత్వము వారు నిర్బంధముచేసి విద్యాశాఖలో కొలువు చేయించుకొనవలెనని ప్రొఫెసరు కె. టి. షా సూచించియున్నారు. ఆ పద్ధతి నాకును సమ్మతమే. అట్టి విద్యావంతులు నాలుగేండ్లో, అయిదేండ్లో, తాము ఏ శాఖకు పనికివచ్చినయెడల ఆ శాఖలో ఉపాధ్యాయులుగా పనిచేయుటకును, దేశముయొక్క ఆర్థిక స్థితి ననుసరించి కేవలము వారి జీవితపోషణకు సరిపడునట్లు జీతములు పుచ్చుకొనుటకును ఏర్పాట్లు చేయవలెను. ఇప్పుడు పెద్దపెద్ద శాఖల లోని ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు పెద్ద పెద్ద జీతాలు తీసికొను చున్నారు. ఈ పద్ధతి పోవలెను. ఇప్పుడు గ్రామములోని ఉపాధ్యా యులకు బదులుగా సమర్థులయినవారు ప్రవేశింపవలెను.

(హరిజన్ 31-7-37)

"క్రొత్త సంస్కరణల వల్ల ఏర్పడిన పరమ పాపిష్ఠి పద్ధతి యేమనగా మద్యమువల్ల వచ్చు ఆదాయముతప్ప మనపిల్లలకు చదువు చెప్పించుకొనుటకు వేఱేమార్గము లేదు" అని గాంధీజీ, (కాంగ్రెసు మంత్రులు ఉద్యోగములలో ప్రవేశించిన తరువాత) ఈ విషయమయి అనేక పర్యాయములు మాట్లాడుచు ఒక సందర్భములో చెప్పి యున్నారు. "ఇది విద్యకు సంబంధించిన చిక్కు ప్రశ్న. దానికి మనము వ్యాకులపడరాదు. దానిని మనము సాధించి తీరవలెను. అయితే ఎంత నష్టము వచ్చిననుసరే, ఎంత కష్టము వచ్చిననుసరే. మనము మన ఆదర్శమయిన మద్యనిషేధ విధానమును మాత్రము విడనాడరాదు. త్రాగుడు ఆదాయము లేనియెడల మన బిడ్డలు విద్యా తృష్ణచే గిలగిల కొట్టుకొనగలరని చెప్పుకొనుటకే మనము సిగ్గుచే తలవంచుకొనవలెను. ఇంతకంటె అవమానము వేఱొకటి యుండ బోదు. అట్టిస్థితియే వచ్చినయెడల మద్యాదాయము పోగొట్టుకొనుట కయినను సరే మనము సిద్ధపడి యుండవలసినదే. కారణ మేమనగా విద్యావిహీనతకంటె మద్యమువల్ల కలుగు నష్టము అపారము. విద్యాసంబంధమైన అంకెలను చూచి మనము భయపడరాదు. ఇప్పుడు అమలులో ఉన్న చదువు మన బిడ్డలకు రాలేదే అని మనము బెంగ పెట్టుకొనరాదు. అట్టి చింతలేనియెడల ఈ విద్యాసమస్య మనలను బాధింపజాలదు" అని గాంధీజీ చెప్పియున్నారు. కాబట్టి మన విద్యా వేత్తలందఱు సమావేశమయి, గాంధీజీ పదేపదే బోధించుచున్న విద్యా విధానమును పరిశీలించి, దేశావసరములకు సరిపడునట్టిదియు, వ్యయ భూతము కానట్టిదియు అయిన విద్యావిధానమును నిర్ణయింపవలెను.

"మీరు మాధ్యమిక విద్యను తుడిచిపెట్టి, గ్రామ పాఠశాలలలో మెట్రిక్యులేషను వఱకు చదువునంతయు చెప్పించెదరన్నమాట. అంతేనా?" అని ఒక సత్పురుషుడు గాంధీజీని మిక్కిలి ఉత్కంఠతో అడిగెను.

*దానికి గాంధీజీ ఇట్లు జవాబు చెప్పిరి :*

"అవునవును. సరిగా అంతే. మీరు మాధ్యమిక విద్యలో చెప్పెడి చదువెట్టిది? పాపము, పిల్లలను ఏడేండ్లపాటు బాధపెట్టి విదేశీ భాషలో ఏదో నేర్పెదరు. అది మాతృభాషలో నయినచో, ఒకటి రెండేండ్లలో నేర్చుకొనవచ్చునుగా. అవునా, కాదా? పిల్లలు విదేశీ భాషలో చదువునేర్చుకొనుట అనెడి పెద్ద బరువును మీరు తప్పించిన యెడలను, బిడ్డలు తమకాళ్లను, చేతులను ఉపయోగకరమగు పనులందు వినియోగించునట్లు మీరు బోధించినయెడలను విద్యాసమస్య పరిష్కరింపబడినట్లే. అప్పుడు, ఎవరిబలవంతము లేకుండ, మీరు త్రాగుడు ఆదాయమును యావత్తు వదలుకొనవచ్చును. మొట్టమొదటగా మీరీ ఆదాయమును వదలుకొనవలెను. అటుపిమ్మట విద్యా విధానమును గురించి ఆలోచింపవలెను. ఈ మహాత్కార్యముతో ప్రారంభము చేయండి."

---

## 15 స్వావలంబన విద్య

డాక్టరు ఆ. లక్ష్మీపతి యిట్లు వ్రాయుచున్నారు:

"మిషనరీలు నడపుచున్న విద్యాలయములను కొన్నిటిని నేను చూచియున్నాను. అక్కడ ఉదయము పాఠములు చెప్పెదరు. సాయంకాలము విద్యార్థులను ఏదో వ్యవసాయమందో చేతిపనియందో ప్రవేశపెట్టి, వారు చేసేపనినిబట్టి వారికి ఏదో కూలిసొమ్మునుగూడ ఇచ్చెదరు. ఈవిధముగా ఆ విద్యాలయములు దాదాపు స్వయంపోషకములుగా నడపబడుచున్నవి. విద్యార్థులు పాఠశాల విడిచిపెట్టి పోవునపుడు కేవలము నిరాధారులయిపోకుండ కనీసము జీవనమునకై నాలుగు డబ్బులు సంపాదించుకొనుశక్తిగల వారయి వెడలిపోవుచున్నారు. ఇప్పుడు విద్యాశాఖవారు నడపుచున్న విద్యాలయములలో ఒక్కటే బండపద్ధతిని కార్యక్రమము నడచుచుండును. కాని మిషను విద్యాలయములలో అట్లుగాక నూతన జీవము తాండవించుచుండును. అక్కడి బాలురు మంచి ఆరోగ్యముగలవారయి మంచి శరీరపుష్టి గలిగియుందురు. ఈరోజున కొంత ఉపయోగకరమయిన పనిచేయ గలిగితిమిగదా యను సంతోషముతో కలకలలాడుచుందురు. ఆ విద్యాలయములు వ్యవసాయ తరుణములో కొద్దికాలము మూసియుంచబడును. ఆరోజులలో వ్యవసాయము నిమిత్తము అందఱి సహాయము కావలసి యుండునుగదా! నగరములలో నుండు పాఠశాలలలో సయితము విద్యార్థులకు ఆసక్తియున్నయెడల ఇటువంటి వృత్తులలో వారు ప్రవేశించి ఉల్లాసముగా నుండవచ్చును.

పైవిధముగా వృత్తులయందు పాల్గొను విద్యార్థులందఱకుగాని కొందఱకుగాని ఉదయముపూటనే భోజనమును ఏర్పాటుచేయ

వచ్చును. ఆవిధముగా బీద విద్యార్థులు పాఠశాలలకు కలకలలాడుచు పోవునట్లు ప్రోత్సహింపవచ్చును. బిడ్డల తలిదండ్రులుకూడ పిల్లలు వేళతప్పకుండ బడికిపోవునట్లు ప్రోత్సహింపగలరు.

ఈ అర్ధపాఠశాలా పద్ధతి నంగీకరించినయెడల, అక్కడి ఉపాధ్యాయులను కొందఱను గ్రామములో వయోజన శిక్షణ తరగతులను నడపుటకు వినియోగించుకొనవచ్చును. వారికి అదనముగా జీతము లివ్వవలసిన పనియుండదు. పాఠశాలా భవనమును, ఇతర పనిముట్లును, వయోజన విద్యకు ఉపయోగించుకొనవచ్చును.

నేను మదరాసులోని విద్యామంత్రిని కలిసికొని, ఈతరములోని పిల్లలు అనారోగ్యవంతులగుటకు పాఠశాలలలో చదువుచెప్పు వేళలు అసందర్భములుగా నుండుటయేయని వ్రాసియిచ్చితిని. పాఠశాలలును, కళాశాలలును ఉదయము 6 గంటలు మొదలు 11 గంటలవరకు మాత్రమే పనిచేయవలెనని నా అభిప్రాయము. పాఠశాలలలో నాలుగు గంటల చదువు చాలును. పిల్లలు మధ్యాహ్న సమయమును ఇంటివద్ద గడపవలెను. సాయంకాలము ఆటపాటలయందు ప్రొద్దుపుచ్చవలెను. ఆవిధముగా ఆరోగ్యసాధన చేయవలెను. కొందఱు పిల్లలు జీవనోపాధికి పాటుపడవచ్చును. మఱికొందఱు తమ తలిదండ్రులకు వారివృత్తుల యందు సాయపడవచ్చును. కులవృత్తులను చేపట్టుటకును, వృద్ధిచేసి కొనుటకును, బిడ్డలు తమ తలిదండ్రులకు తోడ్పడుచుండుట మిక్కిలి అవసరము.

శరీర నిర్మాణమే దేశనిర్మాణమని గుర్తించినయెడల నేను సూచించిన పద్ధతి, పైకి ఏదో గొప్పమార్పుగా కన్పించినను మన దేశ సంప్రదాయములకు, శీతోష్ణస్థితులకు తగినదగుటవల్ల, మన ప్రజలు దానిని సంతోషముతో స్వీకరింతురు."

పాఠశాలలు ఉదయము మాత్రమే పని చేయవలెనని డాక్టరు లక్ష్మీపతి సూచించియున్నారు. ఆ విషయమై నేను విస్తరించి చెప్ప

దలచుకొనలేదు. విద్యాశాఖాధికారులు దానిని అవలంబింప దగుదురని చెప్పదలచితిని. ఇక దాదాపుగా స్వయంపోషకములని చెప్పబడుచున్న విద్యాలయములను గురించి విచారింతము. ఆ విద్యాలయ యజమానులు తమ విద్యార్థులకు కొంతగాగాని, నిండుగాగాని కూలి సొమ్ము ఇచ్చి, ఆ విద్యార్థులనుండి వచ్చినంత పనిని రాబట్టుట తప్ప ఇతర మేమియు చేయజాలకున్నారు. ఏమయినను కొందఱు విద్యావంతులును నా సూచనవల్ల భయభ్రాంతు లయిరి. కారణ మేమనగా వారికి మఱియొక పద్ధతి తెలియదు. స్వయంపోషక విద్య అనగానే, విద్యలో ఉన్న సారమంతయు పోయినదని వారి భయము. లాభములు చూపు తలంపుతో నే నిట్లు సూచించితినని వారి యభిప్రాయము. ఒక యూదుమతస్థుడు తాను విద్యారంగములో చేసిన కృషిని గురించి ఒక వ్యాసము వ్రాసియున్నాడు. దాని నిప్పుడే చదువుచున్నాను. యూదుల పాఠశాలలో జరుగుచున్న వృత్తి శిక్షణను గుఱించి అతడిట్లు వ్రాసియున్నాడు :

"చేతులతో పనిచేయుట గౌరవ ప్రదమనియే వారు భావించియున్నారు. మానసిక శిక్షణ పెరుగుచున్నకొలది చేతిపని సులభమయిపోవుచున్నది. అందు దేశభక్తి బీజములు పడెనా, అది మహిమావంతమయి పోవుచున్నది" అని.

సరియయిన ఉపాధ్యాయులు దొరకినట్లయిన మన పిల్లలకు శరీర పరిశ్రమలోని గొప్పదనములను చూపించవచ్చును. బుద్ధివికాసములకు దేహ పరిశ్రమ అత్యంత ప్రధానమనికూడ వారు గ్రహింపగలుగుదురు. తాము పొందుచున్న శిక్షణకు, తమ శ్రమద్వారా జీతములు చెల్లించుట అన్నది తమకు గౌరవప్రదమని తెలిసికొనగలుగుదురు. నా సూచనలోని ప్రధానోద్దేశ మేమనగా పిల్లలకు చేతి వృత్తులను నేర్పుటతో తృప్తిపడరాదు. ఆ వృత్తులు బాలుర బుద్ధి వికాసమునకు తోడ్పడునట్లు మనము కృషి చేయవలెను. యథార్థ

మయిన మాట ఒక్కటి చెప్పెదను. ప్రభుత్వమువారు, ఏడు పదునాలు గేండ్ల మధ్య వయస్సుగల పిల్లలను స్వాధీనము చేసికొని ఉత్పత్తి సాధకమగు చేతివృత్తిద్వారా వారికి శరీర మనోవికాసములు కలుగునట్లు శిక్షణ యిప్పింపవలెను. అందులకు ఏర్పడిన పబ్లికు పాఠశాలలు స్వయంపోషకములుగా ఉండలేకపోయిన యెడల, పిల్లలు దగా కోరులు, ఉపాధ్యాయులు బుద్ధిహీనులని అర్థము.

మంచి నేర్పరులు నడపుచుండగా, ప్రతి బాలుడును, బాలికయు ఇతరులతో కలిసిమెలసి ఏదో ఒక చేతివృత్తి నవలంబించి, యంత్రము వలెగాక బుద్ధి నుపయోగించి పనిచేసినయెడల ఒక సంవత్సరము తరువాత వారు చేసినపనికి గంట ఒకటికి ఒక అణా గిట్టింపుకావలెను. రోజునకు నాలుగు గంటల చొప్పున నెలలోని 26 పని దినములకు ప్రతిబాలుడు నెలకు రు. 6-8-0 లు సంపాదింపగలడు. అయితే కోట్ల కొలది ఉన్న ఈ బాలకులందఱను ఈ విధముగా వినియోగింపవచ్చునా అన్నది ప్రశ్న. పిల్లలకు ఒక యేడాది శిక్షణ యిచ్చినపిమ్మట కూడ వారినుండి గంటకు ఒక అణా చొప్పున పనిని రాబట్టని యెడల మన బుద్ధి ఎందుకును కొఱగానిదన్నమాట. మన గ్రామములలో ఉన్న ప్రజలు గంటకు ఒక అణా కూడ సంపాదించుచుండుట లేదని నాకు తెలియును. కారణమేమనగా ధనము కలవారికి, లేనివారికి విశేష భేదము ఉండుట సహజమేయని మనము సంతృప్తిపడి యూరకుంటిమి. అంతేగాక, బ్రిటిషువారు గ్రామములను గుఱించి చేయుచున్న దోపిడి విధానములో మన నగరవాసులు బుద్ధిపూర్వకముగా కాకపోయినను చేతులు కలిపియున్నారు.

(హరిజన్, 11-9-37)

# 16 స్వావలంబన విద్య - మఱికొన్ని ప్రసంగములు

గాంధీజీ ఆరోగ్యము బాగుండలేదు. వారికి అవసరముగా విశ్రాంతి కావలసియుండెను. అయినను సరే, ఎవరయినను ఈ స్వయం పోషక విద్యను గుఱించి లెస్సగా ఆలోచించి దాని సఫలతకు తోడ్పడ దలచిన వారున్న యెడల, గాంధీజీ వారితో చర్చించుటకు సిద్ధముగా నుండిరి. అటువంటి చర్చలు కొద్దిగాను, సంగ్రహముగాను నడచినవి. గాంధీజీ ప్రసంగించినప్పు డెల్లను, ఏదో నూతన విషయమును గుఱించి చెప్పుచుండుటో, లేక ఉన్నదానికి మెఱుగుపెట్టుటో జరుగుచుండెను. వెంటనే మద్యనిషేధమును అమలుజరుపవలసివచ్చినందువల్లనే స్వయం పోషక విద్యా ప్రశంస వచ్చినదని యెవరో సూచనచేయగా గాంధీజీ గట్టిగా కాదనిరి. వారు చెప్పినమాట లివి :— రెండును ప్రాణావ సరములే. ఆదాయము రానీ, రాకపోనీ; విద్య నడవనీ, నడవకపోనీ; సంపూర్ణ మద్యనిషేధము అమలులోనికి రావలసినదే అను నిశ్చయబుద్ధి మీలో నుండవలెను. ఆవిధముగానే మన గ్రామావసరములను దృష్టిలో పెట్టుకొని మన గ్రామములలో నిర్బంధ విద్య అమలుజరుగవలెనన్న అది స్వయంపోషకముగా నుండితీరవలెనను నిశ్చయబుద్ధి కూడ ఉండి తీరవలెను.

ఒక విద్యావేత్త ప్రసంగించుచు, 'మద్యనిషేధమే మిక్కిలి ప్రధానమయినది. అదే గొప్ప విద్యా ప్రచారము. కాబట్టి మద్య నిషేధము విజయవంతమగుటకు గాను విద్యను కూడ వదలిపెట్టుటకు సిద్ధముగా నున్నాను. అయితే విద్య స్వయంపోషకముగా నుండవలెనని

మీరు చేసిన సూచనలో నా కింకను నమ్మకము కుదరలేదు' అనగా అందుకు గాంధీజీ-"అక్కడ కూడ నీవు నిశ్చయబుద్ధితోనే ప్రారంభము చేయవలెను. అట్లు ప్రారంభము చేసితివా నీకు సాధన సంపత్తి తనకు తానే ఒనగూడుచుండును. ఇంత పెద్దవాడనయిన తరువాత ఈ విద్యా పద్ధతి ప్రాముఖ్యమును గుఱించి ఇప్పుడు తెలిసికొంటిని. అందుకు విచారించుచున్నాను. అట్లు కాని యెడల నేనే ముందుగా ప్రయోగము చేసియుండెడివాడను. ఇప్పుడయినను సరే, ఈశ్వర కటాక్ష మున్న యెడల ఆ విద్య స్వయంపోషకముగా నుండగలదని, వీలు కలిగినంత వఱకు పాటుపడి మీకు చూపగలను. అయితే ఇన్ని సంవత్సరముల నుండి నేను ఇతర విషయములకై కృషిచేయుచుంటిని. అవి కూడ ఇంతటి ప్రాముఖ్యము గలవే. ఇప్పుడు నేను సేవాగ్రామములో నివసించుచుండుట వల్ల ఈ నిశ్చయబుద్ధి ఇప్పుడు నాకు గలిగినది. మన మింతవఱకు పిల్లలకు ఎన్నో విషయములు తెలియజేయవలెనని, వారి మనస్సులలో పెక్కు విషయములు కూరి కూరి విడిచిపెట్టితిమి. అందులకే మన సర్వశక్తులు వినియోగపడినవి. అంతేకాని వారి బుద్ధి వికాసమునకు ప్రేరణ చేయుట గాని, బుద్ధి వికసించుటకు గాని మనము కృషిచేయమైతిమి. ఇప్పుడైనను మనము చేయుచున్న పనిని ఆపి, చేతివృత్తులను ప్రవేశపెట్టి, అప్రధాన విద్య క్రింద కాదుసుమా, ప్రధాన విద్యగానే బోధించి, విద్యార్థుల బుద్ధివికాసమునకు యత్నము చేయవలెను" అనిరి.

*ప్రశ్న* : సరే, నేనును అంగీకరించితిని. బాలకుల పరిశ్రమవల్లనే విద్యాలయము సయితము స్వయంపోషకముగా నుండవలెననుటలో సబబేమి ?

*గాంధీజీ* : ఆ విద్య మూల్యవంతమయినదని చెప్పుటకది గుర్తు. బాలునకు పదునాలుగు సంవత్సరముల వయస్సు వచ్చువరకు శిక్షణ యిచ్చితిమనగా, అతడు పాఠశాల విడిచిపెట్టగానే సంపాదించుకొను

శక్తిగలవానినిగా తయారుచేసితిమన్నమాట. బీదవారి బిడ్డలు ఇప్పుడు కూడ తమ తలిదండ్రుల సంపాదనకు తోడుపడుచునే యున్నారు. 'నేనుకూడ పాటుపడనియెడల నా తలిదండ్రులకు అన్నమెట్లు రాగలదు, నాకేమి పెట్టగలరు?' అన్న భావన పిల్లలకు సహజముగా నుండును. అది విద్యయే. అందువల్ల ప్రభుత్వమువారు, కుటుంబము నుండి పిల్లవానిని పదవయేట తీసికొని శిక్షణయిచ్చి సంపాదనపరునిచేసి మరల కుటుంబమునకు ఒప్పగింపగలరు. ఒక వంక విద్యాబోధ చేయుచుండగలరు. వేఱొకవంక నిరుద్యోగమును నిర్మూలించుచుండగలరు. మీరు విద్యార్థులకు ఏదో వృత్తిలో శిక్షణ యివ్వవలెను. ఆ చేతివృత్తి యందే వారికి మనోవికాసము, శరీరపుష్టి, సుందరమైనవ్రాత, కళాప్రియత్వము మొదలయిన లక్షణములన్నియు రావలెను. వారు తమ నేర్చుకొను వృత్తిలో గొప్ప నిపుణులు కాగలరు.

ప్రశ్న : ఒకవేళ ఒక బాలుడు ఖాదీ పరిశ్రమలోని కళాసౌందర్యము దానికి సంబంధించిన శాస్త్రపరిచయము కలుగజేసికొనదలచి, ఆ వృత్తిలో ప్రవేశించినాడనుకొనుడు. ఆ వృత్తిలో ప్రావీణ్యము గడించుటకు అతనికికూడ ఏడు సంవత్సరముల శిక్షణ కావలెనా?

*గాంధీజీ* : కావలెను. అతనికి పై పైన మిడిమిడి జ్ఞానము సంపాదింపవలెనను తలంపులేనియెడల తప్పక అంత కాలము కావలసినదే. మనము చరిత్రలు, భాషలు నేర్చుకొనుటకు ఏండ్లతరబడి కాలము గడపుచుందుముగదా. దానిని గుఱించి మాట్లాడరేమి? అంతకంటె చేతివృత్తి తక్కువని మీ అభిప్రాయమా? ఇంతవఱకు దానిని చిన్నచూపుతో చూచియుండుట చాలదా?

ప్రశ్న : మీరు ముఖ్యముగా వడుకుట, నేయుటను గుఱించి ఆలోచించుచుందురు గనుక, ఈ పాఠశాలలన్నిటిని, నేతపాఠశాలలుగా మార్పదలచుచున్నారు. ఒక విద్యార్థికి నేతయందు అభిరుచియుండదు, మఱియొక వృత్తియందుండును. అప్పుడేమందురు?

*గాంధీజీ:* అట్లుండవచ్చును. అప్పుడతనికి మఱియొక వృత్తి నేర్పెదము. అయితే ఒక్క పాఠశాలలోనే పది వృత్తులు నేర్పుటకు వీలుండదని మీరు గుర్తింపవలెను. 25 మంది విద్యార్థులకు ఒక ఉపాధ్యాయుడు ఉండవలెను. ఉపాధ్యాయులు దొరకుటనుబట్టి అటువంటి తరగతులు, విద్యాలయములు ఎన్నయినను ఉండవచ్చును. అయితే ఈ విద్యాలయములలో వడ్రంగము, కమ్మరము, చర్మములు బాగుచేయుట, చెప్పులు కుట్టుట ఈ మొదలగువానిలో ఏదో ఒక్క వృత్తినే గ్రహించి ప్రావీణ్యము తీసికొనిరావలెను. మఱియొకమాట ముఖ్యముగా చెప్పదలచితిని. మీరు నగరములను మఱచిపోవలెను. మీ చూపంతయు గ్రామములపైననే ఉండవలెను. అవి సముద్రమువలె అపారమయినవి. నగరములు ఆ సముద్రములోని నీటిబిందువువంటివి. అందువలన ఇటుకలు చేయుట మున్నగు వృత్తులను గుఱించి ఆలోచింపరాదు. విద్యార్థులు సివిల్, మెకానికలు ఇంజనీర్లు కాగోరిన యెడల, మన విద్యాలయములో ఏడేండ్ల శిక్షణ ముగించుకొని, ఉన్నత విద్యలకొఱకు ప్రత్యేక విద్యలకొఱకు ఏర్పడిన కళాశాలలలో పోయి చేరవచ్చును.

మఱియొక సంగతి మీతో స్పష్టముగా చెప్పనివ్వండి. మన చదువులు వేఱు, చేతివృత్తులు వేఱు అని విడదీసికొంటిమి. కనుక గ్రామీణ గృహపరిశ్రమలనగా మనకొక విధమయిన వెగటు ఏర్పడినది. చేతిపనులు అధమ తరగతివని మనలెక్క. కారణ మేమనగా మన వర్ణ ధర్మములకు తలక్రిందుల అర్థములు చెప్పుట జరుగుచున్నది. అందువలన వడుకువారు, నేతవారు, వడ్రంగులు, చెప్పులు కుట్టువారు నీచకులముల వారుగా ఎంచబడుచున్నారు. ఈ చేతిపనులు హీనములుగా తలపబడుటవల్లను, నైపుణ్యము గల పనులు ఇంతకంటె భిన్నములుగా నుండునని యెంచబడుటవల్లను ఇంగ్లాండులో పుట్టినట్లువలె మన దేశములో క్రాంటను, హార్గ్రీవుసువంటి నూతన వస్తు

పరిశోధకులు, నిర్మాతలు ఉద్భవించి యుండలేదు. ఇప్పుడు విద్యకు ఉన్నట్లువలెనే చేతిపనులకు కూడ ఉన్నతస్థాయి యేర్పడిన యెడలను, అవిగూడ స్వతంత్ర వృత్తులని గుర్తింపబడిన యెడలను ఈ పాటికి చేతివృత్తులవారి నుండియే ఉత్తమ పరిశోధకులు జన్మించియుండెడి వారు. "స్పిన్నింగు జెన్నీ" (వడుకు యంత్రము) కనిపెట్టిన తరువాత ఆవిరి యంత్రములు మొదలయినవి వచ్చినవి. ఆ విధముగా బట్టల మిల్లులు ఏర్పడినవి. ఏతత్ఫలితముగా వేలకొలది పనివాండ్రకు పనిపాటులు పోయినవి. ఇది మహాఘోరము. మనము మన దృష్టిని గ్రామములపై కేంద్రీకరించి గ్రామ పరిశ్రమలను శాస్త్రీయ పద్ధతిని పరిశీలనతో నడపినయెడల నవ్యవస్తు నిర్మాణశక్తి ఆ పనివారలనుండియే ఉద్భూత మగును. అప్పుడా గ్రామ పరిశ్రమలు గ్రామాభ్యుదయము నకు సమగ్రముగా తోడ్పడ గలుగును.

(హరిజన్ 18-9-37)

---

# 17 స్వయంపోషక విద్యాలయము

*ఒక ప్రొఫెసరు ఇట్లు వ్రాయుచున్నారు :*

"మన ప్రధాన ఆర్థిక సమస్య జనాభా ఒత్తిడి. ఇండియాలో ఖాళీభూములును లేవు. మనకు వలస రాజ్యములును, పెట్టుబడి సొమ్మును లేవు. కనుక మనకున్న అవకాశములను, అందుకు శిక్షణ పొందిన వారివల్లనే వినియోగించుకొనవలెను. ఒక వందమంది జనులు అక్కడక్కడ చెదరువాటుగా నున్న వందపొలము చెక్కలను సాగు బడిచేసి ఒక యాభైమందికి ఆహారము పండించుచున్నారు. అట్లుగాక, ఆ పొలము చెక్కలను ఏక మొత్తముచేసి, ఆ పొలమును ఇరువది మంది రైతులకు వప్పగించి, వారిలోనే ఒక ఎరువుల నిపుణుడు, మొక్క పెంచుటలో నిపుణుడు, నీటి పాఱుదల నిపుణుడు ఉండునట్లు ఏర్పాటు చేసినయెడల, ఆ పొలములోనే నూఱుమందికి సరిపడునట్లు ఆహారము పండగలదు. ఎన్నో నూతన వస్తువులు కనిపెట్టబడుచుండుట వల్ల పారిశ్రామికుని ఉత్పత్తిశక్తి వృద్ధి పొందినది. అతడు ఇంటినుండి కదలవలసిన పనిలేదు. స్వతంత్రమును పోగొట్టుకొనవలసిన పనిలేదు. అందువలన చాలమంది ప్రజలు కష్టపడవలసిన పనిలేదు. యాభై సంవత్సరముల వయస్సు రాగానే ప్రజలను రిటయిరీ కావలసినదని చెప్పుట అర్థములేని మాట. కారణ మేమనగా అప్పటినుండియే వారి శారీరిక, మానసిక శక్తులు మిక్కిలి చుఱుకుగా పనిచేయగలవు. కనుక ప్రజలకు మంచి శిక్షణ, విద్య లేనిదే, పనిపాటులలోనికి దిగనీయరాదు.

మనము దీర్ఘముగా ఆలోచించిన యెడల, ఇండియాలో చిన్న పిల్లలనుండియే జీవితము ప్రారంభ మగుటవలన, ఇండియాకు యీ ఆర్థిక దౌర్భాగ్యము పట్టుకొన్నదని తెలియగలదు. ఒక వడ్రంగి తన

కొడుకును చిన్నతనములోనే పని నేర్చుకొనుటకు ఏర్పాటు చేయును. ఆ బిడ్డకు పన్నెండేండ్ల వయస్సు వచ్చునప్పటికి బాగుగా సంపాదించు నట్టి శక్తి ఏర్పడును. తరువాత పెండ్లాడును. అటుపిమ్మట స్వంతముగా వృత్తి సాగించుకొనుచుండును. ఇంక ఉత్పత్తి సాధనములను గురించి, సరకు విడుదలను గురించి వచ్చిన నూతన పద్ధతులను చెవిని పట్టించు కొనడు. చిన్న పిల్లలకు బుద్ధి వికాసము ఏర్పడకుండ ఉన్నస్థితిలో వారిని పరిశ్రమలలో పని నేర్చుకొనుటకు ఒప్పగించిన యెడల వారిబుద్ధి చట్టుగట్టిపోవును. అందువలన వారికి తాము చేయుచున్న పనిలోని ఆర్థిక ప్రయోజనము తెలియదు. ఎవరయినను అటువంటి పనివారిని మోసగింపవచ్చును. అందువల్ల వారు తమకు వచ్చెడి ఆ కొద్ది ఆదాయముతోనే తృప్తిపడి ఎట్లో జీవయాత్ర చేయుచుందురు. దీనికితోడు ఇండియాను అంటిపెట్టుకొనియున్న సంకుచిత దృష్టి, ప్రారబ్ధము, వర్ణపద్ధతి, ఏకొంచెము వచ్చినను దానితోనే సంతృప్తి, మందులు, త్రాగుడు— ఇవి వారిని ఆవరించియుండును. నేను సింహళములోని వ్యవసాయపు తోటలను చూచినప్పుడు అక్కడ చిన్నచిన్న పిల్లలు కూలీలుగా పనిచేయుచుండుట చూడగలిగితిని. అప్పుడు నా మనస్సునకు ఎంతో బాధ గలిగినది. అక్కడ పాఠశాలలున్నవి. కాని తలిదండ్రులు తమ బిడ్డలను కూలిపనిలోనికే దింపెదరు. వ్యక్తులకు మాత్రమే లాభము గలిగించి సమాజమునకు నష్టము గలిగించు పనులను అరికట్టుట ప్రభుత్వమువారి విధి. సింహళమువంటి దేశములోకూడ దేశోన్నతికి వలయు సాధనములను వినియోగించుకొనుటకు తగిన జనాభా చాలకపోయినను సరే, చిన్నపిల్లలను కూలీలుగా ఉపయోగించుటను సమర్థింపలేము. పెద్దవారికి చిన్న పిల్లలను వృద్ధిలోనికి తీసికొనిరావలెననుచూపు ఉండదు. ఇండియాలో చిన్నపిల్లలను కూలీలుగా చేర్చుకొంటిమా, పెద్దవారికి నిరుద్యోగమన్నమాట. కనుక ఈ విషయమును ఎన్నటికిని అంగీకరింపజాలము.

స్వయంపోషక కార్ఖానా పాఠశాలలలో వస్తువులు తయారగుచుండుట, వానిని మార్కెట్టుకు పంపుచుండుట జరుగుచుండునేగాని పిల్లలకు చదువు రాగలదనిమాత్రము భ్రాంతిపడకండి. నిజమాలోచించిన యెడల పిల్లలను కూలీలుగా వినియోగించుకొనుటకు సర్కారు శాసనము తెచ్చుకొన్నామన్నమాట. ఒక పాఠశాలలో వడుకుపని ముఖ్యవృత్తిగా ఏర్పాటు చేసినారనుకొనుడు. ఆ చక్రము తిరుగుచుండుట అలవాటుపని అయిపోవును. అంతేకాని నూలు లెక్కపెట్టుట వల్ల లెక్కలు రాగలవని, ప్రత్తి రకములు తెలిసికొనుటవల్ల చరిత్ర, భూగోళములు రాగలవని మీరు చెప్పుచుందురే. దానిని నేనునమ్మను. ఆ పనులు ఒకటి రెండు పర్యాయములు చేసినయెడల మనస్సునకు అప్పటికప్పుడు చురుకుదనము గలుగును. అంతేకాని నిత్యము చేయుటవల్ల మనస్సునకు స్తబ్ధతయే యేర్పడును. సృష్టిక్రమములో మనుష్యుడు శక్తిమంతుడుగా లెక్కింపబడుచున్నాడు. అతనికి వేలు వేలు అభిరుచులుండుటవల్ల కాదు. వైవిధ్యముతో కూడిన ఈ లోకములో సమన్వయము చేసికొనుచు పోవునట్టి విజ్ఞానము గలుగుట వల్ల అతనికి శక్తి ఏర్పడుచున్నది. కంటికిని, చెవికిని, చేతులకును శిక్షణ అవసరమే. విద్యాలయము లన్నిటిలో చేతిపనిని నిర్బంధము చేసితీరవలెను. చేతులకు శిక్షణ యిచ్చుటవల్ల బుద్ధికికూడ శిక్షణ యిచ్చుచున్నామని పొరపడరాదు. విద్యాబోధ ప్రధానముగాగల పాఠశాలలలో అమ్మకమునకు పనికివచ్చు ఉత్తమవస్తువులను తయారు చేయవలెనను తలంపు విడిచిపెట్టవలెను. ఎన్నో ముడివస్తువులను, యంత్రములను పిల్లలకివ్వవలెను. వానిని పాడుచేయనీయవలెను. రద్దు (Waste) పోవుట అన్నది తప్పదు. ఇప్పటి హరిజన పత్రికలో శ్రీయుత పరీఖు కొన్ని అంకెలను ప్రచురించియున్నారు. వానినిబట్టి చూడగా, ఏదోవృత్తిని ప్రధానముగా పెట్టుకొని దానినే శ్రద్ధగా రాపాడించిన విద్యాలయములోనే, అందులోను ఈడువచ్చిన పిల్లలు

ఆ పనిని చేపట్టియుండగానే, రద్దు బాగానే రాకతప్పినదికాదు. సైన్సు కళాశాలవంటి ఒక వృత్తిపాఠశాల ఉన్నదనుకొనుడు. ప్రయోగములు చేయుటకు, రద్దు ఏర్పడుటకే అది నడపబడుచున్నది. ఇండియాలో వస్తూత్పత్తికి వలయు సాధనములు తక్కువగానున్నవి. అందువలన వృత్తి విద్యాలయములు ప్రతిచోటను స్థాపింపరాదు. ముఖ్యమయిన కేంద్రములలోమాత్రమే స్థాపింపవలెను. కాన్పూరులో చర్మములు బాగుచేయుటకయి విద్యాలయము పెట్టినయెడల విద్యార్థులు గోరకుపూరునుండి, అయోధ్యనుండి పోయి అక్కడ శిక్షణ పొందినయెడల అది దేశమునకు నష్టముకాదు. కాని హద్దులేకుండ వృత్తి విద్యాలయములు సాగించినయెడల ఎంతో రద్దు ఏర్పడును.

మఱియొక విధమయిన రద్దుపర్పడుచున్నది. ఈ విషయమయి ఎవరును ఆలోచించినట్లు కనబడదు. సమర్థుడును, ఈడువచ్చిన వాడును అయిన పారిశ్రామికుడు ముడిప్రత్తిని తీసికొని, నూతన యంత్రములతో పనిసాగించినయెడల అతడు నలుగురు మనుష్యులకు కావలసిన వస్త్రమును సప్లయిచేయగలడు. ఆ పనినే చేతకాని చిన్న పిల్లవానికి ఒప్పగించినయెడల వాడు ఇద్దఱు మనుష్యులకు కూడ చాలకుండ బట్టను తయారుచేయవచ్చును. అనగా నేమి? ఇండియాకు కావలసిన బట్టనిమిత్తము రెట్టింపు భూమిని ప్రత్తివ్యవసాయము నిమిత్తము సాగుబడిలోనికి తేవలెను. లేదా మఱియొక విధముగా చెప్పుకొనవచ్చును. ఇండియాకు కావలసిన బట్టను సప్లయి చేయుటకు చేతకాని పిల్లలను వస్త్రపరిశ్రమలో వినియోగించినయెడల ప్రత్తి వ్యవసాయమునకుగాను కొంత భూమి కావలసివచ్చును గదా. ఆ పరిశ్రమయే సమర్థులు చేతబట్టినయెడల ఆ భూమియే ఇండియాకు కావలసిన బట్టను, ఆహారమును సప్లయిచేయుటకు సరిపోవును.

ఇంకొక విధముగా కూడ రద్దు ఏర్పడుచున్నది. దీనినిగూడ గుర్తుంచుకొనవలెను. స్కూలుపిల్లలు ఆటవస్తువులు మొదలగు వినోద

వస్తువులు తయారు చేయగలరని చెప్పుచుందురు. ఒక టెక్నికలు పాఠశాలలో శిక్షణపొంది వచ్చిన ఒక పిల్లవాడు 'ప్లయివుడ్డు' తో బొమ్మలు చేయుచుండగా చూచితిని. వాడు ఉపయోగించే కొయ్య, స్క్రూలు, పనిముట్లు అన్నియు విదేశీవే. అటువంటి పరిశ్రమలవల్ల, విదేశీవస్తువుల అమ్మకము లేనిచోట, అవి అమ్ముడుపోవుటకు మాత్రమే మార్కెట్లు ఏర్పడుచుండును. మనకు కావలసిన 'ప్లయివుడ్డు' ను ఇక్కడనే ఉత్పత్తిచేసికొనవచ్చునని ఒక వాదము చెప్పవచ్చును. కాని ఇండియా, అమెరికా కాదు. అమెరికాలోవలె ఇండియాలో ప్లయివుడ్డు ఉత్పత్తికిగాను చెట్లువేసి పెంచుకొనుటకు అదనముగానున్న ఖాళీ భూములు లేవు. మనకు గల ముడివస్తువులను, పెట్టుబడి ధనమును అనవసర వస్తువులను ఉత్పత్తిచేయుటకుగాను ఎన్నడును వినియోగింపరాదు. అట్టి ఆటలను గట్టిగా అరికట్టవలెను.

ఒక పాఠశాలలోగాని, ఒక కళాశాలలోగాని చదువుచున్న చిన్న బిడ్డలకు, తమకున్న శక్తులను శ్రేష్ఠముగా వినియోగింపగలమనియు, శ్రేష్ఠులము కాగలమనియు ఈ మొదలగు ఉత్తమభావనలేర్పడవలెనుగాని, వస్తువుల ధరలను గురించి వారు చింతనచేయుచు కూర్చుండరాదు. ఏవస్తువైనను మనస్సుపైన సులభముగా ముద్రితమగు పసితనములో వస్తువుల తయారు, మార్కెట్లు, డబ్బుసంపాదన ఇవే ఆదర్శములని బోధించితిమా పిల్లలకు ఎదుగు పొదుగు ఉండదు. పైగా మనము చాల శ్రమపడవలసి వచ్చును. ఈనాడు లోకములో సమృద్ధి ఏర్పడియుండగా మనమూలమున లోకమునకు దరిద్రము చుట్టుకొనును. శ్రీరామకృష్ణులు వృత్తివిద్యలకు ఎన్నడును ప్రాముఖ్యమిచ్చియుండలేదని మనము గుర్తుంచుకొనవలెను.

మన విద్యాబోధను త్వరితముగా సాగించవచ్చుననియు, పిల్లవాడు ఏడేండ్లలో నేర్చుకొను చదువును, రెండేండ్లలో నేర్చుకొనునట్లు చేయవచ్చుననియు చెప్పుట అంతా మాయయే. బాలకుని

మనస్సు ఏది పట్టిన అది పోయుటకు ఖాళీజాడీ వంటిది కాదు. బాలుడు పదునాఱవ యేట నేర్చుకొనదగు విద్యను ఎనిమిదవ యేటనే నేర్వ రాదు. నేర్చుకొన నివ్వరాదు. ఆలస్యమునకు కారణము విదేశీ భాష కాదు. ప్రజలు తలచునట్లు వలె, ఆ భాషాబోధకు ఎక్కువ కాలము వినియోగించుచుండుటలేదు. వ్యాస రచన వల్ల బుద్ధికిని, ఉత్తేజిత భావములకును శిక్షణ యేర్పడును. కనుక అట్టి శిక్షణ విధిగా నెమ్మది గానే జరుగవలెను. ఇంగ్లాండులో పాఠశాలలలోని పాఠ్య విషయము లను గుఱించిన కాలనిర్ణయ పట్టిక విద్యా వార్షిక గ్రంథములో ప్రక టింపబడినది.

| | | |
|---|---|---|
| అసెంబ్లీ, రిజిష్ట్రేషను మతబోధ | $2\frac{1}{2}$ | గంటలు |
| ఇంగ్లీషు (వ్రాత, చదువు, వ్యాకరణము వ్యాసరచనతో సహా) | 10 | ,, |
| గణితము | $5\frac{1}{2}$ | ,, |
| చరిత్ర, భూగోళము | 3 | ,, |
| సైన్సు, ఆర్టు (మాన్యుయల్ శిక్షణ సహా) | 3 | ,, |
| దేహ పరిశ్రమ, ఆటలు | $3\frac{1}{2}$ | ,, |
| | $27\frac{1}{2}$ | |

విద్యా బోధలో సగము కాలము ఇంగ్లీషునకు ఏర్పాటు చేయ బడినది. అక్కడ చెప్పెడి ప్రతి పాఠము ఇంగ్లీషులోనే. భాష ఎంత క్లిష్టముగా నున్న, దానిని సాధించుటకు ఎంత యత్నముచేసిన బుద్ధి కంత వికాసము గలుగుటయే గాక ఎంతో శక్తిమంతము కాగలదు. బుద్ధి వికాసమునకు చేయు సాధనములు, నిరుపయోగకరములుగాను, వ్యర్థములుగాను, మందముగాను ఉన్నట్లు తోచవచ్చును. అయితే విద్యా ప్రయోజనము బుద్ధి వికాసమనియు, సామాజిక జీవితములో సమన్వయము నేర్చుకొనుట అనియు మనము గుర్తించుకొనవలెను.

విద్యాలయములలో ఉత్తమ పురుషులతో పాటు వస్తువులు కూడ తయారుకావలెనని పట్టుపట్టకుందుముగాక.

చివరి మాట ఒక్కటి చెప్పెదను. కన్నులు మూసికొని వ్యవహరించినందువల్ల విద్యాలయములు వస్తుసమృద్ధములు కావచ్చునేమో గాని దేశమునకు తీఅని నష్టము గలుగును. అది ఆర్థిక దోషము"

*దీనిపయి గాంధీజీ వ్యాఖ్యా:*

ప్రసిద్ధ విద్యాపీఠమునకు చెందిన ప్రొఫెసరు వ్రాసిన వ్యాసమిది. వేఱే నాకు వ్రాసిన స్వంత ఉత్తరములో తమ పేరు వ్రాసికొని యున్నారు. ఈ వ్యాసములో మాత్రము తమ పేరు వ్రాసికొని యుండలేదు. అందువల్ల నేను కూడ వారి పేరు ప్రకటించుటలేదు. ఏమయినను పాఠకులు తెలిసికొనవలసినది విషయముగాని వ్యాసకర్త కాదు గదా. ఒకరికి కొన్ని అభిప్రాయములు అంతకు మునుపే ఏర్పడి యున్నయెడల వారి చూపులో ఇంక ఇతర విషయములు కనబడవు. అందుకు ఈ వ్యాసమే ప్రమాణము. ఈ వ్యాసకర్త నా ప్లానును అర్థము చేసికొనుటకు ప్రయత్నము చేసియుండలేదు. నేను సూచించిన విద్యాలయములో చదువు బాలకులకును, సింహాళములో అర్ధ బానిసత్వములో పనిచేయుచున్న కూలీ బాలకులకును సామ్యము చెప్పుటలోనే స్వవిషయమును స్వకీయముగానే ఖండించుకొనియున్నారు. వ్యవసాయపు తోటలలో పనిచేయు పిల్లలను విద్యార్థులవలె చూడరు. ఆ పిల్లలుచేయు కూలిపని శిక్షణవంటిదికాదు. నేను సూచించినపద్ధతి ప్రకారము పిల్లలు హైస్కూళ్ల చదువు అంతయు చదువుకుందురు. కాని ఇంగ్లీషు మాత్రము ఉండదు. అంతేగాక డ్రిల్లు, సంగీతము, డ్రాయింగు, వృత్తి ఇవికూడ ఉండును. ఈ పాఠశాలలను ఫ్యాక్టరీలనుటలో అర్థములేదు. నేను ఎన్నో ప్రత్యక్ష ప్రమాణములు చూపుచుండగా వానిని చెవినిపెట్టకపోవుట మొండితనమే అనిపించుకొనును.

ఒకనికి, మానవుని స్వరూపాదులను గురించి వర్ణించి చెప్పితి మను కొనుడు. మానవుడు కోతి అని అతడు చెప్పుచుండును. కారణ మేమనగా అతడు కోతిని తప్ప మఱే జంతువును చూచియుండలేదు. అదిగాక కొన్ని అంశములలో మాత్రమే కోతికిని మానవునకును సామ్యమున్నమాటకూడ నిజమేగదా! నేను సూచించిన విద్యాపద్ధతి వల్ల గొప్ప పరిణామములు గలుగునని ఆశపడవద్దని ప్రజలను హెచ్చ రించుచు ఆ ప్రొఫెసరు ముచ్చటించిన బాగుండెడిది. ఆ హెచ్చరిక కూడ అనవసరమే. కారణమేమనగా ఆ హెచ్చరికను నేనే చేసి యున్నానుగదా!

నా సూచించిన విద్యాపద్ధతి వింతయయినది, నవీనమైనదని నేనే ఒప్పుకొంటిని. నవీనమగుట నేరము కాదే. ఈ విద్యాపద్ధతి గొప్ప అనుభవసిద్ధమయినది కాదనికూడ నేను ఒప్పుకొనుచున్నాను. అయితే నాకును, నా మిత్రులకును గలిగిన అనుభవము కొద్దిపాటిదే అయినను, ఈ ప్రణాళికను నమ్మకముతో కొనసాగించితిమా మనకు మంచి ఫలితములు రాగలవని గట్టిగా నమ్ముచున్నాము. కనుక మేము సూచించిన పద్ధతిని ప్రయోగముచేసి చూడవచ్చును గదా. అప్పుడు వృథాఅయినను నష్టము లేదు. మా పద్ధతి కొంతవఱకు గెలుపొంది నను అఖండ లాభములే కలుగగలవు. ప్రారంభిక విద్యను ఉచితము గాను, నిర్బంధముగాను, సమర్థముగాను నడపుటకు ఇంతకంటె వేఱే గతి లేదు. ఇప్పటికి ప్రారంభవిద్య వట్టి బూటకము, దగా అని అందఱు ఎఱిగినట్టినదే.

శ్రీ నరహరి పరీఖు చూపిన అంకెలు కొంతవఱకు నా ప్లానును పుష్టి చేయుటకే ఇవ్వబడినవి. అవి సమగ్రమయినవి కావు. కాని ఉత్సాహజనకముగా నున్నవి. కార్యకర్తలకు మంచి ఆధారముగా నుండగలవు. నా ప్లానులోని ఏడు సంవత్సరముల కాలవ్యవధి ప్రధాన మయినది కాదు. నేను కోరినట్లుగా బుద్ధి వికాసము కలుగుటకు

ఇంకను ఎక్కువకాలము కావలసి రావచ్చును. విద్యాబోధ కాలము పెంచినందువల్ల దేశమునకు నష్టము కాగలదు. నా ప్లానులోని ప్రధానాంశము లివి.

1. బాలకునిగాని బాలికగాని సర్వతోముఖవికాసమునకు నిండుగా ఒక వృత్తిగాని, వృత్తులుగాని బోధనామాధ్యమముగా నుండ గలవు. కనుక పాఠ్యవిషయము లన్నియు ఆ వృత్తి శిక్షణకు సంబంధించినవే అయియుండవలెను.
2. ఈ విధముగా సూచింపబడిన ప్రారంభిక విద్య, మొదటి ఒకటి రెండు సంవత్సరములలో కాకపోయినను, మొత్తముమీద స్వయంపోషకముగా నుండవలెననియే అభిప్రాయము. పైన చెప్పినదే ప్రారంభ విద్య.

పైన చెప్పిన ప్రొఫెసరు, లెక్కలు మొదలగునవి, వృత్తుల ద్వారా బోధింపవచ్చునా యని యడుగుచున్నారు. వారికి అనుభవము లేదు. నేను అనుభవముతో చెప్పుచున్నాను. ట్రాన్సువాలులోని టాలు స్టాయి ఫారములో నేను పిల్లలకు పై విధముగానే చదువుచెప్పి వారి సర్వతోముఖవికాసమునకు కృషి చేసితిని. అందు నాకేమియు కష్టము కనబడలేదు. అక్కడ ప్రధానాంశము వృత్తియే. సుమారు ఎనిమిది గంటలసేపు పిల్లలు త్రవ్వుట, వంట, పాకీపని, చెప్పులు కుట్టుట, చిన్న వడ్రంగము పనులు, ఉత్తరములు పట్టుకొనిపోవుట, తెచ్చుట ఈ పనులు చేయుచుండిరి. పిల్లలు ఆఱేండ్ల వయస్సు మొదలు పదు నాఱేండ్ల వయస్సువఱకు నుండిరి. అప్పటికంటె ఇప్పుడు మాకింకను అనుభవము పెరిగినది.

(హరిజన్ 18-9-37)

# 18 పని - వృథా ఆలోచనలు కాదు

డాక్టరు జి. యస్. ఆరండేలు "ఓరియంటు ఇల్లస్ట్రేటెడు వీక్లీ" అను పత్రికకొక వ్యాసము వ్రాసి, దాని నకలును నాకు ముందుగా పంపుచు ఈ దిగువ ఉత్తరమునుకూడ వ్రాసియున్నారు.

"చాలసంవత్సరముల నుండి ఈ దేశములోని విద్య కృత్రిమముగా నడచుచున్నది. కాని ఇప్పుడు మీరు నిజమయిన చదువు చెప్పింపదలచినట్లు సూచించుచున్నారు. ఇండియాలో నేను ముప్పది సంవత్సరములనుండి విద్యాశాఖలో పనిచేయుచు అనుభవము గడించియున్నాను. దానిని పురస్కరించుకొని "ఓరియంటు వీక్లీ" పత్రిక కొఱకు ఒక వ్యాసము వ్రాసి, యిందుతో నకలు పంపుచున్నాను. అందు చాలవఱకు మీ అభిప్రాయములే ఉండగలవు. ఈ దేశములో జాతీయ విద్యాప్రణాళిక ఒకటి ఉండవలెనని గట్టిగా అభిప్రాయపడుచున్నాను. అట్టి ప్రణాళికను జాతీయమంత్రి తన ప్రాంతములో అమలుపఱచవలెను. ఈ రోజులలో ఎవరికివారు స్వతంత్రముగా ఏదో అస్పష్టమయిన అభిప్రాయములు గలిగియున్నారు. అట్లుగాక, విద్యాప్రయోజనములోని ప్రధాన సూత్రములను గట్టిగా విప్పిచెప్పుట ఇప్పుడు చాల అవసరము. ఆలస్యము కూడదు. అట్లుచేసినయెడల ప్రజలును, ప్రభుత్వమును కలిసి ఏకసూత్రతతో కష్టపడి పనిచేయవచ్చును." అని.

శ్రీ ఆరండేలు వ్యాసములోని ముఖ్యభాగములను ఇటపొందుపఱచుచున్నాను.

"జాతీయ విద్యలో ఉండవలసిన సూత్రములేవో, వానిస్వరూపమేమో తెలియబఱచుటకు ఇక్కడ చోటుచాలదు. బాలబాలికల

విద్యాలయములకు సంబంధించినంతవఱకు, పాఠశాల, కళాశాల అను పాపిష్ఠి విభజనను మనము క్రమక్రమముగా తొలగింపవలెను. అక్కడను ఇక్కడను "కర్మ" తోనే మన వ్యవహారము—

బుద్ధి వికాసమునకు లక్షసాధన లుపయోగింప వచ్చునుగాక. అది కర్మరూపముగా పరిణతి పొందనంతవఱకు దానికి విలువలేదు. మన భావములను, ఉత్తేజములను సయితము కర్మరూపములోనికి దింపవలెను. ఈనాటి చదువులలో దీనివిషయమయి ఎవరును పట్టించు కొనకపోవుట మహాప్రమాద కరము. నేటికి ఇండియాలో కార్యకర్తలు కావలెను. విద్యాబోధవల్ల వారికి ఉన్నతశీలము ఏర్పడవలెను. వారి శీలసంపత్తి వారిపనిలోను సేవాధర్మములోను కనబడవలెను. ఇండియాలో నేటికి సేవాపరాయణులును, ధర్మమూర్తులునైన వారు కావలెను. వంశ పరంపరనుబట్టికాని, స్థితిగతులనుబట్టికాని వారి కేపని వప్పగించిన, దానిని నిర్దుష్టముగా చేయవలెను. ప్రతి విషయమందును ధర్మశాసనము, ధర్మదేశము, పురుషార్థము గోచరించుచునేయుండును. పోనుపోను, ఉపాధ్యాయులు జీవితఘట్టములలో ప్రవేశించినప్పుడు ఈ ధర్మసూత్రములను మఱచియుండరాదు. నేటి బుద్ధియుగములో సంప్రదాయములేగాని సత్యవిషయములు లేవు. విజ్ఞానశాస్త్రమువల్ల యథార్థమును సందేహవిషయముగా గుర్తించుచున్నామని సర్ ఆర్థరు ఎడ్డింగ్టను చెప్పినమాట సరియయినది. విద్యార్థులు సత్యవిషయముల వలె కనబడు వాని జోలికి పోరాదు. ఇంక వారు తమ శక్తుల నన్నిటిని కూడగట్టుకొని శీలసంపత్తిని పెంపుచేసికొనుటకు యత్నింప వలయును. వ్యక్తులకుగాని, దేశములకుగాని అట్టి శీలమే పునాది.

ఒక్కసారి శీలసంపదకు ఉత్తేజము గలిగెనా ఇక కర్మచేయ వలెనను కోరికగలుగును. అట్టి కర్మ స్వయంపోషకముగాను, త్యాగ మయముగాను ఏర్పడును. అప్పుడు మనము భూమాతకు మిక్కిలి సమీపముగా పోయి, సేద్యమను ధర్మక్రియానుష్ఠానముచే ఆమెను

పూజించి ఆమెకు భారప్రాయముగా నుండకుండ, తక్కువ అవసరములతో సంతృప్తిచెంది పవిత్రభావములతో నుండవలెను. ప్రతి విద్యార్థియు తన పోషణనిమిత్తము భూమాతతో ప్రత్యక్ష సంబంధము గలిగి యుండవలెను - పల్లెలోనైనను, బస్తీలోనైనను విద్యాలయము లన్నిటిలోను తల్లికి, బిడ్డకు ఇట్టి ప్రత్యక్ష సంబంధ మేర్పడవలెను.

ఈ రోజులలో విద్యను ఎన్నో సంప్రదాయములు ఆవరించి యుండుటవల్ల అది ఎందుకును కొఱగాకపోయినది. అట్టి సంప్రదాయములను ఒక్కసారిగా విడనాడవలెను. ఇప్పుడు జాతీయ మంత్రు లేర్పడిన శుభసమయములో ఏదో విషయబోధగాక నిజమయిన విద్యనే మనము ప్రవేశపెట్టవలెను. విద్యావిధానమను పేరుతో మన మెన్నో పనికిమాలిన దుష్టపద్ధతులకు అలవాటుపడియున్నాము. ఆ పద్ధతులు ఎన్నడో త్రుప్పుపట్టిపోయినవి. వానిని విడనాడవలెను. ఈనాటికి గాంధీజీ స్వయంపోషక విద్యాపద్ధతిని బోధించుచున్నారు. నేను దానిని హృదయపూర్వకముగా సమర్థించుచున్నాను. అయితే వారు సూచించిన మేరకు మనము అందుకొనగలమా, లేమా యని నాకింకను సందేహమున్నది. ఏడు సంవత్సరముల శిక్షణ అనంతరము ప్రతి విద్యార్థి సంపాదనపరుడయి యుండవలెనని గాంధీజీ చెప్పినమాటతో నేను ఏకాభిప్రాయము గలిగియున్నాను. విద్యద్వారా ప్రతిఒక్కడు తన సృజనశక్తిని తాను గుర్తింపవలెను. కారణ మేమనగా తాను ఈశ్వరాంశయేగదా. ఈశ్వరుడు సృజనకర్తయయినట్లు తాను సయితము సృజనచేయుటకు సమర్థుడయి యుండవలెను. అనగా కర్మ నాచరింపవలెను. విద్యవల్ల ఈ కర్మశక్తి ఉద్బుద్ధము కానియెడల, అది కేవలము విషయబోధ కాగలదుగాని విద్యమాత్రము కాజాలదు.

తలలో ఎంత మేధాశక్తి ఉన్నదో, చేతిలోను అంతే ఉన్నది. చిరకాలమునుండి తలలోని ప్రతిభయే మనకు ఈశ్వరుడుగా నుండెను. బుద్ధియే మనకు నిరంకుశ ప్రభువుగాను, నియంతగాను ఉండెను.

క్రొత్తపద్ధతి ప్రకారము అది మన సేవకులలో నొకటిగా నుండవలెను. నిరాడంబర జీవితమునకు కావలసిన అంశములన్నిటిని మనము నేర్చుకొనవలెను. ప్రాకృతికములైన, సుందరములైన పద్ధతులు మనము నేర్వవలెను. కళాకారుడు, చేతిపారిశ్రామికుడు, వ్యవసాయదారుడు చేసినట్టువలె చేతులతో ఎన్నిపనులుచేయుటకు సాధ్యమో అన్ని పనులు చేసి మనలను పోషించుకొనవలెను.

"చిన్నతనమున నేనిట్టి విద్యను సంపాదించియుండిన యెడల ఇంతకంటె ఎక్కువ సుఖకరముగను, ఉపయోగకరముగను జీవించియుండెడి వాడను."

*దీనిపయి గాంధీజీ వ్యాఖ్య :*

నేను సామాన్యునివలె ఇంతకాలమునుండి సామాన్యులయిన పాఠకులకొఱకు నవీన విద్యాపద్ధతిని బోధించుచుంటిని. ఇప్పుడు అట్లుకాదు. డాక్టరు అరండేలువంటి విద్యావేత్త విద్యావంతుల కొఱకును, ఉపాధ్యాయుల కొఱకును ఈ విషయమును బోధించుచున్నారు. స్వయంపోషక విద్యను గుఱించి వారు నిండుమనస్సుతో ఆమోదించుట లేదు. అందుకు నాకు ఆశ్చర్యమును లేదు. కాని నాకది సర్వప్రధాన విషయము. నేను గత 40 సంవత్సరముల నుండి చూచుచున్న అస్పష్ట విషయమును, నూతన స్థితిగతుల ఒత్తిడిని బట్టి ఇప్పుడు విస్పష్టముగా చూడగలుగుచున్నాను.

ఇప్పటి విద్యాపద్ధతి మంచిది కాదని నేను 1920 లో ముక్త కంఠముతో బోధించి యున్నాను. ఇప్పుడు ఏడు రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రులు పనిచేయుచున్నారు. వీరందఱును వైభవోపేతమగు స్వతంత్ర సమరములో నాకు సహచరులుగను, త్యాగమూర్తులుగను ఉండి యున్నారు. కనుక ఇప్పుడు వారిద్వారా ఏకొంచెమైనను పనిని చేయింపవచ్చునని తలంచుచున్నాను. ఇప్పటి విద్యా విధానము

ఆపాదమస్తకము దోషపూరిత మయినదని అందఱును నిందించు చున్నారు. దానిని చేతనైనంతవఱకు సవరింపవలెనని నాకు ఆరూఢముగా తోచుచున్నది. నాకు గలిగిన ఉద్దేశములను అస్పష్టముగానే ఈ పత్రికలో ప్రకటింప గలుగుచున్నాను. అయినను నా కవి మెఱుపు తీగలవలె మార్గము చూపుచున్నవి. నానాటికి నా ఉద్దేశములు ప్రబల మగుచున్నవి. అందువలన నేను సాహసించి విద్యావేత్తల నందఱను ఈ విషయమును కోరుచున్నాను. నేను సూచించిన రెండు సూత్రములను నిష్పక్షపాత బుద్ధితో, అంతకు పూర్వము వారికున్న అభిప్రాయములను విడిచిపెట్టి, లెస్సగా విచారింప దగుదురు. విద్యా విషయములలో శాస్త్రదృష్ట్యా గాని, సిద్ధాంత దృష్ట్యాగాని నేను బొత్తిగా అనుభవములేని వాడనని కొట్టివేయకుండ నేను చెప్పుచున్నది, వ్రాయుచున్నది పరిశీలింపవలసినదని వారిని కోరుచున్నాను. పాలబుగ్గల చంటిబిడ్డలనుండియే జ్ఞానము ఆవిర్భవించునని తఱుచు చెప్పుచుందురు. ఇది కేవలము కవి కల్పన కావచ్చును. అయినను ఒక్కొక తఱి, అది నిస్సందేహముగా చంటిబిడ్డలనుండియే వచ్చును. కార్యనిపుణులు దానిని మెఱుగు పెట్టి శాస్త్ర సూత్రముగా ప్రతిపాదించెదరు. కాబట్టి నేను సూచించిన విషయములను కేవలము ప్రాశస్త్యమును బట్టియే చూడవలెనని కోరుచున్నాను. ఇక్కడ ఆ రెండు విషయములను మరల చెప్పనీయండి. ఇవి లోగడ ప్రకటింపబడినవేయయినను, ఇప్పుడు నాకు తోచిన భాషలో వానిని తిరిగి ప్రకటించుచున్నాను.

1. ప్రారంభవిద్య ఏడేండ్లు బోధింపవలెను. అంతకంటె ఎక్కువ కాలమైనను బాధలేదు. ఇంగ్లీషుతప్ప మిగిలిన విషయములన్నియు మెట్రిక్యులేషను స్థాయిలో నుండవలెను. బాలబాలికలకు సర్వతోముఖ వికాసము గలుగునట్లు వృత్తిబోధ జరుగవలెను. ప్రయిమరి, మిడిలు, హైస్కూలు విద్యలని చెప్పబడు

చున్న చేదువంతయు నేను సూచించిన ప్రారంభవిద్యలో ఇమిడి యుండవలెను.

2. మొత్తముమీద ఆ విద్య స్వయంపోషకముగా నుండవలెను. నిజమునకు ఆ విద్య, సారము గలదని చెప్పుటకు, అందలి స్వయంపోషకత్వమే ప్రబల ప్రమాణము.

(హరిజన్ 2-10-37)

## 19 ప్రారంభవిద్య - బొంబాయి

భారతదేశములోని జనులు అధిక సంఖ్యాకులు గ్రామములలో నివసించుచున్నారు గనుక ప్రారంభ విద్యను గుఱించి నేను ప్రస్తావించినప్పుడు బుద్ధిపూర్వకముగానే గ్రామములను గూర్చి మాత్రమే ముచ్చటించితిని. గ్రామ సమస్యలను పరిష్కరించితిమా, నగర సమస్యలను సయితము పరిష్కరించినట్లే. అయితే బొంబాయి నగరములో ప్రారంభ విద్యావ్యాప్తి జరుగవలెనని ఆతురపడునట్టి మిత్రు డొకడు నా కిట్లు వ్రాయుచున్నాడు.

"ప్రారంభవిద్యకు గాను సొమ్ము ఎక్కడనుండి పట్టుకొని రావలెనా యని కాంగ్రెసు మంత్రులు తికమకపడుచున్నారు. ప్రారంభ విద్యను స్వయంపోషకముగా చేయవలెను అన్న సంగతి ఆలోచనలో ఉన్నది. బొంబాయినగరము వంటి చోట ఇది ఎంతవరకు సాధ్యమో ఆలోచింపవలసియున్నది. విద్యాశాఖ పద్దుక్రింద బొంబాయి కార్పొరేషనువారు సాలునకు 35, లేక 36 లక్షల రూపాయలు అంచనా వేసికొనియున్నారు. బొంబాయి నగరములో ప్రారంభ విద్యను నిర్బంధము చేయిదలచిన యెడల పై మొత్తమునకు ఇంకను కొన్ని లక్షల రూపాయలు కలుపవలెను. ప్రస్తుతము ప్రతి సాలున టీచర్ల జీతముల క్రింద 20 లక్షల రూపాయల పైనను, అద్దెల క్రింద 4 లక్షల రూపాయలును ఖర్చుఅగుచున్నవి. ఆ విధముగా లెక్క చూచినయెడల ప్రతి విద్యార్థి నిమిత్తము సగటున 40 లేక 42 రూపాయలు ఖర్చుచేయబడుచున్నవి. విద్యార్థి, వృత్తి శిక్షణ ద్వారా ఇంత మొత్తమును సంపాదింపవచ్చునా అన్నదే ప్రశ్న. అట్లు సాధ్యము కానియెడల ప్రారంభ విద్యను స్వయంపోషకము చేయుటెట్లు ?"

*దీని పయిన గాంధీజీ వ్యాఖ్య :*

వృత్తి శిక్షణ నాధారముగా గల ప్రారంభవిద్యను బొంబాయి నగరములో ప్రవేశపెట్టినయెడల అది ఆ నగరములోని బాలకులకు ఎంతో ప్రయోజనకారిగా నుండుననుటలో ఏమాత్రము సంశయమును లేదు. ఇప్పుడున్న స్థితిగతులలో ప్రారంభ విద్యవల్ల పిల్లలు నేర్చుకొనున దేమియు లేదనియే చెప్పవచ్చును. ఇంక పౌర లక్షణములు అసలే నేర్చుకొనరు.

నగరములలో కూడ వృత్తి నాధారముగాగల ప్రారంభవిద్యను ప్రవేశపెట్టుటకు నేను పూర్తిగా ఆమోదింతును. ఇప్పుడు బొంబాయి నగరములో ఆ విద్య నిమిత్తము ఖర్చు పెట్టుచున్న 35 లక్షల రూపాయలలో ఎక్కువ భాగము గాని అంతయు గాని పొదుపు చేసికొనుటకు వీలుండును. ఇప్పుడు బొంబాయిలో బొంబాయి కార్పొరేషనువారు ప్రతిబాలకుని ప్రారంభ విద్యకును సాలునకు రు. 40 లు ఖర్చుపెట్టిన యెడల వారు విద్యాశాఖలో మొత్తము ఖర్చుపెట్టే సొమ్ముతో 87,500 మంది పిల్లలకు చదువు చెప్పించుచున్నారన్నమాట. బొంబాయి జనాభా 10 లక్షలు అయిన యెడల పాఠశాలకు పోవు వయస్సు గల బాలబాలికలు లక్షన్నర మంది ఉండగలరు. అనగా ఇప్పుడు బొంబాయి నగరములో పాఠశాలకు పోవు వయస్సు గల బాల బాలికలు 62 వేల మందికి విద్యాదానము లేదన్నమాట. 6 వేల మంది పిల్లలు ఇంటి వద్దనే ప్రయివేటుగా చదువుచున్నారనుకొని వారిని తీసివేసినయెడల ఇంకను 56 వేల మంది పిల్లలకు చదువు అందుటలేదనుకొనవలెను. ఇప్పుడున్న లెక్కల ప్రకారము వీరిని చదివించుటకు గాను బొంబాయి కార్పొరేషనువారు ఇంకను రు. 22,40,000 లు తేవలసియుండును. అంత సొమ్ము కొద్దిసంవత్సరములలో వారు సంపాదింపగలరను నమ్మకము లేదు.

హిందుదేశములో నిర్బంధోచిత ప్రారంభవిద్య అమలుజరుగవలెనను గట్టిపట్టుదల గలవారిలో నేనొకడను. పిల్లలకు ఏదేనొక వృత్తి నేర్పినందువల్లను, దానిద్వారా వారికి మానసిక, శారీరిక, ఆత్మిక వికాసము కలుగజేయుటవల్లనే ఆ శిక్షాపద్ధతి సాధ్యమని నేను నమ్ముచున్నాను. విద్యకు సంబంధించిన ఈ లెక్కలన్నియు పనికిమాలినవని ఎవరును తలంపరాదు. అర్థశాస్త్రమునకు సంబంధించిన లెక్కలలో పనికిమాలినతనము లేనేలేదు. ఉత్తమ నైతిక పద్ధతికిని అర్థశాస్త్రమునకును వ్యతిరేకత లేదు. నిజమునకు ఉత్తమ నైతిక పద్ధతి అర్థశాస్త్రమునకు అనుకూలముగానే ఉండవలెను. ధనమును చేతులతోను, కాళ్ల తోను ప్రోగుచేయవలసినదని ప్రేరణ చేయునట్టిదియు, బీదల నోరు కొట్టి బలవంతులు అధిక ధనము కూడబెట్టుట కవకాశము గలుగజేయునట్టిదియు నగు అర్థశాస్త్రము పరమ పాపిష్ఠిదని చెప్పవలెను. దానివలన మృత్యువు సంభవించును. నిజమయిన అర్థశాస్త్రమువల్ల సామాజిక న్యాయము జరుగవలెను. దుర్బలునకు, కడనున్న వానికి సర్వులకు క్షేమమే కలుగవలెను. ధర్మజీవనమునకు అట్టి అర్థశాస్త్రము ఉపకరింపవలెను. కనుక బొంబాయి నగరములో వృత్తిశిక్షణగల ప్రారంభ విద్య అమలుజరుపబడి, దానికగు ఖర్చులు రాబట్టగలిగిన యెడల బొంబాయి నగరము భారతదేశములోని నగరములన్నిటికి మార్గదర్శకముగా నుండగలదు. ఒక విద్యార్థి నాలుగు గంటల కాలము ఒక వృత్తిలో పని చేసినాడనుకొందము. నెలలో 25 రోజులు పనిచేయు రోజులు అయినయెడలను, అతనికి గంటకు రెండు కానుల చొప్పున ప్రతిఫలము ముట్టినయెడలను, బాలుడుగాని, బాలికగాని విద్యాలయము నిమిత్తము నెలకు రు. 3-2-0 లు సంపాదించుచుందురు. వృత్తి శిక్షణవల్ల బాలబాలికల మనస్సునకు మంచి చురుకుదనము వచ్చును. ఇంకను బుద్ధివికాసము పొందుటకు ఎంతో అవకాశ మేర్పడును. అయితే శిక్షణ ప్రారంభమునుండియు బాలుడు గంటకు

రెండు కానుల చొప్పున సంపాదింపగలడని అర్థము కాదు. ఏడు సంవత్సరముల మొత్తము కాలములో గంటకు రెండుకానుల చొప్పున సంపాదింపగలడనియే దాని అర్థము.

ఇట్టి వృత్తిశిక్షణవల్ల బాలకుని మనస్సు బండబారి పోవుననియు, చట్టుగట్టిపోవుననియు తలచుట పరమచాదస్తము. సమర్థులయిన ఉపాధ్యాయులు వృత్తిద్వారా శిక్షణ ఇచ్చునప్పుడును, పిల్లలు కలకలలాడు నెమ్మోములతో విద్య నభ్యసించునప్పుడును ఆ దృశ్యములు తలచుకొని మురిసిపోవుచుందును. ఇంకొక మాటకూడ చెప్పవలెను. చేతకాని ఉపాధ్యాయుడు సుందరమైన పాఠమును చేతబట్టుకొని, చెప్పుట చేతకాక పిల్లలకు విసుగు, బాధ గలిగించిన ఘట్టములనుగూడ నేనెఱుగుదును. అయితే మనకు కావలసిన సమర్థులయిన ఉపాధ్యాయు లెక్కడనుండి రాగలరు అన్నది ఒక ప్రశ్న. అవసరమునుబట్టి కావలసినవారు పుట్టుకొని రాగలరనియే దానికి నా సమాధానము. మన విద్యావిధానములో మార్పు తీసికొని రావలెనని దృఢసంకల్పమయి కార్యారంభము చేసినయెడల మనకు కావలసిన సాధన సంపత్తి తనకుతానే శ్రమలేకుండ ఏర్పడగలదు. ఇప్పుడు విద్యాశాఖకుగాను ఖర్చుపెట్టుచున్న సొమ్ములో కొంత భాగమున్ను, సమయములో కొద్దిభాగమున్ను మనకిచ్చి, సమర్థులగు బోధకులను ఇచ్చినయెడల చేతి పారిశ్రామిక శిక్షకులను సులభముగా తయారు చేయగలము. బొంబాయిలోని విద్యావేత్తలను ఒక కమిటీగా వేసి వారిద్వారా నేను చెప్పిన సూత్రముల ప్రకారము ప్లాను వేయించి ఈ ప్రారంభ విద్యను అమలుజరిపించు నెడల అది సులభసాధ్యమే కాగలదు. ఆ విద్యయందు నాకు ఉన్నట్లు వారికికూడ ఆరూఢమైన శ్రద్ధాశక్తు లుండవలెను. అట్టి దృఢసంకల్పము ఆత్మప్రబోధమువల్లనే కలుగవలెను. కాని అనుకరణమువల్ల ఏర్పడదు. లోకములోని ఉత్తమ కార్యములన్నియు ఆత్మ నిశ్చయమువల్లనే ఫలవంతమయియున్నవి.

అయితే నగరములలో నివసించు బాలకులకు ఎట్టి వృత్తులు నేర్పవలెను ? దానికి ఇదమిత్థమను నిర్ణయము లేదు. నా భావములను సూటిగా నే చెప్పుచున్నాను. ఇండియాలోని గ్రామములను పునఃసమృద్ధ వంతములుగా చేయుటయే నా ముఖ్యోద్దేశము. ఇప్పుడు మన గ్రామములు, నగరములపైన వ్రేలాడు అతుకుముక్కలుగా నున్నవి. నగరములు దోచుకొని తినుటకే గ్రామములు నిలిచియున్నవి. నగరముల దయాధర్మముపైన అవి జీవించుచున్నవి. ఇది కృత్రిమపద్ధతి. ఇప్పుడు నగరములు, పల్లెలను దోచుకొనుటవల్లనే పుష్టిగలిగి శోభావంతములయి కలకలలాడుచున్నవి. ఇకముందు అట్లుజరుగరాదు. నగరములు తమ స్వార్థబుద్ధిని విడిచిపెట్టి గ్రామ సౌభాగ్యమునకు పాటుపడవలెను. అట్లు జరిగిననాడు నగరమునకును గ్రామమునకును మధ్య మంచి సామరస్య మేర్పడును. సామాజిక శ్రేయస్సునకు సంబంధించిన ఈ మహాత్కార్యములో నగరములోని బాలబాలికలు ప్రవేశించి వృత్తులద్వారా విద్య నేర్చుకొనదలచినయెడల ఆ వృత్తులు గ్రామావసరములకు సంబంధించునవయి యుండవలెను. నా బుద్ధికి తోచినంతవఱకు ప్రత్తి పరిశ్రమయే అందుకు ఉత్తమమయినది. ప్రత్తి గింజలుతీయుట మొదలు, బాగుచేయుట, నూలువడుకుట ఈ మొదలగు పనులు సర్వశ్రేష్ఠములు. ఈనాటికిని ప్రత్తి గ్రామములలో పండుచున్నది. గింజలుతీయుట, వడుకుట, నేయుట బస్తీలలో జరుగుచున్నది. మిల్లులతో ప్రత్తి పరిశ్రమకు సంబంధించిన పనులన్నియు జరుగుచున్నవి. దానివల్ల మనుష్యులకు, మానవశక్తికి, నైపుణ్యమునకు ఘోరాపచారము జరుగుచున్నది.

అందువల్లనే నూలు వడుకుట, దూది యేకుట ఈ మొదలగు చేతివృత్తులద్వారా ప్రారంభ విద్యాబోధ చేయవలసినదని ముక్త కంఠమున చాటుచున్నాను. దానివల్ల చల్లగా సామాజికజీవితములో అద్భుతమయిన మార్పులు రాగలవు. వాని ఫలితములును అత్యంత

లాభదాయకముగా నుండును. అప్పుడు నగరములకును గ్రామమునకును ఉత్తమ సామరస్య మేర్పడును. ధార్మిక జీవితము ప్రారంభ మగును. వర్గసంక్షోభము ఉండదు. జీవితములో ఒడిదుడుకు లుండవు. అశాంతి తొలగిపోవును. నేడు గ్రామములు నానాటికి క్షీణించిపోవుచున్నవి. ఇక ముందు అట్లు జరుగదు. ధనము గలవారు లేనివారు అను భేదము తొలగిపోవును. ప్రతివారి జీవనమునకు కావలసినసొమ్ము లభించును. ప్రతివారికిని స్వతంత్ర ముండును. అంతర్యుద్ధములు లేకుండ, రక్తపాతము లేకుండ ఇంతటి చక్కనిమార్పు తేవచ్చును. ఇండియావంటి ఖండములో యంత్రములనే ప్రవేశపెట్టదలచినయెడల ఎన్ని కోట్లరూపాయలో కావలెను. అంతసొమ్ముతో మనకు పనిలేకుండ పోగలదు. అంతేగాక విదేశీ యంత్రములపైనను, విదేశీ నిపుణులపైనను ఆధారపడవలసిన పనియుండదు. మహోన్నతమయిన నైపుణ్యము ప్రదర్శింపవలసిన ఘట్టములందు సామాన్యప్రజలే తమ శ్రేయమునిమిత్తము అట్టిశక్తిని ప్రదర్శింపగలరు. అయితే పిల్లికి గంట కట్టగలిగిన వారెవ్వరు? నగరవాసులు నా మాటలను చెవిని పట్టించుకొందురా, లేదా, నాది కేవలము అరణ్యరోదనమేనా? వీనికి సమాధానము చెప్పవలసిన వాడను నేను కాను. నగరములలో నివసించుచు విద్యాప్రేమ గలిగిన యీ విలేఖరులవంటి మిత్రులే సమాధానము చెప్పనర్హులు.

(హరిజన్ 9-10-37)

# 20 స్వయంపోషణ ప్రధానముకాదు

వృత్తిద్వారా విద్యాబోధను గుఱించి గాంధీజీ ఇట్లు చెప్పియున్నారు. అటువంటి శిక్షణను ఇచ్చినయెడల దానివల్ల గలుగు మొదటిఫలితము స్వయంపోషణ. కాని అదియే ప్రధానవిషయము కాదు. వృత్తిని శాస్త్రీయ నియమముల ననుసరించి బోధించుటయు, ప తత్ఫలితముగా విద్యార్థులకు సర్వతోముఖవికాసము గలుగుటయు ఈ విద్యా ప్రయోజనము. ఏ ఉపాధ్యాయుడైనను, వృత్తిని తిప్పలు పడి స్వయంపోషకము చేయగలనని నాకు అభయమిచ్చినయెడల అతనిని నేనంగీకరింపను. విద్యార్థి తన సర్వశక్తులను వికసింపజేసికొనుటవల్ల గలిగిన సహజ పరిణామమే స్వయంపోషణ, అట్లుండవలెను. ఒక బాలుడు చేతి పరిశ్రమలో రోజునకు మూడుగంటలు పాటుపడిన యెడల తాను నిలబడుటకు సంపాదించుకొనగలడు. ఆ పనికి తోడు బుద్ధివికాసము, ఆత్మవికాసము పొందగలిగిన యెడల అతనికి గల్గిన మేలును గుఱించి ఎవరు చిత్రించి చెప్పగలరు ?

(హరిజన్ 11-6-38)

## 21 నిర్ణయములు

నేడు దేశములో అలముకొని యున్న స్థితిగతులను బట్టియు, అవసరమును బట్టియు ఈ నవీన విద్యాపద్ధతి ప్రవేశ పెట్టబడినది. ఇప్పుడున్న స్థితిగతులకు సరిపోవుటకే ఈ విద్యాపద్ధతి ప్రయోజనము. ఈ స్థితిగతులు ఇండియాలోని 7 లక్షల గ్రామములను, అందు నివసించు కోట్లకొలది గ్రామీణులను ఆవరించి యున్నది. వారిని మఱచి పోవుట ఇండియాను మఱచి పోవుటయే. ఇండియా స్వరూపము నగరములలో గోచరింపదు. లక్షలకొలది గల గ్రామములలో గోచరించును.

*నవీన విద్యలోని ప్రధాన సూత్రములు ఇవిగో :*

1. నిజమయిన విద్య స్వయంపోషకముగా నుండవలెను. అనగా శిక్షాకాలము పూర్తియగునప్పటికి విద్యార్థులకయిన ఖర్చులు కూడివచ్చును. పెట్టుబడి మాత్రము అట్లే నిలిచియుండును.

2. చేతిపనులలో కట్టకడవఱకు హస్త నైపుణ్యము ప్రదర్శింపబడుచునే యుండును. అనగా ప్రతిదినమును కొన్ని గంటలు బాలకుని చేతులు ఏదో పరిశ్రమయందు నిపుణతతో పనిచేయుచునే యుండును.

3. చదువంతయు ప్రాంతీయ భాషలోనే బోధింపబడవలయును.

4. ఇందు పాక్షికమగు మతవిద్యకు చోటులేదు. ఉత్తమనీతి నియమములు సార్వకాలిక, సార్వదేశికములగు నట్టివి తప్పక బోధింపవచ్చును.

5. పిల్లలు, పెద్దవారు, స్త్రీలు, పురుషులు అందఱకు ఈ విద్యను చెప్పించిన యెడల ఇది గృహకార్యములందు కలిసిమెలసి పోయి ఎంతో ఉపకరింపగలదు.

6. కోట్లకొలది విద్యార్థులు ఈ విద్యను నేర్చుకొని తాము భారతీయులమని ఉప్పొంగుచుందురు గనుక వారు అంతఃప్రాంతీయ భాషను నేర్వవలెను. అట్టి భాష హిందుస్తానీయే. దీనిని ఉర్దూ లిపిలో గాని, నాగరి లిపిలోగాని వ్రాయవచ్చును. కనుక విద్యార్థులు రెండు లిపులను గట్టిగా నేర్చుకొనవలెను.

(హరిజన్ 2-11-47)

---

# నాలుగవ భాగము

# ఉపాధ్యాయులు

## 22 ఒక విజ్ఞప్తి

నేను సూచించు ప్రారంభ విద్యాపద్ధతిని సుమారుగా అంగీకరించునట్టి ఉపాధ్యాయులు పెక్కండ్రు గలరని నే నెఱుగుదును. వారిలో కొందఱు వృత్తులద్వారా విద్యాబోధన చేయుచు ప్రయోగ సాధన చేయుచున్నారని కూడ నే నెఱుగుదును. మఱికొందఱు ఈ విద్యా పద్ధతిని ప్రేమించువా రున్నారు. అయితే వారికి వశముకాని స్థితిగతుల ననుసరించి విద్యారంగములో ప్రవేశించుట కవకాశములు లేక ఎడముగా తిరుగుచున్నారు. ఇప్పుడు కాంగ్రెసు మంత్రులు నా ప్లానును ఆమోదించుచున్నట్లు కనిపించుచున్నారు గనుక నేను సూచించు విద్యాపద్ధతి ప్రకారము పనిచేయగోరు ఉపాధ్యాయుల పేర్లు నాకు కావలసి యున్నవి. కనుక అట్టివారు తమ పేర్లు, యోగ్యతలు, కావలసిన జీతములు, ఇంకను ఇతర విషయములు వ్రాసి నాకు పంపగలరా ?

(హరిజన్ 25-9-37)

# 23 ప్రారంభికవిద్య - ఉపాధ్యాయులు కాగోరు దరఖాస్తుదారులకు

నేను ప్రతివారము ఈ పత్రికలో ప్రారంభ విద్యాపద్ధతిని గుఱించి వ్రాయుచునే యున్నాను. ఆ వ్యాసములుచూచి కొందఱు ఉపాధ్యాయులు నా ప్లానును ఆమోదించి నా విజ్ఞప్తి ప్రకారము ప్రతిరోజు నాకు ఉత్తరములు వ్రాయుచునే యున్నారు. అందుకు చాల సంతోషము. వారు ఆ ప్రకారము పనిచేయుటకు సిద్ధముగా నున్నారు. వారి ఉత్తరములనుబట్టి చూడగా వారు నా విజ్ఞప్తిలోని అంతరార్థమును గ్రహించినట్లులేరు. లాభదాయకమగు వృత్తిద్వారా ప్రారంభ విద్యాబోధ జరుగవలెనను ప్రధాన సూత్రమందు వారికి పూర్తి నమ్మకములేని యెడలను, ఈ విద్యాపద్ధతియందు పూర్తిప్రేమ వారికి లేనియెడలను, కేవలము జీవన నిర్వహణమునకు మాత్రమే జీతములు పుచ్చుకొనుటకు అంగీకరింపని యెడలను వారు నాకక్కఱ లేదు. అటువంటివారిని, ముందుగా వడకు పరిశ్రమలోని వడుకు, దాని తరువాతచేయు పనులన్నిటిని ఞుణ్ణముగా నేర్చుకొనవలెనని కోరుచున్నాను. ఈ లోపల వారి పేరులన్నిటిని రిజిష్టరుచేయుచున్నాను. నా ప్లాను పరిపక్వదశలోనికి వచ్చినపిమ్మట వారికి నేను ఉత్తరములు వ్రాయగలను. ప్రాంతీయ ప్రభుత్వములవారు నా ప్లానును అంగీకరించి ప్రయోగరూపముగా అమలు జరుపవలెనను సంకల్పము గలిగి యున్న యెడల వారికి ఈ సామగ్రిని అందజేయుటకే ఆ విజ్ఞప్తిని ప్రకటించి యున్నాను.

(హరిజన్ 9-10-37)

## 24 నవీన విద్యాప్రణాళికలోని ఉపాధ్యాయులకు

మీ ప్రతిజ్ఞను (Pledge) చూడగా నాకు చాల ఆశ్చర్యము కలిగినది. 5 వేల దరఖాస్తులు వచ్చియున్నవనగా అవి దేశభక్తి పూరితములని, ప్రేరితములని అనుకొనను. అట్లయిన-నో బాగుండెడిది. విద్యావంతులలోను, అర్ధ విద్యావంతులలోను అలముకొనియున్న నిరుద్యోగమువల్లనే అన్ని దరఖాస్తులు వచ్చియున్నవి. గవర్నమెంటు ఉద్యోగములకుగల వ్యామోహము అందుకు ఒక ప్రమాణము. కొంత మంది కనిస్టేబిలు ఉద్యోగముకొఱకు, టీచరు ఉద్యోగముకొఱకు దరఖాస్తులు పెట్టుకొందురు. కారణమేమో తెలియునా ? తమకు వచ్చు జీతముతోపాటు చాటుమాటు సంపాదనకూడ చేయవచ్చునని వారి తలంపు. మీలో ఎవ్వరును అట్టి తలంపు కలిగియుండరనియే భావించెదను. నేను గొప్ప దేశభక్తునిక్రిందనే లెక్కగదా. అట్లయ్యును నెలకు రు. 15 స్కూలు మాస్టరీ ఉద్యోగములో బంధింపబడి యుండుట కంగీకరింతునని నేననుకోను. మీ విద్యాలయములలో లాభములు రాగలవనిన్ని, వానిని పంచుకొనవచ్చుననిన్ని మీరు భ్రమపడకుడు. మీలో ఎవరయినను మీరు వ్రాసియిచ్చిన బాండును గుఱించి దుఃఖపడే యెడల మిమ్ము విడుదల చేయవలసినదిగా ఆ మంత్రిని కోరండి. నేను మీ పక్షములో వాదించెదను. ఇంతవఱకు చెప్పినమీదట మీరు మీ కంట్రాక్టుకు బద్ధులై యున్నందుకు మిమ్ము అభినందించెదను. మీరు చేసిన ప్రతిజ్ఞప్రకారము నడచుకొనుటకు ఈశ్వరుడు మీకు శక్తిని ప్రసాదించుగాక !

కాంగ్రెసు ప్రణాళికను దృష్టిలో నుంచుకొనియే ఈ విద్యా ప్రణాళిక వ్రాయబడినదని మీకు తెలియును. అహింసా సత్యమార్గముల ద్వారా స్వరాజ్యము సంపాదించుటకు కాంగ్రెసు ప్రమాణము చేసి యున్నది. కనుక ఈ ప్రధాన సూత్రములను అలవఱచుకొనుట ఈ విద్యా ప్రణాళికకు కుదురు లేక మూలాధారము. మీరు నిత్యము విద్యార్థులతో వ్యవహరించునప్పుడు ఈ లక్షణములు చూపజాలని యెడల మీకును నష్టమే, మీ విద్యాలయమునకును నష్టమే. జర్మనీలో హిట్లరు ఏమి చేయుచున్నాడో మీ రెఱుగుదురు. అతని ప్రధాన సూత్రము హింస. దీనిలో దాపఱిక మేమియు లేదు. ఆ క్రిందటిరోజున ఖడ్గమే వారి ఆత్మయని కూడ చెప్పబడినది. అందువలన అక్కడ గల బాలబాలికలకు హింసయే ఉగ్గుపాలనుండియు నేర్పుచుండెదరు. గణితములో కూడ శత్రువును ద్వేషింపవలెనని బోధచేయుచుందురు. మిలిటరీ భావములను తలలో ఎక్కించుటకే ఉదాహరణలు సయితము చెప్పుచుందురు. మనము కూడ వారి సిద్ధాంతమునే అంగీకరించిన యెడల మనము కూడ మన బిడ్డలకు బాల్యము నుండియు హింసా పాఠములు బోధింపవలసియుందుము. ఇటలీలో జరుగుచున్న పని కూడ ఇంతే. వారు తాము నమ్మినదానిని అంతశ్శుద్ధిగా చేయుచున్నట్లు మనము నమ్మినదానిని మనము అంతశ్శుద్ధిగా చేయవలెను. ఇండియా అంతట ఈ ప్రణాళికలోని సర్వాంశములను లెస్సగా ఆచరించిన యెడల శాంతియుతమయిన క్రాంతి వచ్చితీరును. అంతేగాక స్వరాజ్యము ప్రాప్తించితీరును. దీనిలో లవలేశము కూడ నాకు సంశయములేదు.

(హరిజన్, 30-4-38)

## 25 అహింస మూలాధారము

జాతీయ విద్యాసమితి (నేషనల్ ఎడ్యుకేషను బోర్డు) మొన్ననే స్థాపింపబడినది. ఆ సమితి మీటింగులో గాంధీజీ నవీన విద్యలోని మూల తత్త్వమును, అర్థమును విడమర్చి బోధించియున్నారు. ఇప్పు డెందు వల్లనో వారికి కొంత నిరుత్సాహము కలిగినది. ఆ సంగతి వారి ప్రసంగములో కనబడుచునే యున్నది. సభాంతమున వా రిట్లు చెప్పి యున్నారు: "నవీన విద్యా ప్రణాళికను ప్రవేశపెట్టినప్పుడు నాకు కొండంత ఆత్మవిశ్వాస ముండెడిది. ఇప్పు డట్లు కాదు. నా మాటలు శక్తిమంతములుగా నుండెడివి కాని యిప్పు డట్లు కాదు. ఎక్కడో జరిగిన విషయములను గుఱించి నాలో ఈ మార్పు రాలేదు. అంత రంగమున జరిగిన విషయముల వల్లనే ఈ మార్పు వచ్చినది. నా అంత శ్శక్తులు క్షీణించిపోయినవని చెప్పను. నా వయస్సుకు తగినట్లు నా బుద్ధి చక్కగా పనిచేయుచున్నది. నాకు అహింసయందు నమ్మకము పోయియుండలేదు. పూర్వము కంటె అది ఎన్నో రెట్లు దేదీప్యమాన ముగా వెలుగొందుచున్నది. ఈ క్షణమున మాత్రము నాలో ఆత్మ విశ్వాసము తగ్గిపోయినది. కాబట్టి నేను చేసిన బోధను కన్నులు మూసికొని అవలంబింపవలదని చెప్పుచున్నాను. మీకు మనస్సులో అరూఢముగా నమ్మకము కుదిరిననే నేను చెప్పినది ఆచరించండి. నిర్దుష్టమైన పద్ధతుల ప్రకారము మనము రెండు విద్యాలయములు నడపగలిగినను నాకు గలిగెడి ఆనందమునకు మేరఉండదు.

మనము స్థాపించు ట్రెయినింగు విద్యాలయము స్వరాజ్యము సంపాదించుట కుపయోగపడునట్లును, మనకు గల రోగములన్నిటని ముఖ్యముగా మత కక్షలను నివారింపగలుగునట్లును ఉండవలెను.

అందుకు గాను మనము అహింసను గురించి నూఱు కన్నులు పెట్టు కొనియుండవలెను. హిట్లరు, ముసోలినీ స్థాపించిన పాఠశాలలు హింసా బోధకములు. హింసయే వారి ప్రధాన సూత్రము. కాంగ్రెసు మతము ననుసరించి అహింసయే మన ప్రధాన సూత్రము. కనుక మనకు గల చిక్కు సమస్యల నన్నిటిని అహింసాధర్మము ద్వారానే పరిష్కరించుకొనవలెను. మన గణితము, విజ్ఞానశాస్త్రము, చరిత్ర ఇవన్నియు అహింసా ధర్మసూత్రము నాధారముచేసికొనియే బోధింప బడును. ఈ మధ్య జామియామిలియా విద్యాలయములో శ్రీమతి హాలిదీ ఈడిబ్ హనూమ్ అను విద్యావంతురాలు టర్కీని గురించి ఉపన్యసించినప్పుడు నే నిట్లంటిని : ఇంతవఱకును సామాన్యముగా రాజుల చరిత్రలు, యుద్ధప్రసంగములు చరిత్రలో వచ్చుచున్నవి. ఇంతటినుండి మానవుని చరిత్రయే భావిచరిత్రలో ఉండగలదు, అని. అదియే అహింసామార్గము. ఆ మార్గమువల్లనే మానవుని చరిత్ర నిర్మింపబడగలదు. కనుక మనము నగర పరిశ్రమలను గురించి శ్రద్ధ చేయకుండ గ్రామీణ పరిశ్రమలపైననే మనదృష్టిని కేంద్రీకృతము చేయవలయును. ఈ దేశములోని 7 లక్షల గ్రామములు ధనధాన్య సమృద్ధి గలిగి కలకలలాడుచు ఉండవలెనన్న, ఏ కొన్నిగ్రామములో చాలవు. గ్రామములన్నిటిలోను గ్రామీణ గృహపరిశ్రమలను పునరుద్ధ రింపవలెను. మనము ఈ పరిశ్రమలద్వారా చదువు చెప్పగలిగితిమా, చల్లగా సడి చప్పుడుగాకుండ విప్లవమును తీసికొనిరాగలము. దానికి అనుగుణముగానే మన పాఠ్యగ్రంథములు కూడ తయారుచేయవలెను.

నే నిప్పుడు చెప్పుచున్న సంగతులు లెస్సగా పరిశీలించండి. మీకు నచ్చినవి పరిగ్రహించి, నచ్చనివానిని విడిచిపెట్టండి. నేను బోధించు సంగతులు ముసల్మానులకు గిట్టనియెడల, వారు సాంతము విడిచిపెట్టవచ్చును. నాకు కావలసిన అహింస, బ్రిటిషువారితో పోరాటమున కక్కఱకు వచ్చునంతవఱకే పరిమితముకాదు. మనకు

గల ఆంతరంగిక వ్యవహారములకు, చిక్కు సమస్యలకు ఆ ధర్మము ఉపయోగపడవలెను. నిజమయిన అహింస ఏర్పడవలెను. ఆ ధర్మము నుండియే హిందూ ముసల్మాను సఖ్యత యేర్పడును. ఆ సఖ్యత, హిట్లరు, ముసోలినీలు చేసుకొన్నట్లువలె పరస్పరభయం ననుసరించి చేసికొన్నట్లు ఉండరాదు.

(హరిజన్ 7-5-38)

## 26 నవీనవిద్య - ఉపాధ్యాయులు

నవీన విద్యాప్రణాళికయందు నమ్మకము కుదురుటవల్లను, రైతులకు విద్యాబోధ చేయుటకును, "ప్రొఫెసరు తావు" తాను యూనివర్సిటీపనిని చాలించుకొన్నట్లు చెప్పియున్నాడు. ప్రణాళికలోని ప్రధానసూత్ర మేమనియడుగగా అందుకు గాంధీజీ- గ్రామ పరిశ్రమ ప్రధానాంశము- దానిద్వారా విద్యాబోధ జరుగవలెను. అప్పుడు బాలుని మానసిక, శారీరిక, ఆత్మిక శక్తులకు వికాసము కలుగును అని చెప్పెను. అయితే అందుకు తగిన ఉపాధ్యాయులు దొరకరే, దానికి మీరేమందురని ప్రొఫెసరు తావు మరల గాంధీజీ నడుగగా గాంధీజీ నవ్వి 'అవును, మాకును అదే చిక్కు వచ్చినది' అనిరి. అంతట ప్రొఫెసరు తావు, 'అటువంటి స్థితిలో ఉపాధ్యాయులు చేతివృత్తి నేర్చుకొనునట్లుగాను లేదా గృహపారిశ్రామికులు విద్యాబోధ చేయు నట్లుగాను మీరు శిక్షణ యివ్వరాదా' అనగా అందుకు గాంధీజీ, 'సామాన్యముగా ప్రతి విద్యావంతుడును తాను సులభముగా చేతి వృత్తిని నేర్చుకొనగలడు. మన చేతి పారిశ్రామికులు విద్యాబోధ చేయవలెనన్న, విద్యావంతులకంటె ఎక్కువకాలము పట్టును. 'మీ రున్నారనుకొనుడు. వడ్రంగము నేర్చుకొనుట మీకు సులభమేగదా' అనిరి.

*ప్రొఫెసరు తావు :* మన విద్యావంతులకు గొప్ప ఉద్యోగములు, గొప్ప జీతములు కావలెనే. వారీపనియందు ఎట్లు ప్రవేశింపగలరు ? ఎట్లు శ్రద్ధచేయగలరు ?

*గాంధీజీ :* ఈ ప్రణాళికలో జీవము ఉన్నయెడల, అది విద్యా వంతులను ఆకర్షింపగలదు. అప్పుడు వారు ధనమోహములో చిక్కు

కొనరు. ఈ ప్రణాళికవల్ల విద్యావంతునిలో దేశప్రేమ ఉద్భూతము కానియెడల ఆ ప్రణాళిక పనికిరాకయేపోవును. అయితే మాకొక సదుపాయమున్నది. దేశ భాషలలో విద్యనేర్చుకొన్నవారు కళాశాలలకు పనికిరారు. అట్టివారికి ఈ ప్రణాళిక ఆకర్షవంతముగా నుండగలదు.

(హరిజన్ 27-8-38)

•

## అయిదవ భాగము

# విమర్శ - విపులీకరణ

## 27 సమర్థన

*ప్రొఫెసరు పుంతంబేకరు లేఖ :*

చిన్న పిల్లలకు శాస్త్రయుక్తముగాను సంస్కృతికి అనుగుణముగాను చేతివృత్తిని నేర్పవలెననియు శిక్షణకాలము మొదటినుండియు వారు సంపాదనపరులయి యుండవలెననియు తమరు సూచించి యున్నారు. అందుకు నేను పూర్తిగా ఏకీభవించుచున్నాను. అది నిస్సందేహముగా విప్లవాత్మకమగు సూచన. అయినను నేను నా పూర్తి ఆమోదమును తెలుపుచున్నాను. ఆ శిక్షణవల్ల వ్యక్తికిని, దేశమునకును నైతికముగాను, సాంస్కృతికముగాను, ఆర్థికముగాను గలుగు శక్తి అపారము. దానివలన వృత్తిగౌరవము పెరుగుటయేగాక విద్యార్థికి ఆత్మవిశ్వాసము, ఉత్పాదనశక్తులు వృద్ధికాగలవు. విద్యార్థికి మానసిక, శారీరిక, నైతిక, పారిశ్రామిక వికాసములు కలుగుటయే మన లక్ష్యమయి యుండవలెను. ఉత్పత్తి వస్తువులోని వివిధ రంగముల పనులు విద్యార్థికి తెలియుటయేగాక పరిశ్రమ లన్నిటిలోని చిన్నచిన్న పనిముట్లను ఉపయోగించుటకూడ తెలియగలదు. చిన్నపిల్లలకు విద్యాబోధ, పారిశ్రామికవిద్య జంటగా జరుగవలెననుటయే మనఆశయము. బుద్ధివికాసపు చదువునకును, చేతివృత్తికిని భేదము ఉండరాదు.

ప్రారంభవిద్యలో మన మీ దిగువ యంశములు చేర్పవలెను : 1. మాతృభాష 2. గణితము 3. నేచరల్ సైన్సు 4. సోషల్ సైన్సు

5. జాగ్రఫీ, హిస్టరీ 6. చేతివృత్తులు 7. దేహపరిశ్రమ 8. కళ, సంగీతము 9. హిందుస్తానీ.

అయితే పిల్లలకు ఏ వయస్సులో శిక్షణ ఆరంభింపవలె ననునదే ఆలోచింపవలెను. అయిదాఱు సంవత్సరముల వయస్సులో విద్యాబోధ మొదలుపెట్టినయెడల చేతివృత్తి అబ్బగలదా ? విద్యాబోధకు ఎంత వ్యయము కాగలదు. అక్షరాస్యతను వ్యాప్తిచేయుటకంటె సులభముగాను, తక్కువ వ్యయముతోను కాదే. 8 లేక 10 ఏండ్ల వయస్సులో చేతివృత్తిని నేర్పుట నా కిష్టము. ఆ వయస్సులో పనిముట్లను స్థిరముగా పట్టుకొనుట బాలకులు నేర్చుకొందురు. వారికి చెప్పినదికూడ బోధపడగలదు. ప్రారంభవిద్యను కనీసము 5, 6 సంవత్సరముల వయస్సులోనే మొదలుపెట్టవలెను. అంతకంటె ఆలస్యము చేయరాదు. చిన్నబిడ్డకు మెట్రిక్యులేషనుస్థాయివచ్చువఱకు మామూలు చదువు, చేతివృత్తి రావలెనన్న పది సంవత్సరములయినను కావలెను. ఇంకొక్కమాట. ఈ చిన్నబిడ్డలు ఏవో వస్తువులను తయారుచేయుచుందురుగదా. ఇవి ఎంతవఱకు అక్కఱకువచ్చును అన్నది మరియొక సందేహము. అందులోను మఱీ పసిపిల్లలుగా నున్నప్పుడు తయారుచేయు వస్తువులకు ముక్కు, మొగము ఉండునా ? ఆ వస్తువులు మన్నికకు పనికిరావు. చేత అందముగా ఉండదు. పైగా స్వేచ్ఛావాణిజ్యము జరుగుచున్న రోజులివి. అదిగాక ఫ్యాషనులు నిత్యము పెరిగిపోవుచున్నవి. ఇట్టిస్థితిలో చిన్నబిడ్డల తయారీవస్తువులు చలామణి యెట్లు కాగలవు ? ఒకవేళ ప్రభుత్వమువారే తాము ఇవ్వబోయే గ్రాంటులక్రిందనో, చేయబోవు సహాయముక్రిందనో ఆ సరకులను తీసికొన్నారనుకొందము. వారుమాత్రము వానితో ఏమిచేయగలరు ? ప్రభుత్వమువారు ఈ విధముగా ముక్కు మొగము లేని వస్తువులను కొని ధనమును వృథాచేయుటకంటె బాలకుల విద్యకొఱకై కొంత సొమ్మును కేటాయించి గ్రాంటుల నిచ్చుటయే మంచిది కాదా.

అయితే 12, 16 సంవత్సరముల ప్రాయముగల విద్యార్థులు తయారు చేయు వస్తువులు అమ్ముటకు, కొనుటకు పనికిరాగలవు. వానివల్ల కొంత ఆదాయముకూడ రాగలదు.

అక్షరాస్యతను వ్యాప్తిచేయు ప్రశ్న వేఱు. అందుకు కావలసిన ధనమును పన్నుల ద్వారా రాబట్టవలెనని, ఆ సొమ్మును అందుకు వ్యయము చేయవలెనని ధైర్యముతో పోరాడగలను. పిల్లలు కొంచెము పెద్దవారయి, ప్రారంభ విద్యలోగాని, మధ్యమ విద్యలోగాని చదువుచుండగా వారికి చేతివృత్తులు బాగుగా పట్టుబడును. ప్రారంభములో అవి కొంతవఱకు మాత్రమే స్వయంపోషకముగా నుండవలెను. అనుభవములు గడించినవెనుక, వస్తువుల ఉపయోగములనుబట్టి అవి పూర్తిగా స్వయంపోషకములుగా నుండగలవు. అయితే ఒక్క ప్రమాదము జరుగకుండమాత్రము మనము తట్టుకొనవలెను. విద్యాలయమువారు లాభములకుగాను విద్యార్థి మానసిక, నైతిక, శారీరిక, ఆత్మిక వికాసములను చిన్నచూపుతో చూడరాదు.

మీరు ప్రారంభ విద్యను, ఇంగ్లీషులేని మెట్రిక్యులేషన్‌తో సమము కావలెనని సూచించుచున్నారు. దానికి నేనును అంగీకరించుచున్నాను. అయితే దానికి హిందూస్తానీనికూడ చేర్చవలెనని నా సలహా. ప్రారంభ విద్యలో మీరు మధ్యమ విద్యనుగూడ జతపఱచినారన్నమాట. పాఠశాల విద్య యావత్తు పదేండ్లలో చెప్పవలెనని మీ సంకల్పము. ఆ విద్యను మాతృభాషలోనే బోధింపవలెను. మఱి యే యితర భాషద్వారాను బోధన జరుగరాదు. ఈ విధముగా చేసిన యెడల విద్యార్థి మనస్సు చక్కగా విప్పారి అనేక జీవితాంశములు తెలిసికొనుటకు, జ్ఞానాభివృద్ధి గలుగుటకు ఉత్పాదనశక్తిని పెంపుచేసికొనుటకు అవకాశము లేర్పడును. మధ్యయుగములో మన విద్యా పద్ధతి చాలవఱకు స్వయంపోషకముగా నుండెడిది. ఆ కాలములో

వర్ణవిధానము, వర్ణ ఆర్థికవ్యవస్థ, సామాజిక శ్రేయస్సు ఉండెడివి. ఇప్పుడుకూడ ఆ విధముగానే మన రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థలు రూపొందించుకొనిన యెడల స్వయంపోషకవిద్య ఇప్పుడును మొత్తముమీద సాధ్యమే. అయితే ఇప్పుడు మన మధ్యయుగము వ్యవస్థలవఅకును పోజాలము. ప్రజాతంత్ర యుగములోను, జాతీయ యుగములోను, సామాజిక వాద లక్ష్యయుగములోను జీవించుచున్నాము. జాతికి అభ్యుదయ పరంపరలు గలిగించు నట్టియు, అధికారము లన్నిటిని చేతబట్టుకొన్నట్టియు, శక్తిసంపన్న మయినట్టియు సంస్థ ఈనాడు ప్రభుత్వ మొక్కటియే. అందువల్లనే ఈ మహాత్కార్యమును ప్రభుత్వమే సాధింపవలెను. పూర్వకాలములో కులములకు, వర్గములకు, గిల్డులకు, కాలేజీలకు, చర్చలకు కొన్ని అధికారములు, శక్తులుండెడివి. ఈనాడు అవి యేమియును లేవు. ప్రజలకు ఆ సంస్థల యందు నమ్మకముకూడ పోయినది. ఆర్థిక, సామాజిక శక్తియంతయు పోయి రాజకీయ సంస్థయందే నిలిచియున్నది. అందువలన ఈనాడు రెండు లక్ష్యములు పనిచేయవు. పూర్వము శక్తి బహుముఖముగా నుండెడిది. ఇప్పుడు ఏకముఖముగా నున్నది. కనుక ఈ రెండిటిని జతచేసి నడపుట అలవికాని పని.

పూర్వము విద్య సర్వత్ర ఉండెడిదికాదు. ఏకముఖమైన ప్రజాతంత్ర రాజ్యముండెడిది కాదు. జాతీయ సమానతాభావము లుండెడివి కావు.

ఉపాధ్యాయులను నిర్బంధపఱచు పద్ధతి ఈనాడు వింతకాదు. ఏమయినను ఆ పద్ధతిని ప్రయత్నము చేసియే చూడవలెను. కాంగ్రెసు సంస్థయు, ప్రాంతీయ మంత్రులును దేశములో అక్షరాస్యత, సంస్కృతి, విద్యావ్యాప్తి నిమిత్తము తమకు తోడ్పడవలసినదని దేశభక్తి పూరితులగు విద్యావంతులకు విజ్ఞప్తి చేయదగుదురు. ఆ విధముగా చేసినయెడల రాజకీయార్థిక రంగములలోనే కాకుండ క్రొత్త విధానము

ననుసరించికూడ సామాన్య జనసంపర్క మేర్పడును. సామాన్య జనులలో గల నిర్మాణశక్తిని, మానసికశక్తిని ఉద్బుద్ధము చేయుటకు ఈ పద్ధతి పనికివచ్చును.

*దీనిపైన గాంధీజీ వ్యాఖ్య :*

వృత్తిద్వారా ప్రారంభవిద్యాబోధ ఉండవలెనని నేను ప్రచారము చేయుట మొదలుపెట్టి మిత్రుల నందఱను తమ తమ అభిప్రాయములు నాకందజేయవలెనని కోరియుంటిని. ప్రొఫెసరు పుంతుంబేకరు మొట్ట మొదటగా తమ అభిప్రాయములను నాకు వ్రాసి పంపియున్నారు. ఎంతో పెద్ద సమాధానమును లెస్సగా విచారించి వ్రాసియున్నారు. స్థలాభావమువల్ల దాని నింతకుమునుపే ప్రకటింపజాలక పోతిని. అవసరమయిన భాగములను పైన ప్రకటించియున్నాను. సంగ్రహ పఱచవలెనను ఉద్దేశముతో అక్షరాస్యతకు, కళాశాల విద్యకు సంబంధించిన భాగములు తీసివేసితిని. వృత్తిద్వారా స్వయంపోషక ప్రారంభ విద్యను గుఱించి ఈ నెల 22, 23 వ తేదీలలో జరుగు మహాసభలో సమగ్రముగా చర్చలు జరుగగలవు.

**(హరిజన్ 16-10-37)**

నేను ప్రతిపాదించిన ప్రారంభ విద్యాపద్ధతిని విమర్శించుచు ఒక గొప్ప విద్యాశాఖోద్యోగి పేరుమాత్రము చెప్పకుండ, ఒక మిత్రునిద్వారా తన అభిప్రాయములు నాకు తెలియబరచియున్నాడు. స్థలసంకోచమువల్ల అతని లేఖనంతయు ప్రకటింపలేను. అయితే చాల కష్టపడియున్నాడు, గనుక అవసరమైన భాగములకు సమాధాన మిచ్చెదను. అవి ఇవ్వతగినవికూడ. నేను ప్రతిపాదించిన అంశములను అతడు తన సొంతమాటలతో ఇట్లు పేర్కొనియున్నాడు—

1. ప్రాథమికవిద్య వృత్తులతోనే ప్రారంభము కావలెను. వృత్తులతోనే సమాప్తము కావలెను. సామాన్యవిద్య అంతయు ఆ వృత్తులకు సహాయకములుగానే బోధింపబడును. చరిత్ర, భూగోళము, గణితము వీనిని చదువుట, వ్రాయనునేర్పుట కట్టకడపటనే.
2. మొదటినుండియు ప్రారంభవిద్య స్వయంపోషకముగా నుండవలెను. ప్రభుత్వమువారే స్కూళ్ళలోని తయారువస్తువులను కొని, ప్రజలకు అమ్మవలెను.
3. ప్రాథమికవిద్య, ఇంగ్లీషు లేకుండ మెట్రిక్యులేషను స్థాయి నందుకొనవలెను.
4. ఉపాధ్యాయులను నిర్బంధింపవలెనను అంశమును లెస్సగా పరిశీలింపవలెను. సాధ్యమయినచో అమలు జరుపవచ్చును.

*ఇంకను ఆ ప్రొఫెసరు ఇట్లు చెప్పుచున్నాడు :*

పై కార్యక్రమమును పరిశీలించిన యెడల అందలి అంశములు కొన్ని మధ్యయుగమునకు సంబంధించినవి. మఱికొన్ని ఆచరణ

సాధ్యముకానివి అయియున్నవి. మూడవనెంబరులోని అంశము చాల పెద్దస్థాయిలోనిది అని నా అభిప్రాయము.

*దీనిపైన గాంధీజీ వ్యాఖ్య:*

ఈ ప్రొఫెసరు నా అభిప్రాయములకు తన సొంతమాటలు వాడినాడుగాని నామాటలే వాడిన బాగుండెడిది. మొదటినెంబరులో చెప్పినమాటలు నా అభిప్రాయములకు సరియయినవికావు. సత్య దూరములు కూడ. విద్య, వృత్తిలోనే ప్రారంభము కావలెనననిన్ని మిగిలిన విషయములు దానికి ఉపాంగములుగా నుండవలెనననిన్ని నేనెన్నడు చెప్పియుండలేదు. అందుకు భిన్నముగా నేను చెప్పిన అంశములివి. సామాన్యవిద్య యావత్తు వృత్తిద్వారా ఏకకాలమందే బోధింపబడవలెనననిన్ని, వృత్తిలో వికాసము కలుగుచున్నకొలది విద్యలోకూడ అభివృద్ధి కలుగవలెనననిన్ని నేను బోధించియున్నాను. ఇప్పుడు నేను చెప్పినది వేరు. ఆ ప్రొఫెసరు అర్థము చేసికొన్నది వేరు. మధ్యయుగములో ఏమి, జరిగినదో నేనెఱుగను. వృత్తులద్వారా విద్యాబోధ జరిగి పిల్లలకు సర్వతోముఖ వికాసము గలుగవలయు ననుట, మధ్యయుగములో కాదుగదా, మఱియేయుగములోకూడ అట్టియేర్పాటు ఉండియుండలేదు, అంతవఱకు నేనెఱుగుదును. ఇది స్వతఃపుట్టిన అభిప్రాయము. ఒకవేళ ఈ పద్ధతి ఫలింపకపోవచ్చును. అంతమాత్రముతో దాని అసలు అభిప్రాయమునకు భంగము కలుగ బోదు. స్వతఃపుట్టిన అభిప్రాయములను ఎదిరించుట సామాన్యమైన పనికాదు. మహాప్రయత్నమువల్లగాని అట్లుచేయుట సాధ్యపడదు. అది అసాధ్యమని ఒక్కమాటలో త్రోసిపుచ్చుటలో వాదబలము లేదు. చదువను, వ్రాయను నేర్పుట కట్టకడపట నేర్పవలెనని నేను చెప్పియుండలేదు. నిజమునకు సామాన్య శిక్షణ అంతయు మొదటినుండియు జరుగవలెనని నేను చెప్పుచుంటిని. విద్యార్థికి

సర్వవిధముల సాధనసంపత్తి సమకూర్చుటకు చదువుట, వ్రాయుట కూడ ప్రధాన భాగమే. అయితే చదువుట కొంచెము ఆలస్యముగా మొదలుపెట్టవచ్చుననిన్ని, వ్రాయుట చివర నేర్పవచ్చుననిన్ని అప్పుడు, ఇప్పుడు ఒకేమాట చెప్పుచున్నాను. ఏమయినను ఈ అంశములన్నియు మొదటి సంవత్సరములోనే పూర్తి కావలెను. కనుక నేను సూచించిన పద్ధతిప్రకారము బాలుడుగాని, బాలికగాని స్కూలులో చేరిన మొదటిసంవత్సరములో, అనగా ఏడవ సంవత్సరము ప్రాయమున, ఇప్పుడు ప్రయిమరీ పాఠశాలలో ఒక్కయేడాదిలో వచ్చు చదువుకంటె అధికముగా నేర్చియుండవలెను. వారు తప్పులులేకుండ చదువగలరు. అక్షరములు తప్పులులేకుండ వ్రాయగలరు. ఇప్పటి చదువులలో పిల్లలు ముక్కుమొగములేని అక్షరములు వ్రాయుచున్నారుగదా. నా విద్యాపద్ధతిలోని బాలబాలికలకు చిన్నచిన్న కూడికలు, తీసివేతలు ఎక్కాలు రాగలవు. వారికి వడుకు మొదలయిన చేతివృత్తికూడ వచ్చును.

ప్రొఫెసరు రెండవ నెంబరులో చెప్పిన అంశముకూడ, మొదటి దానివలెనే అపార్థముతోకూడినది. విద్యార్థుల ప్రారంభ విద్యాకాలము ఏడు సంవత్సరములని నిర్ణయించితినిగదా. ఆమొత్తము ఏడు సంవత్సరములలోను బాలకులు నేర్చుకొను వృత్తులు స్వయంపోషకములుగా నుండవలెనని మాత్రమే నేను చెప్పియుంటిని. విద్యప్రారంభమైన రెండు సంవత్సరములలోను కొంతనష్టము రాగలదని నేను అంగీకరించియే యుంటిని.

మధ్యయుగమునాటి విషయములు కొన్ని చెడ్డవి ఉండవచ్చును. మధ్యయుగమునాటి వయినంతమాత్రమున వానిని ఖండింపరాదు. చేతి రాటము నిస్సందేహముగా మధ్యయుగమునాటిదే. అయినను నేడు దానికి స్థానమున్నదని తోచుచున్నదిగదా. ఈ చేతి రాటము ఈనాడు స్వాతంత్ర్యమునకును, ఐకమత్యమునకును చిహ్నముగా

అంగీకరింపబడుచున్నది. అయితే ఈచేతి రాటమే ఈస్టిండియా కంపెనీ వారు ఈ దేశమునకు వచ్చినప్పుడు మన బానిసత్వమునకు గుర్తుగా నుండెడిది. వస్తువు ఒకటే సుమండీ. మన తాతముత్తాతలు ఎన్నడు గుర్తింపని, ఊహింపని, విశేషార్థమును మనమీనాడు చేతిరాటములో చూడగలుగుచున్నాము. ఆవిధముగానే, చేతివృత్తులన్నియు, మిల్లు పరిశ్రమలకు గుర్తులుగా నుండవచ్చునుగాక. ఇప్పుడో అట్లుకాదు. ఈనాడు ఆ చేతివృత్తులు పూర్ణవిద్యా వికాసమునకు ప్రధానాంగములుగా నుండియున్నవి. గొప్పగొప్ప విద్యాశాఖోద్యోగులందఱు నేను సూచించిన పద్ధతిని నాలుగువంకల విమర్శించుచున్నారు. మంచి ఉద్దేశముతోనే అనుకొనండి. కొందఱి విమర్శలు, ఊహాజనితమయిన వాదనల నాధారము చేసికొన్నవి. ఏమయినను, మంత్రులు దూరదృష్టియు ధైర్యమును గలిగియున్నయెడల పైవిమర్శలను లెక్కచేయకుండ నేను సూచించిన పద్ధతిని ప్రయోగమాత్రముగా ప్రారంభింపవచ్చును.

ప్రొఫెసరు కె. టి. షా సూచించిన ఉపాధ్యాయ నిర్బంధ పద్ధతిని పైనచెప్పిన లేఖకుడు అంగీకరించినప్పటికిని, తరువాత పొరపాటని నాలుక కఱచుకున్నాడు. కనుకనే ఏమనుచున్నాడో చూడుడు.

"ఉపాధ్యాయులుగా చేరి పాఠములు చెప్పవలసిన దనుట నామట్టుకు చాల ఘోరమనిపించుచున్నది. మన పాఠశాలలో చిన్నబిడ్డలు చేరుచున్నందువల్ల ఇష్టపూర్వకముగా తమ జీవితములను ఉపాధ్యాయ వృత్తికి అంకితముచేసికొన్న స్త్రీలు,పురుషులు అధ్యాపకులుగా నుండి పాఠములు చెప్పుట మంచిది. అప్పుడే సంతోషము, ఉత్సాహము, పట్టుదల కలుగగలవు. మన యువతీ యువకుల విషయమయి ఎన్నో ప్రయోగములు (Experiments) చేసి యున్నాము. ఈ ఉపాధ్యాయ నిర్బంధ ప్రయోగము కూడ చేసితిమా, పరిణామము సర్వ

నాశనమే కాని అన్యము కాదు. మరల 50 సంవత్సరముల వఱకు ఆ నష్టము కూడిరాదు. ఉపాధ్యాయ వృత్తికి శిక్షణ అవసరము లేదనియును, ప్రతి ఒక్కరును పుట్టుకతోనే ఉపాధ్యాయులుగా పనికి వత్తురనియు భావించుటవల్లనే ఇన్ని అనర్థములు కలుగుచున్నవి. కె. టి. షా వంటి మహా పండితుడు ఈ పద్ధతిని ఎట్లు ఆమోదించెనో అర్థమగుట లేదు. ఉపాధ్యాయులను నిర్బంధము చేయవలె ననెడి ఆలోచన దుష్టమయినది. దానివలన ఎన్నో నష్టములు కలుగగలవు. అదిగాక చేతివృత్తులను ప్రతి ఒక్కరు ఎట్లు బోధింపగలరు ?"

*గాంధీజీ వ్యాఖ్య :*

ప్రొఫెసరు షా తాము ప్రతిపాదించిన నిర్బంధ పద్ధతిని బాగుగా సమర్థించుకొని యున్నారు. ఇప్పుడు పనిచేయుచున్న టీచర్లు వాలంటీర్లు కారని నేనీ లేఖకునకు జ్ఞాపకము చేయుచున్నాను. వారు అన్నము, బట్ట కొఱకు వచ్చిన అరువు మనుష్యులు. ప్రొఫెసరు షా సూచించిన పద్ధతి ప్రకారము, యువజనులలో దేశభక్తి, త్యాగనిరతి, విజ్ఞానము, చేతివృత్తియందు నిపుణత ఉండవలెను. అట్టివారినే ఉపాధ్యాయులుగా స్వీకరింతురు. షా సూచించిన పద్ధతి అర్థవంత మయినది. ఆచరణ యోగ్యమయినది. కనుక తప్పక పరిశీలింప దగినది. పుట్టుకతోనే ఉపాధ్యాయలక్షణములు గలవారు మనకు కావలెనన్న, ఇప్పుడున్న సృష్టిపోయి, మరల సృష్టి కలుగువఱకు ఆగవలసివచ్చును. ఉపాధ్యాయులకు వీలయినంత తక్కువ కాలములో శిక్షణ ఇప్పించి వారిని తరిఫీదు చేయవలెననియే నా మనవి. అందుకుగాను ఇప్పుడున్న యువతీ యువజనులకు ఇందలి పరమార్థమును చల్లగా నచ్చజెప్పి వారిని ఉపాధ్యాయ వృత్తిలోనికి తీసికొనుట తప్ప అన్యమార్గములేదు. వారందఱు ఇష్టపూర్వకముగా ఆమోదించినప్పుడే ఈ పద్ధతి నెరవేరగలదు. శాసనోల్లంఘన దినములలో వారు కొంతమంది అయినను

ముందునకు వచ్చియున్నారు. జీవనభరణమునకు మాత్రము సొమ్ము పుచ్చుకొని, యీ నిర్మాణాత్మక కార్యక్రమమును సాధించుటకు యీనాడయినను వా రంగీకరింపరా ?

*పై లేఖకుడింకను ఇట్లు ప్రశ్నించుచున్నాడు :*

1. చిన్నపిల్లలు ముడిపదార్థములతో వృత్తులు నేర్చుకొనుచున్నప్పుడు కొంత రద్దు (waste) పోక తప్పదుగదా. దీని కేమందురు?
2. కేంద్రసంస్థ ఒకటి, ఆ బిడ్డలు తయారు చేసిన వస్తువులను అమ్మకము చేయవలెనుగదా, ఆ ఖర్చులు ఎవరు భరించెదరు ?
3. ఈ వస్తువులు తప్పక కొనవలెనని ప్రజలను నిర్బంధపఱచెదరా ?
4. కొన్ని కులములవారు ఆ వస్తువుల నిప్పుడు తయారు చేయుచున్నారు గదా. వారిని గుఱించి ఏ మాలోచించినారు ? ఆ పారిశ్రామికుల కీ పని యెట్లు తోచును ?

*గాంధీజీ వ్యాఖ్య :*

పై వానికి నా సమాధానము లివి.

1. రద్దు ఉండగలదని నేనును అంగీకరించుచున్నాను. ఏమయినను సరే మొదటి సంవత్సరము తిరుగకమునుపే, ప్రతి పిల్లవాని చేతివృత్తి వల్లను కొంత అయినను లాభము రాగలదు.
2. ప్రభుత్వమువారే తమ స్వంత ఉపయోగము నిమిత్తము ఆ సరకులను తీసికొనగలరు.
3. ఎవరిని ఎవరును దేశములోని బిడ్డల తయారీ వస్తువులను కొనవలెనని బలవంతము చేయరు. కాని దేశప్రేమ గలవారు తమ బిడ్డలు తయారు చేయు వస్తువులను సగర్వముగాను, సంతోషముతోను కొనగలరని ఆశింపవచ్చును.

4. గ్రామపరిశ్రమలలో పోటీ అన్న ప్రశ్నయే లేదు. అయినను గృహ పరిశ్రమల విషయమయి అనవసరమయిన పోటీ రాకుండనే చూడగలరు. ఖాదీ, చేతికాగితము, తాటిబెల్లము ఈ మొదలగు పరిశ్రమలకు పోటీలేదు.

(హరిజన్ 16-10-37)

---

•

# 29 ఒక అమెరికను మిత్రుని భావములు

డాక్టర్ జాను డీ బోయర్ అను మహనీయుడు దక్షిణ భారతములో ఏదో విద్యాసంస్థ నడపుచు దీర్ఘకాలపు సెలవుమీద స్వదేశమునకు వెళ్ళబోయేముందు వర్ధావచ్చియున్నాడు. అతడు నవీన విద్యాపద్ధతిని బాగుగా పరిశీలించి, అర్థము చేసికొని శ్రీ ఆర్యనాయకముతోను, శ్రీ కాకా కాలేల్కరుతోను చర్చించియున్నాడు. గాంధీజీతో కూడ కొన్ని నిమిషములయినను మాట్లాడవలెనని ఆసక్తిగలిగియున్నాడు. ఈ ప్రణాళిక అహింసా ధర్మముపైన ఆధారపడియున్నది గనుక నాకీ స్కీము చాల నచ్చినదని చెప్పియున్నాడు. అయితే అహింసా ధర్మమునుగుఱించి పాఠ్యక్రమములో ప్రస్తావనయే లేదు ఎందువల్ల అని అతని ఆరాటము.

*గాంధీజీ :* ఈ ప్రణాళిక మీకు నచ్చినది. అందువలన మాకు సంతోషము కలిగినది. పాఠ్యక్రమము నంతటిని అహింసపైనే నడపరాదు. అహింసాధర్మమందు నమ్మకముగలవానివల్ల అది ప్రతిపాదింపబడుటయే చాలును. ఈ విద్యాపద్ధతి నంగీకరించిన వారందరు అహింసకు కట్టుబడియుండవలెనను నియమములేదు. ఈ కమిటీలోనున్న సభ్యులందరు అహింసను సిద్ధాంతరూపముగా అంగీకరింపకపోవచ్చును. ఒక శాకాహారి ఆరోగ్యముకొఱకే శాకములారగింపవచ్చును. అతనికి అహింసయందు నమ్మకము లేకపోవచ్చును. ఆ విధముగానే నా విద్యాపద్ధతి నంగీకరించు వారందఱకు అహింసయందు నమ్మకము లేకపోవచ్చును.

*డాక్టర్ డీ బోయరు:* ఈ విద్యాపద్ధతి అహింసాధర్మముపైనాధారపడియున్నది గనుక మాకు పనికిరాదని కొంతమంది విద్యావేత్త లనుచుండుట నేనెఱుగుదును.

*గాంధీజీ :* అవును. ఆ సంగతి నాకును తెలియును. ఖాదీకూడ నేను ప్రతిపాదించిన ధర్మముపైననే ఆధారపడియున్నది గనుక మాకు గిట్టదనుచున్నవారును కొందఱుగలరు. వీని అన్నిటికి నేనెక్కడ సమాధానము చెప్పగలను? ఈ విద్యాప్రణాళికకు అహింసయే ప్రాణము. దానిని ఋజువు చేయగలనుకూడ. అట్లు చేసితినా, ప్రజలలో ఉత్సాహము ఉండదు. ఈ దేశములో కోట్లకొలది జనులకు సరియయిన అన్నములేదు. అటువంటివారి బిడ్డలకు నేను సూచించిన మార్గముతప్ప వేఱుగతి లేదని నా ప్రణాళిక నామోదించిన వారికి తెలియును. ఒక్కసారి యీ ప్రణాళిక నమలు జరిపితిరా, క్రొత్త ఆర్థికపద్ధతి అప్పుడే యేర్పడగలదు. ఇంతవఱకు జరిగిన నాకు అంతే చాలును. కాంగ్రెసువారు స్వరాజ్య సంపాదనకు గాను అహింసను సిద్ధాంతరూపముగా కాకుండ సాధనరూపముగా నంగీకరించిన చాలునని కొంటినిగదా. భారతీయులందఱు అహింసనే జీవిత సిద్ధాంతముగా నంగీకరించియున్న యెడల వెంటనే ఈపాటికి స్వరాజ్యమును పొందకయుండెడివారమా!

*డాక్టర్ జోయరు :* మంచిది. నాకు అర్థముకాని విషయము మఱియొకటి ఉన్నది. నేను సోషలిస్టును. అహింస నంగీకరించువాడను గనుక మీ విద్యాపద్ధతి నాకు మిక్కిలి నచ్చినది. కాని సోషలిస్టుగా ఆలోచించినప్పుడు, సోషసిజమువల్ల లోకములోని దేశములన్నిటిని ఒక్క త్రాటిమీదకు తీసుకొని రావలసియుండగా, మీ విద్యాపద్ధతివల్ల ఇతర దేశములకును, భారతదేశమునకును సంబంధములు తెగిపోవునని ఆలోచించుచున్నాను. దీని కేమందురు?

*గాంధీజీ :* అట్లు జరుగదు. మాకు లోకముతోడి సంబంధములు త్రెంచుకొనవలెనను అభిప్రాయములేదు. లోకములోని దేశములన్నిటితోను స్వతంత్రముగా వ్యవహారించుకొందుము. అయితే, ఇప్పుడున్న కృత్రిమ పద్ధతి పోవలెను. మమ్ములను ఇతరులు దోచుకొనరాదు.

మేము ఏ దేశమును దోచుకొనము. ఈ విద్యాపద్ధతి ప్రకారము బిడ్డల నందఱను ఉత్పత్తిదారులుగా తయారుచేయదలచితిమి. మా సామాజిక వ్యవస్థయే మారిపోగలదు. ఆ విధముగా దేశములో బ్రహ్మాండమయిన మార్పు తేదలచితిమి. ఇట్లు చేయుటవల్ల లోకము తోడి సంబంధమును త్రెంచుకొంటిమని అర్థము కాదు. కొన్ని దేశము లలో కొన్ని వస్తువులు తయారుకావు. అవి తెప్పించుకొనుటకుగాను ఇతర దేశముల మీద ఆధారపడక తప్పదు. ఆ విధముగా అంతర్జాతీయ వ్యవహారములు నడచుచుండును. అయితే ఒక్క సంగతి. ఏ దేశముల నుండి సరకులు తెప్పించుకొనుచున్నామో, ఆ దేశములవారు ఈ దేశ ములను దోచుకొని తినరాదు.

*డాక్టరు బోయరు :* మీ జీవితావసరము లన్నిటిని బొత్తిగా తగ్గించుకొన్న యెడల ఇతర దేశముల నుండి మీకు కావలసిన వస్తువులే ఉండవు. అప్పుడు మీ దేశము ఒంటరిదేశమయి పోవును. అమెరికాకు కూడ మీరు బాధ్యత వహింపవలెనని నేను కోరుచున్నాను.

*గాంధీజీ :* ఇతరులను దోచుకొనుట, ఇతరులచే దోపింపబడుట పోయినచో మేము అమెరికాకు బాధ్యత వహింపగలము. అప్పుడు అమెరికా గూడ మేము పట్టినదారినే నడవవలసివచ్చును. ఆవిధముగా ఆ దేశముతో స్వతంత్రముగా వ్యవహరించుటకు మాకెట్టి ఇబ్బందియు ఉండదు.

*డాక్టరు బోయరు :* మీరు మీ జీవితావసరములను తగ్గించు కొన్నందువల్ల పారిశ్రామికోన్నతికి (industrialisation) భంగము రాదా?

*గాంధీజీ :* మా దేశమునకు కావలసిన అవసరములన్నియు మూడుకోట్ల మంది జనులకు బదులు 30 వేల మంది జనుల వల్లనే సమకూడ గలిగినయెడల, నా కెట్టి అభ్యంతరము ఉండదు. అయితే ఆ మూడుకోట్లమంది సోమరులుగాను, నిరుద్యోగులుగాను మాత్రము

ఉండరాదు. సోషలిస్టులు పరిశ్రమలను వృద్ధిచేసి రోజునకు ఒకటి రెండు మాత్రమే పనిగంట లుండునట్లు ప్రయత్నము చేయుచుందురు. ఆ పద్ధతి నాకు గిట్టదు.

*డాక్టరు బోయరు :* వారికి విశ్రాంతి చిక్కును.

*గాంధీజీ :* పేకీ ఆడుకొనుటకా విశ్రాంతి ?

*డాక్టరు బోయరు :* అందుకొఱకు మాత్రమే కాదు. ఉత్పత్తి సాధకములగు చేతివృత్తులు మొదలయినవి కొనసాగించుటకు కూడ.

*గాంధీజీ :* ఉత్పత్తి సాధకములగు చేతివృత్తులను చేపట్టవలసిన దని నేనును కోరుచున్నాను. అయితే జనులు దినమునకు ఎనిమిది గంటల చొప్పున చేతులతో పనిచేయవలెను,

*డాక్టరు బోయరు :* సమాజములో ప్రతియింటికి ఒక మోటారు కారు, ఒక రేడియో ఉండవలెనని మీరు ఎన్నడును కోరరుగదా. అట్లుండవలెనని ప్రెసిడెంటు హూవరు కోరుచుండెడివారు. ఇంటికి రెండేసి కార్లు, రెండేసి రేడియో లుండవలెనని వారి ఆశయము.

*గాంధీజీ :* అన్ని కార్లే ఉన్నయెడల ఇంక నడచుటకు చోటే ఉండదు.

*డాక్టరు బోయరు :* నే నంగీకరింతును. ఇప్పుడు ప్రతి సంవత్సరము రోడ్డు ప్రమాదముల వల్ల 40 వేల మంది మరణించుచున్నారు. అంతకు మూడురెట్ల మంది వికలాంగులగుచున్నారు.

*గాంధీజీ :* ఇండియాలో నున్న గ్రామము లన్నిటిలోనికి రేడియోలు వచ్చువఱకు నాకు జీవించియుండవలెనను కోరిక లేదు.

*డాక్టరు బోయరు :* వస్తువులు సమృద్ధిగా ఉండవలెనని పండిత జవాహరులాలు కోరుచుండును, దానికి మీ రేమందురు ?

*గాంధీజీ :* ఆ సంగతి నాకు తెలియును. సమృద్ధి అనగా నేమి? మీవలె (అమెరికాలో) కోట్లకొలది టన్నుల గోధుమ పండించి సముద్రములో పాఱవేయుటా ?

*డాక్టరు బోయరు* : ధనిక పద్ధతివల్ల పుట్టిన అనర్థకమే అది. పూర్వమువలె ఇప్పుడు పంటను నాశనము చేయుటలేదు. గోధుమ పండింపనివారికి సొమ్మును ముట్టజెప్పుచున్నారు. కోడిగ్రుడ్ల ధర పడిపోయినందువల్ల జనులు వానిని ఒకరిమీద ఒకరు విసరికొనుచు ఆటలాడుకొనుచుందురు.

*గాంధీజీ* : అట్టిపనులు జరుగరాదనియే మా కోరిక. ప్రతి ఒక్కరికి కడుపునిండ అన్నము, ఒంటినిండ బట్ట, ఉండుటకు ఇల్లు ఉన్నయెడలను వారి మనస్సు సుశిక్షితమయి, విద్యాసంపన్నమయి యున్న యెడలను నా కదియే పదివేలు. నా కడుపులో పట్టినంత కంటె ఎక్కువ వస్తువులు కడుపులో పడవేసి అజీర్తి తెచ్చుకొనవలె ననియు అవసరములకంటె అధికవస్తువులు కలిగియుండవలెననియు, నే నెన్నడును కోరుకొనను. ఇండియాలో అట్లే దరిద్రము, సంక్షోభము, మురికి, దుమ్ము, ధూళి కూడ ఉండవలెనని కోరను.

*డాక్టరు బోయరు* : మీరు దరిద్రనారాయణా అని పూజచేయుచుందురనియు, పేదరికమొక సంపదయని కొనియాడుచుందురనియు పండిత జవాహరులాలు తమ ఆత్మకథలో వ్రాసియున్నారు.

*గాంధీజీ* : (నవ్వుచు) అవును.

(హరిజన్-12-2-38)

---

*ఒక ముసల్మాను విలేఖరి యిట్లు వ్రాయుచున్నాడు :*

కడచిన నాలుగు మాసములనుండి వర్ధా ప్రణాళికనుగుఱించి ఉర్దూపత్రికలో వార్తలు ప్రకటింపబడుచున్నవి. అలవాటు ప్రకారము ఎవరును నవీన విద్యను గుఱించిన రిపోర్టును శ్రద్ధగా చదివినట్లుగాని, ఆలోచించినట్లుగాని కనబడదు. ఆ ప్రణాళికనుగుఱించి ఈ మూడు ఆక్షేపణలు ఉర్దూ పత్రికలలో ప్రకటింపబడినవి.

(1) మత విద్య సాంతముగ విడిచిపెట్టబడినది.

(2) బాల బాలికలను కలిపి చదువు చెప్పెదరు.

(3) మతములన్నిటిని ఆదరింపవలెనని బోధించెదరు.

*గాంధీజీ వ్యాఖ్య :*

శాఖా సంప్రదాయముతోనున్న మత విద్య బుద్ధిపూర్వకముగానే విడిచిపెట్టబడినది. ప్రభుత్వమునకొక మతమున్నగాని, ప్రతిశాఖ వారికి మత విద్య అందజేయుట అన్నది కష్టమును, అసాధ్యమును అయి యున్నది. అట్టిబోధ ఇంటివద్ద చేసికొనవచ్చును. ప్రతి బాలకునకు ఇంటివద్దగాని, అన్యత్రగాని అట్టి బోధను పొందుటకు ప్రభుత్వము సదుపాయము చేయవచ్చును. ఆయా శాఖాసంస్థలవారు తమ బిడ్డలకు పాఠశాలలలోనే అట్టి బోధన జరుగవలెనని కోరునెడల ప్రయివేటు టీచర్లను పెట్టుకొని చెప్పించుకొనవచ్చును. ఆ సొమ్ము ఆ సంస్థలవారే ఇచ్చుకొనవలెను. దీనికి గవర్నమెంటును ఆమోదింపవచ్చును.

బాల బాలికల సహవిద్యను గుఱించి జకీరు హుస్సేను కమిటీవారు నిర్బంధము చేసియుండలేదు. బాలికలకు ప్రత్యేకము పాఠశాల కావలెనని కోరేపక్షములో వారికి అట్టి ఏర్పాటు చేయనే వలెను. సహవిద్యను గుఱించి ఏ నిర్ణయము చేసియుండలేదు. కాలానుగుణముగా ఆ చిక్కు తానంతనే విడిపోవును. నాకు తెలిసినంతవఱకు కమిటీలోని సభ్యులందఱు ఈవిషయమయి ఏకాభిప్రాయులయి లేరు. స్వంతముగా నాకు మాత్రము ఎటు మొగ్గినను అక్షేపణ లేదు. సహవిద్య కూడదనుట కెన్ని కారణములున్నవో, కూడుననుటకును అన్ని కారణములున్నవని వినియున్నాను. ఎక్కడనైనను అట్టి ప్రయత్నము ప్రయోగింపబడి చూచినయెడల నా కే యాక్షేపమును లేదు ఇంక మతములన్నింటిని గౌరవించుట అన్న ప్రశ్న విషయములో నాకు ఆరూఢమైన భావములున్నవి. సర్వ మతములను సమాదరించుట అనుసంగతి లేనినాడు ఈ దేశములో వివిధమతముల మధ్య సామరస్య మేర్పడుటగాని, నిజమయిన ఏకీభావన కుదురుటగాని సంభవింపదు. వివిధ మతములవారు తమ బిడ్డలకు తమ మతమే సర్వ శ్రేష్ఠమనియు, మిగిలినవన్నియు తక్కువ అనియు, తమ మతమొక్కటే అసలు నిజమయిన మతమని బోధించుచున్నంత కాలము సోదరభావములు పెరుగనే పెరుగవు. దేశములో అట్టి విభేదములకు చోటిచ్చినయెడల ప్రతి శాఖవారికిని ప్రత్యేక పాఠశాలలు పెట్టవలెను. ఎదిరిశాఖవారిని నిందించుట కవకాశ మివ్వవలెను. లేదా మత ప్రసక్తియే బొత్తిగా రాకుండ చేయవలెను. అటువంటి స్థితి ఎంత భయంకరమైనదో ఊహించుటకును వీలుకాదు. సర్వమతములకును నైతిక వర్తన కవసరమగు ప్రధాన ధర్మసూత్రములు సమానములే. వీనిని బిడ్డలకు తప్పక బోధింపవలెను. వర్ధా ప్రణాళికలోని మత (ధార్మిక) విద్య ఇదియేయని పరిగణింపవలెను.

(హరిజన్ 16-7-38)

## 31 నవీన విద్యా పరిశీలన - I

మహాసభకు వచ్చిన ప్రతినిధులు గాంధీజీని ఎన్నో ప్రశ్నలు వేసిరి. ఈ నవీన విద్యా ప్రణాళిక శాశ్వతముగా ఉండగలిగినదేనా లేదా తాత్కాలిక ప్రయోజనముకొఱకేనా, అని ఒకరడిగిరి. నేడో, రేపో ఈ చేతివృత్తులన్నియు పోయి యంత్ర పరిశ్రమలలో లీనమయి పోగలవని పెక్కండ్రు విద్యాప్రముఖులు తమ అభిప్రాయములు చెప్పియున్నారు. ఇది యంత్ర పరిశ్రమల యుగముగదా. సత్యము, అహింస, న్యాయములను ఆధారముచేసికొని నడపబడు ఈ నవీన విద్య, పై పరిశ్రమల తాకిడికి తట్టుకొనగలదా యని మరియొకరి సందేహము.

*గాంధీజీ* : ఇది ఆచరణకు పనికివచ్చు ప్రశ్న కాదు. వెంటనే అమలు జరుపనున్న ఈ కార్యక్రమమున కా ప్రశ్న సంబంధించదు. రాబోవు తరములవారికి యీ విద్యాపద్ధతి పనికి రాగలదా, లేదా యన్నది కాదు. ప్రస్తుతము మనకు కావలసినది మన గ్రామములలో నున్నవారికి ఈ నవీన విద్యా ప్రణాళిక ఉపకారము చేయగలదా లేదా ? అది మనకు ప్రస్తుతము సంబంధించినవిషయము. ఇండియాలో గ్రామములే లేనంతగా యంత్ర పరిశ్రమాభివృద్ధి ఇక్కడ జరుగునని నే ననుకొనను. ఇండియాలో చాల భాగము గ్రామములే యుండ గలవు.

*ప్రశ్న* : ఇప్పుడు జరుగనున్న ప్రెసిడెంటు ఎన్నిక పర్యవసానముగా కాంగ్రెసు విధానములో మార్పురాగల దనుకొనుడు. అప్పుడు ఈ నవీన విద్య నడక యెట్లుండును ?

*గాంధీజీ :* ఈ భయమునకు అర్థము లేదు. కాంగ్రెసు నడకలో మార్పు వచ్చినంతమాత్రాన, నవీన విద్యలో మార్పేమియు ఉండదు. ఒక వేళ మార్పు వచ్చినయెడల అది ఉన్నత రాజకీయములలోగాని, చిన్న రాజకీయములలో కాదు. మీ విద్యార్థులకు నవీన విద్యాబోధ చేయుటకుగాను అనువగునట్లుగా మూడు వారముల శిక్షణ పొందుటకు మీ రిక్కడకు వచ్చియున్నారు. ఈ నవీన విద్యా ప్రయోజనమును గుఱించి మీకు ముందుగా నమ్మకము ఉండవలెను.

యంత్ర పరిశ్రమోన్నతికి దేశములో ఎన్నో ప్లానులు వేయబడు చున్నవి. అయినప్పటికిని దేశములో యంత్ర పరిశ్రమలను విరివిగా స్థాపించుట నేటి కాంగ్రెసు లక్ష్యము కాదు. బొంబాయిలో జరిగిన కాంగ్రెసు లక్ష్యము కాదు. బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహా సభా తీర్మానము ననుసరించి గ్రామీణ పరిశ్రమలను వృద్ధిచేయుటయే కాంగ్రెసు లక్ష్యము. రైతులకు యంత్ర పరిశ్రమోన్నతి ప్రణాళికలు చూపించి వారిలో చైతన్యమును కలుగజేయలేరు. వానివల్ల వారి ఆదాయములో ఒక్కపైసా పెరుగదు. ఒక్క సంవత్సరము తిరుగక ముందే అఖిల భారత చర్ఖా సంఘమువారివల్ల, గ్రామోద్యోగ సంఘం వారివల్ల, వారికి లక్షలకొలది రూపాయల ఆదాయము కనిపించినది. కాంగ్రెసు కార్యవర్గములో గాని, మంత్రులలో గాని మార్పులు వచ్చినంతమాత్రాన నిర్మాణ కార్యములకు ప్రమాదము గలుగునన్న భయము నాకులేదు. నిర్మాణ కార్యక్రమ సంస్థలు, కాంగ్రెసువల్ల నే స్థాపింపబడినప్పటికిని అవి స్వతంత్రముగా బ్రతుకుచున్నవి. తమ ప్రతిష్ఠను అవి నిలబెట్టుకొనుచున్నవి. ఈ నవీనవిద్య కూడ పై సంస్థల లోనిదే. విద్యా మంత్రులు మారవచ్చును గాక. కాని నవీనవిద్య మారదు. కనుక నవీన విద్యయందు ఆసక్తి గలవారు కాంగ్రెసు రాజ కీయములను గుఱించి చీకాకు పడరాదు. ఈ నవీనవిద్యలో గుణము లుండెనా అది జీవించియుండగలదు. లేదా అంతర్ధానమయిపోగలదు.

మీరు ఇన్ని ప్రశ్న లడుగుచుండుట నా కిష్టములేదు. ఇవి నవీన విద్యకు ప్రత్యక్ష సంబంధము గలవి కావు. వీనివలన గలుగు ప్రయోజనమును లేదు. ఈ నవీన విద్యకు తిన్నగా సంబంధించిన ప్రశ్నలనే అడుగవలెనని మిమ్ము కోరుచున్నాను. అప్పుడు నా పండితాభిప్రాయమును మీకు అందజేయగలను.

## ప్రధాన విషయము :

"తక్లీకి సంబంధింపని ఇతర విషయములు టీచర్లు విద్యార్థులకు బోధింపరాదు. ఇదే నా ఈ ప్రణాళికలోని ప్రధాన విషయము" అని ఒకరు, గాంధీజీ మహాసభకు పోవుచుండగా వారినడిగిరి.

*దీనికి గాంధీజీ, మహాసభలో యిట్లు సమాధానము చెప్పిరి :*

ఇది నాపై నింద మోపుటయే. విద్యాబోధ అంతయు ఏదో ఒక చేతివృత్తితో జతపడియుండవలెనని నేను చెప్పినమాట నిజమే. 7 ఏండ్లు లేక 10 ఏండ్లు ప్రాయముగల విద్యార్థికి మీరు చేతివృత్తి ద్వారా విద్యాబోధ చేయుచున్నప్పుడు ప్రారంభములో ఆ వృత్తికి సంబంధించని ఇతర విషయములు బోధింపరాదు. అట్లు చేసిన యెడల ప్రతిరోజు మీకు కలుగుచున్న అనుభవముబట్టి లోగడ విడిచిపెట్టిన విషయములను చేతి వృత్తితో ముడిపెట్టుట మీకే చేతనగును. కనుక ప్రారంభములో కొన్ని విషయములు విడిచిపెట్టుచు పోవుటవల్ల మీకును, పిల్లలకును కొంత అలసట తగ్గును ఈ రోజున మనకు దారి చూపు పుస్తకములును లేవు. లేదా లోగడ జరిగిన అనుభవములును లేవు. కనుక మనము తొందరపడకుండ అడుగులు నెమ్మదిగా వేసికొనుచు పోవలెను. టీచరు తన మనస్సును నిరంతరము చురుకుగా నుంచుకొనవలెను. ఇది ప్రధానాంశము. చేతివృత్తితో ముడిపడని విషయము వచ్చినయెడల అంతమాత్రముతో విసుగుదల తెచ్చుకొని

నిరాశపడరాదు. దానిని విడిచిపెట్టి, ముడిపడిన విషయములతోనే ముందునకు సాగిపొండి. చేతివృత్తితో జతకూడని విషయములను జత చేర్చుట మఱియొక ఉపాధ్యాయునకు తోచవచ్చును. అతడు మనకు దారి చూపింపగలడు. ఈ విధముగా మనము ఎన్నో అనుభవములను పొందవచ్చును. వానిని పురస్కరించుకొని పుస్తకములును రాగలవు. ఇంక రాబోవు వారి మార్గము సులభముగా నుండగలదు.

విషయ నిరాకరణ చేసికొనుచు ఎంతకాలము మనమిట్లు సాగిపోవుట అని మీరు ప్రశ్నింపవచ్చును. జీవితాంతము వఱకు అని నా సమాధానము. ప్రారంభములో మీరు విడిచిపెట్టిన అంశములను, తరువాత జీవితములో కలుపుకొంటిమనియు, చేర్చుకొనదగిన అంశములన్నిటిని చేర్చుకొంటి మనియు, చివరవఱకు వేనిని వదలిపెట్టుచుంటిమో, ఆ అంశములు అప్రధానము లనియు, వీనిని విడిచిపెట్టుట వల్ల మంచిపనియే అయినదనియు, మీరు కట్టకడపట తెలిసికొనగలరు. ఇది నా జీవితములో గలిగిన అనుభవము. నేనెన్నో పనులను సాధింప గలుగుటకు కారణము నేనెన్నో అంశములను విడిచిపెట్టుట వల్లనే.

మన విద్యాపద్ధతిని తలక్రిందులుగా మార్పుచేయవలెను. చేతులకు శిక్షణ ఇచ్చుచు తద్ద్వారా మనస్సునకు శిక్షణ ఇవ్వవలెను. నేను కవినే అయినచో అయిదువ్రేళ్ళ నైపుణ్యమును గుఱించి కావ్యమే వ్రాసిఉండెడివాడను. మనస్సే సర్వశక్తి సంపన్నమైనదనియు చేతులు, కాళ్ళు పనికి రానివనియు మీరేల తలంపవలెను. చేతులతో పని నేర్వకుండ, పురాతనపు డొంకదారినే చదువు నేర్చుకొనుచున్నయెడల వారికి జీవిత సౌందర్యము అందలేదని యర్థము. వారి శక్తులన్నిటికి శిక్షణ గలుగలేదు. పిల్లలకు గ్రంథజ్ఞానమే బోధించుచున్న యెడల వారికి సరదా ఉండదు. పొడిమాటలవల్ల పిల్లల మనస్సునకు విసుగు పుట్టును. ఇంక అది కోతిపిల్లవలె తిరుగనారంభించును. ఇంక కూడని

పనులు చేతులు చేయుచుండును. చూడరాని వస్తువులు కన్నులు చూచుచుండును. వినగూడని సంగతులు చెవులు వినుచుండును. అట్లే చేయవలసిన, చూడవలసిన, వినవలసిన విషయములను అవి చేయవు, చూడవు, వినవు. వానిని సక్రమముగా వినియోగించుటలో వారికి బోధ జరిగియుండలేదు. దానివలన వారికి తీఱరాని నష్టము సంభవించు చున్నది. మంచి చెడ్డల తారతమ్యమును బోధింపనట్టియు, దేనిని గ్రహించి, దేనిని విసర్జింపవలెనో తెలియజేయనట్టియు విద్య, విద్య కాదు.

## చేతులద్వారా మానసిక శిక్షణ :

చేతులద్వారా మానసిక శిక్షణ గలుగుటెట్లో వివరింపవలసినదని శ్రీమతి ఆశాదేవి గాంధీజీని కోరియుండెను.—

*గాంధీజీ :* ప్రాతసంగతియే. ఇప్పుడు విద్యాలయములలో చెప్పు చదువుకు చేతిపనిని జతచేయుట. అయితే చదువు వేఱుగాను, చేతిపనిని వేఱుగాను బోధించుట నాచూపులో గొప్పతప్పు. ఉపాధ్యాయుడు ముందుగా చేతిపనిని నేర్వవలెను. ఆ చేతివృత్తిద్వారా అతడు తనకు వచ్చిన జ్ఞానమును పిల్లలకు బోధింపవలెను.

ఉదాహరణకు వడుకు తీసికొనుడు. నాకు గణితమురానిదే, తక్లీమీద ఎన్నిగజాల నూలువడికితినో, ఆనుమీద ఎన్నిచుట్లు కాగలవో, లేదా ఎన్నవ నెంబరు నూలో చెప్పజాలను. దానికిగాను నాకు అంకెలు కూడ వచ్చియుండవలెను. కూడిక, తీసివేత, గుణింతము, భాగహారము కూడ రావలెను. కఠినమైన లెక్కలు చేయుటకు బీజగణితము (ఆల్జీబ్రా) అవసరము. ఇక్కడకూడ రోమను అక్షరములకు బదులు హిందుస్తాని అక్షరములనే వాడవలెనని కోరుదును.

అటుపిమ్మట రేఖా గణితము (జామిట్రీ) తీసికొనుడు. తక్లీబిళ్ల కంటె వలయము (సర్కిలు) ను బోధించుటకు ఇంకేమి కావలెను.

యూక్లిడుపేరయినను చెప్పకుండ సర్కిలును గుఱించి విషయము లన్నిటిని బోధించెదను.

ఇంక పిల్లలకు వడుకుద్వారా చరిత్ర, భూగోళము ఎట్లు చెప్ప గలనని మీరు ప్రశ్నింతురు. కొన్నిరోజులక్రిందట నాకొక పుస్తకము కనబడినది. "ప్రత్తి - మానవుని కథ" అని దానిపేరు. చూతునుగదా, అది నన్ను ఆశ్చర్యములో ముంచెత్తినది. అది ఒక సుందరమైన కథ వలె తోచినది. ప్రాచీనకాలమునుండి ఇతిహాసము ప్రారంభమయినది. మొట్టమొదట ప్రత్తి ఎక్కడ ఎట్లు సేద్యము చేయబడినది వివరింప బడినది. అదెట్లు క్రమవికాసముపొందినది, వివిధదేశములలో ప్రత్తి వ్యాపారము ఎట్లు జరిగినది ఈ మొదలగు సంగతులు అందు పేర్కొన బడినవి. పిల్లలకు వివిధదేశముల పేర్లు చెప్పినప్పుడు వారికి వాని చరిత్ర, భూగోళము సయితము కొంచెము కొంచెము బోధించెదను. వేఱు వేఱు కాలములలో, ఏయే రాజుల పరిపాలనలో, వర్తకసంధు లెట్లు జరిగినవి, కొన్ని దేశములనుండి ప్రత్తి, మఱికొన్ని దేశములనుండి వస్త్రము ఎందుకు దిగుమతి చేసికొనవలసివచ్చినది, ప్రతిదేశము తనకు కావలసినప్రత్తిని ఏల పండించుకొనలేదు, ఇవన్నియు చెప్పుటకు కొన్ని అర్థికసూత్రములు, కొన్ని వ్యవసాయ పద్ధతులు పిల్లలకు బోధపడవలసి యుండును. ప్రత్తిలో ఎన్ని రకములున్నవో. అవి ఏ యే నేలలలో పండునో, ఎట్లు పండించవలెనో, వానిని ఎక్కడనుండి తెప్పించుకొన వలెనో ఈ సంగతు లన్నియు బోధించెదను. ఈ విధముగా తక్లీ వడుకు ద్వారా ఈస్టిండియా కంపెనీనారి పుట్టుపూర్వోత్తరములు చెప్పవలసి యుండును. వారెందుకు ఈ దేశము వచ్చినారో, ఎట్లు మన వడుకు పరిశ్రమను వినాశముపొందించినారో, వ్యాపారదృష్టితో వచ్చినవారికి రాజ్యకాంక్ష ఎట్లు కలిగినదో, ఆ ప్రయత్నములలో మొగలులు, మహారాష్ట్రులు ఎట్లు కూలిపోయిరో, ఎట్లు ఇంగ్లీషురాజ్యము స్థాపింప బడినదో, ఇప్పటి కాలములో ప్రజలలో చైతన్యమెట్లు కలిగినదో ఈ

మొదలయిన సంగతులు వివరించెదరు. ఈ ప్రణాళికలో ఈ విధముగా విద్యాబోధ చేయుటకు అంతు ఉండదు. పిల్లలు మానసిక శ్రమగాని, బాధగాని అనుకోకుండ ఎంత శీఘ్రముగా ఎన్ని విషయములు నేర్చు కొనగలరో ఊహింపుడు.

ఇంకను ఈ విషయమునే కొంచెము వివరించి చెప్పనీయండి. వృక్ష శాస్త్రము తెలిసికొనగోరువాడు, ఆ శాస్త్రమేగాక ఇతర శాస్త్రములుకూడ నేర్చుకొన్ననే మంచి వృక్ష శాస్త్రజ్ఞుడనిపించు కొనును. అట్లే నవీన విద్యనుగూడ ఒక శాస్త్రమని పరిగణించినయెడల అవాంతర విషయములుకూడ నేర్చుకొనవలెను. తక్లినే ఉదాహరణగా తీసికొందము. టీచరు విద్యార్థి ఎట్లును తక్లీవడుకులోని మెలకువ లన్నిటిలోను నైపుణ్యమును సంపాదింపవలసియే యుండును. అది గాక, తక్లీ పరమార్థమును, ప్రయోజనమునుగురించి సయితము తెలిసికొనవలెను. తక్లీకి ఇత్తడి బిళ్ల ఎందుకు వేయవలెను, ఇనుప చువ్వ ఎందుకుండవలెను. పూర్వకాలములో తక్లీ ఏదో విధముగా చేసెడివారు. మఱీ పూర్వకాలములో పలకబిళ్ల, లేక మట్టిబిళ్ల, కట్టి పుల్ల ఉపయోగించెడివారు. తరువాత తక్లిని శాస్త్రదృష్టితో నిర్మించిరి. ఇత్తడి బిళ్లను, ఉక్కు బిళ్లను అమర్చుటలోను కొంత అర్థమున్నది. దానిని కనుగొనవలెను. ఆ బిళ్ల అంతే పరిమాణములో ఎందుకుండ వలెనో, ఎక్కువ తక్కువగా ఎందుకుండరాదో, ఆ విషయము గ్రహింప వలెను, అతడీ విధముగా విషయములన్నిటిని గ్రహించి, అందలి గణిత భాగమును సయితము నేర్చుకొన్నయెడల, గొప్ప ఇంజనీరే కాగలడు. అతనికి 'తక్లీ' కామధేనువు కాగలదు. ఈ పద్ధతిద్వారా విద్యాబోధ చేయుటకు నూఱు మార్గములు కనబడును. మీ శక్తి, ఉత్సాహము ఎంత ఎక్కువగా ఉన్నయెడల బోధచేయుట కన్ని విషయములు దొరకును. ఈ మూడు వారములనుండి మీరిక్కడ శిక్షణ పొందు చున్నారు. నేనీ విద్యాబోధను సక్రమముగా నిర్వహించెదను. లేదా

ఇందే మరణించెదను అను దీక్ష మీ కీ కాలములో కలిగినయెడల ఈ శిక్షణ సార్థకము కాగలదు.

నేను వడుకును గురించియే అధికముగా వివరించుచున్నాను. దానినిగురించి ఎక్కువగా తెలియుటయే అందుకు కారణము. నేను వడ్రంగినై యున్నచో నా బిడ్డలకు వడ్రంగముద్వారాను, అట్టపని (కార్డుబోర్డు) వాడనయినచో అట్టపనులద్వారాను సమస్త విషయములు బోధింపగలను.

మనకు ప్రతిభాసంపన్నులయిన విద్యావంతులు కావలెను. వారి ఉత్సాహమునకు హద్దులుండరాదు. బిడ్డలకు ఏమేమి బోధింపవలెనో నిత్య నూతన విషయములను సమకూర్చుకొనుచుండవలెను. లావుపాటి గ్రంథముల నవలోకించినందువల్ల ఈ జ్ఞానము రాదు, అతడు చేతివృత్తిని మనస్సులో పెట్టుకొనవలెను. ఇంక సర్వ విషయములు పరిశీలించుచు, ఆలోచించుచు, తన జ్ఞానమును పెంపు చేసికొనుచు, నోటితో పిల్లలకు బోధింపవలెను. ఇట్లు చేసితిరా విద్యా బోధలో అద్భుతమైన మార్పు రాగలదు. అసలు ఉపాధ్యాయుని చూపులోనే మార్పు రాగలదు. ఇంతవఱకు మీరు ఇనస్పెక్టర్ల రిపోర్టుల నాధారముగా చేసికొని నడచుచు వచ్చుచున్నారు. ఇనస్పెక్టర్లను సంతోషపఱచు చూపుతోను మీ విద్యాలయములకు గాని, మీకు గాని అధికముగా గ్రాంటులో, జీతములో పొందవలెనను చూపుతోను పని చేయుచున్నారు. ఈ నవీన పద్ధతిలోని ఉపాధ్యాయుడు వానిని వేనిని లెక్కచేయడు. 'నేను నా విద్యార్థి విషయములో కర్తవ్యమును నెరవేర్చితిని. నా శక్తియుక్తులను ధారపోసితిని. అతనిని సుయోగ్య పురుషునిగా తయారుచేసితిని. అదేపదివేలు' అని అతడు సంతోషించును.

(హరిజన్, 18-2-39)

---

## చేతి వృత్తి ద్వారా ఉపాధ్యాయులకు శిక్షణ:

*ప్రశ్న :* టీచరు విద్యార్థులను తయారుచేయునపుడు ముందుగా చేతి పరిశ్రమను బోధించి, ఆ వెనుక దానికి సంబంధించిన చదువంతయు చెప్పుట మంచిది కాదా. వారు తాము 7 ఏండ్ల బాలురమనుకొని వృత్తి ద్వారా సర్వ విషయములు గ్రహింపవలెను. ఈ విధముగా చేసినయెడల క్రొత్త శాస్త్రమును నేర్చుకొనుటకును సమర్థులయిన ఉపాధ్యాయులుగా తయారగుటకును ఏండ్లు, పూండ్లు పట్టును.

*గాంధీజీ :* కాదు. ఏండ్లును పట్టవు. పూండ్లును పట్టవు. ఉపాధ్యాయుడు నా వద్దకు వచ్చునప్పటికి కొంత గణితము, చరిత్ర, భూగోళము వచ్చినవనుకొనుడు. అతనిని అట్టపెట్టెలు చేయవలెనని గాని, వడకవలెనని గాని బోధించెదను. అత డా పని చేయుచుండగా, గణితము, చరిత్ర, భూగోళము వృత్తి ద్వారా ఎట్లు బోధింపవలెనో నేర్పెదను. అత డా విధముగా తనకు వచ్చిన జ్ఞానమును, వృత్తితో జతపెట్టుకొనుట నేర్చుకొనును. అందుకు దీర్ఘకాల మవసరము లేదు. మఱియొక ఉదాహరణ తీసికొనుడు. నేను నా పిల్లవానిని తీసికొని బేసిక విద్యాలయమునకు పోయితిననుకొనుడు. మే మిద్దఱము వడుకు నేర్చుకొందుము. నాకు లోగడ వచ్చిన జ్ఞానమునంతయు గృహ పరిశ్రమతో జతచేసికొందును. పిల్లవానికి అంతయు క్రొత్తగా నుండును. 70 సంవత్సరముల వయస్సు గల తండ్రికి అంతయు ప్రాత చదువే. అయితే క్రొత్త విధముగా విషయబోధ జరుగగలదు. అందుకు కొన్ని వారములకంటె ఎక్కువ పట్టదు. కనుక 8 సంవత్సరముల బాలకుని వలె విషయ గ్రహణము చేయవలెనను ఉత్సాహము, ఆసక్తి లేని

యెడల ఆ ఉపాధ్యాయుడు కేవలము వడుకుపనివాడుగా మాత్రమే తయారుకాగలడు. అంతేకాని, బేసిక ఉపాధ్యాయుడుగా పనికిరాడు.

*ప్రశ్న* : ఒక పిల్లవాడు మెట్రిక్యులేషను ప్యాసయిన యెడల కాలేజీకి వెళ్లగలడు. నవీన విద్యా విధానములో తయారయినవాడు కూడ అట్లు పోగలడా ?

*గాంధీజీ* : మామూలు విద్యాలయములో ప్యాసయిన మెట్రిక్కు విద్యార్థికంటె, బేసిక విద్యార్థి ఎంతో మెఱుగనిపించును. కారణ మేమనగా ఇతని శక్తులన్నియు వికాసమును పొందియుండును. మామూలు మెట్రిక్కు విద్యార్థులు సామాన్యముగా కళాశాలలో బిక్క మొగములతో నుండగా బేసిక విద్యార్థులకు అట్టి స్థితి పట్టదు.

*ప్రశ్న* : విద్యార్థులు బేసిక విద్యాలయములో చేరుటకు వారి వయస్సు 7సంవత్సరము లుండవలెనని నియమింపబడినది. ఆ వయస్సు కాలమునకు సంబంధించినదా, మనస్సునకు సంబంధించినదా ?

*గాంధీజీ* : ఏడు సంవత్సరములకు తక్కువ కాకుండ సగటున వయస్సు నిర్ణయింపబడినది. కొందఱు బాలురకు ఎక్కువ వయస్సును ఉండవచ్చును. కొందఱకు తక్కువ ఉండవచ్చును. శారీరకముగాను, మానసికముగాను కూడ వయస్సు లెక్కలోనికి రావలెను. ఒక పిల్ల వానికి 7 ఏండ్ల ప్రాయముననే పరిశ్రమను చేతబట్టగల శరీరబలము ఏర్పడును. మఱియొకడు 8 ఏండ్ల వయస్సు వచ్చినను అందుకు సమర్థుడు కాడు. అందువలన ఇందును గుఱించి గట్టి నియమము లేమియు చేయజాలము. పై విషయము లన్నిటిని పరిశీలింపవలసినదే.

మీ ప్రశ్న పరంపరలను బట్టి చూడగా, మీ కెన్నో సంశయము లున్నట్లు కనబడుచున్నది. కాని కార్యారంభమునకు ఇది సరియయిన పద్ధతికాదు. మీకు పూర్ణ విశ్వాసము ఉండవలెను. కోట్లమంది గల మన బిడ్డలకు విద్యాబోధ చేయవలెనన్న, బేసిక విద్యయే శరణ్యమని నావలెనే మీకుకూడ అఖండ విశ్వాస మున్నయెడల ఈ పని నెర

వేయును. అట్టి విశ్వాసమే మీకు కుదరని యెడల మీకు విద్యాబోధ చేసినవారిలో ఏదో లోపమున్నదన్నమాట. మీ విద్యా గురువులు ఏమేమి నేర్పకపోయినను, ఈ విశ్వాసము మీకు గట్టిగా కుదురు నట్లయినను నేర్పియుండవలసినది.

## ఉపాధ్యాయ సమస్యలు :

*ప్రశ్న* : నవీనవిద్యా పద్ధతి గ్రామీణులకొఱ కేర్పడి యున్నది. నగరవాసుల సంగతి యేమియు లేదా ? వారు ప్రాత పుంతలను బడి పోవలసినదేనా ?

*గాంధీజీ* : ఇది తగిన ప్రశ్న. మంచిదికూడ. ఈ విషయమయి నేను హరిజన పత్రికలో ఇదివఱకే సమాధానము వ్రాసియుంటిని ఇప్పుడు మనము చేపట్టిన సమస్యను పరిష్కరించుకొన్న అక్కడకు కృతార్థులమే. మనము చేయనున్న పని సామాన్యముకాదు. 7 లక్షల గ్రామముల చిక్కును మనము విడదీయ గలిగిన యెడల, ఇప్పటికి ఆ పనితో తృప్తి చెందుదము. విద్యావేత్తలు నగరముల సంగతికూడ ఆలోచన చేయుచున్నారు. ఈ గ్రామ సమస్యతోపాటు, నగర సమ స్యనుకూడ ఎత్తుకొంటిమా, మనము శక్తిహీనుల మయిపోదుము.

*ప్రశ్న* : ఒక గ్రామములో మూడు బేసికు పాఠశాల లున్న వనుకొనుడు. మూడింటిలోను భిన్న భిన్న పరిశ్రమలు నేర్పుచుందురు. ఒకదానికంటె వేఱొకదానిలో జ్ఞానము సంపాదించుట కెక్కువ అవ కాశము లుండును. అప్పుడు విద్యార్థి ఏ పాఠశాలలో చేరవలెను.

*గాంధీజీ* : అటువంటి పోటీ ఉండరాదు. మనకున్న గ్రామము లన్నియు చాలవఱకు చిన్నవే. అందువలన ఒక పాఠశాలకంటె ఎక్కువ ఉండరాదు. అయితే పెద్ద గ్రామమున ఉండవచ్చును. అక్కడ ఒకటి రెండు పాఠశాల లుండవచ్చును. కాని నేర్పబడు వృత్తి ఒక్కటిగానే ఉండవలెను. ఈ విషయములో కూడ గట్టి నియమము

నేర్పుటుపలేను. అనుభవమునుబట్టియే యిట్టి విషయములు నిర్ణయించు కొనవలెను. ప్రజలకు ఏ వృత్తులు మిక్కిలి ప్రియముగా నుండునో, వేనివల్ల పిల్లల సర్వ శక్తులను వెలికి దీయుట కవకాశ ముండునో ఈ విషయములను సమగ్రముగా పరిశీలింపవలెను. మీ రేచేతివృత్తిని తీసికొన్నను, దానిద్వారా విద్యార్థులకు సర్వతోముఖ వికాసము సమముగా రావలెను. ఆ చేతివృత్తి గ్రామపరిశ్రమగా నుండవలెను. ఉపయోగకరముగాను ఉండవలెను.

*ప్రశ్న :* ఒక పిల్లవాడు భావికాలములో వేఱొక వృత్తి చేసి కొనగలవాడుగా నుండగా, అతడీ బేసికు పాఠశాలలో మఱియొక వృత్తిని చేపట్టి ఏడు సంవత్సరముల కాలము వృథాచేయు టెందు లకు. బ్యాంకరు (వడ్డీ వ్యాపారము చేయువాడు) కొడుకు ఉన్నా డనుకొనుడు. అతడెట్లయినను ముందు ముందు తండ్రి వృత్తి నవలం బింపవలసినవాడే. ఆ స్థితిలో వాడిప్పుడు 7 సంవత్సరముల కాలము వడుకుపని ఎందుకు నేర్చుకొనవలెను?

*గాంధీజీ :* ఈ ప్రశ్న అడిగినవారికి, నవీన విద్యలోని అసలు తత్త్వమే అర్థముకాలేదన్నమాట. బేసికు విద్యార్థి, విద్యాలయములో కేవలము చేతివృత్తిని మాత్రమే నేర్చుకొనడు. అతడు ప్రారంభవిద్య నేర్చుకొనుటకు వృత్తిద్వారా మానసిక వికాసము పొందుటకు బడికి పోవుచున్నాడు. మామూలు పాఠశాలలో చదువునేర్చిన విద్యార్థి కంటె, బేసికు విద్యాలయములో ఏడేండ్లు చదువుకొన్న బాలుడు బ్యాంకింగు పనిని సమర్థతతో నిర్వహింపగలడు. ఆ పిల్లవాడు బ్యాంకింగు పాఠశాలకు వెళ్ళి చదువునేర్చునే అనుకొనుడు. అయినను అతనికి గట్టి చదువురాదు. కారణమేమనగా అతని సర్వశక్తులు వికసించియుండలేదు. మనస్సునకు పట్టుకొన్న సందేహములు ఒక్కపట్టున విడిపోవు. నవీన విద్యలో కొంత విద్యాబోధ జరుగుటలేదనియు, అది

వృత్తిద్వారా పూర్ణ ప్రారంభ విద్యయనియు ఈనాడు మీకు నేను బోధ చేయగలిగినయెడల ధన్యాత్ముడను.

*ప్రశ్న* : ప్రతి విద్యాలయములోను ఒకటికంటె ఎక్కువ వృత్తులు నేర్పుట మంచిదికాదా ? పిల్లలకు ప్రతిరోజు, ప్రతినెల, ప్రతి సంవత్సరము చెప్పినదే చెప్పుచు పోయినయెడల వారికి విసుగు ఏవగింపు గలుగదా ?

*గాంధీజీ* : ఉపాధ్యాయుడు ఒక నెలపాటు తన విద్యార్థులకు వడుకు నేర్పుచు, వారికి మొద్దు మాస్టరుగా కనబడినయెడల, ఆ ఉపాధ్యాయుని నేను డిస్మిసు చేయుదును. ఒక వీణనుండి నిత్యము నూతన రాగములు రాగలిగినట్లు, ఈ పాఠశాలలో గూడ నిత్య నూతనత్వము వచ్చుచుండును. పిల్లలు ఒక చేతి పనినుండి మఱియొక చేతిపనికి గంతులు వేసినయెడల, ఈ కొమ్మకు, ఆకొమ్మకు గంతులు వేయుచు, స్థిరనివాసములేని కోతిపిల్లలవలె అయిపోవుదురు. వడుకును శాస్త్రోక్తముగా నేర్చుకొన్నయెడల అనేక విషయముల నెన్నిటినో నేర్చుకొనవచ్చునని ఈ ప్రసంగములలో నేను తెలియ బఱచియేయున్నాను. పిల్లవాడు అచిరకాలములోనే తన తక్లీని, ఆసును చేసికొనుటకు సమర్థుడు కాగలడు. కనుక వెనుక చెప్పినదే మరల చెప్పవలెనన్న ఉపాధ్యాయుడు చేతివృత్తిద్వారా విద్యాబోధన చేసినయెడల విద్యార్థికి సర్వతోముఖవికాసము గలుగగలదు.

---

## 33 పశ్చిమానుకరణముకాదు

(1937 అక్టోబరులో, వర్ధాలో నవీనవిద్యా మహాసభవారు నియమించిన నవీన జాతీయ విద్యాసమితివారు ప్రచురించిన రిపోర్టు రెండవ సంస్కరణకు మహాత్మాజీ పీఠిక.)

ఈ కరపత్రము మొదటి సంస్కరణ వెయ్యి ప్రతులు వెంటనే ఖర్చగుట చూడగా డాక్టరు జకీరు హుస్సేను కమిటీవారు పేరు పెట్టిన (బేసికు నేషనల్ ఎడ్యుకేషను) నవీన జాతీయ విద్యవల్ల ఇండియాలోను, ఇతర దేశములలోను కావలసినంత ఆసక్తి గలుగుచున్నదని తెలియుచున్నది. బేసికు నేషనల్ ఎడ్యుకేషను అనుటకు బదులు "గ్రామ పరిశ్రమలద్వారా (రూరల్ నేషనల్ ఎడ్యుకేషను) గ్రామీణ జాతీయ విద్య" అని యుండిన బాగుండెడిది. (రూరల్) గ్రామీణ అను ప్రయోగములతో ఉన్నత విద్య గాని, ఇంగ్లీషు విద్య గాని కాదని అర్థము రాగలదు. ("నేషనల్") జాతీయ అనగా ప్రస్తుతము సత్యము, అహింస అని తెలియగలదు. "గ్రామీణ పరిశ్రమల ద్వారా" అని యుండుటవల్ల ఉపాధ్యాయులు విద్యార్థులకు గ్రామ పరిశ్రమలద్వారా విద్యాబోధ చేయుచు బాలకుల సర్వతోముఖ వికాసమునకు పాటు పడుటయేగాని, ఇతరుల ఒత్తిడివల్లగాని కాదని తెలియగలదు. కనుక గ్రామీణ బాలకుల చదువువిషయములో ఇది గొప్ప మార్పును తేగలదు. ఇది పశ్చిమ దేశానుకరణము ఎంతమాత్రము కాజాలదు. ఈ ప్రణాళికను రూపొందించుటలో మహామహులయిన విద్యావేత్తలు విశేషపరిశ్రమతో విశేషపరిశీలన చేసియున్నారు. అందువల్ల పాఠకులు ఈ సంగతిని మనసులో నుంచుకొన్న యెడల దీనిని అర్థముచేసికొనుట సులభము కాగలదు.

(సేవాగ్రాం 28-5-38)

## 34 మధ్యప్రదేశము స్థానిక సంస్థల ముందడుగు

కడచిన వారములో మధ్యప్రదేశము, బీరారులోని స్థానిక సంస్థల ప్రతినిధు లొకచోట సమావేశమయి గాంధీజీని వచ్చి ఉపదేశ మిమ్మని కోరిరి. నవీన విద్యవల్ల దేశమునకు ఆర్థిక, రాజకీయాభ్యుదయ మెట్లు గలుగునో చెప్పవలసినదని ఒకరు ప్రశ్నించినమీదట గాంధీజీ ఆ విషయమునే ఇట్లు ముచ్చటించిరి—

మీరీ ప్రశ్న అడుగుట నాకు చాల సంతోషము. దానికి సమాధానము ఈ విధముగా మొదలుపెట్టెదను. ఇప్పుడమలులోనున్న ప్రారంభిక విద్యాపద్ధతి దేశమునకు ఆర్థిక లాభము గలుగవలెననెడి చూపుతో నిర్ణయింపబడలేదు. ప్రభుత్వమువారు ప్రారంభిక విద్యకు గాను ఖర్చుపెట్టే సొమ్మునుండి వారికి ప్రతిఫలమేమియు రాదు. శుక్లజీ వంటి పరిపాలకులు కొద్దిమంది ఉన్నత విద్యాఫలితముగా మనకు రావచ్చును గాక. అంతమాత్రముచేత ప్రారంభ విద్యకుగాను చేయబడుచున్న ఖర్చంతయు సవ్యమయినదని అనజాలము. ఇంగ్లీషు డిగ్రీలున్నవారివల్లను, లేదా ఇంగ్లీషుజ్ఞానముగలవారివల్లను మాత్రమే పరిపాలన నడవవలెను అను చాదస్తపు ఆలోచనలు పెట్టుకొనుటకు మాత్రమే ఆ విద్య ఉపకరించును. ప్రస్తుత ప్రారంభవిద్య పూర్తిగా దండుగనియు, ప్రారంభిక విద్యార్థులలో మిక్కిలి తక్కువమంది మాత్రమే పైతరగతులకు పోగలుగుచున్నారనియు, చదువుకొన్న అక్షరములైనా స్థిరముగా నుండుట లేదనియు ఈ విద్యఅయినను దేశములోని అంతులేని గ్రామములలో మిగుల అల్పముగా మాత్రము వ్యాపించినదనియు విద్యాశాఖా డైరెక్టర్లు అంగీకరించియున్నారు.

మధ్యప్రదేశములో ఎన్నవవంతు గ్రామములలో ఈ ప్రయిమరీ పాఠ శాలలయినను ఉన్నవి. ఆ కొద్ది పాఠశాలలవల్ల ఏ విధమయిన ప్రతి ఫలమును వానికి వచ్చుచుండుటలేదు.

కనుక మీరు అడిగిన ప్రశ్నకు చోటేే ఉండదు. విద్యఅంతయు చేతి పరిశ్రమద్వారానే ఉండును గనుక ఈ నవీన విద్యాప్రణాళిక గట్టి అర్థశాస్త్రపు పునాదులపైన నిర్మింపబడినది. సామాన్య విద్యాబోధ, పై పెచ్చు చేతిపరిశ్రమ అని కాదు దీని నిర్వచనము చేతిపరిశ్రమద్వారా పూర్ణవిద్యఅని దీని నిర్వచనము. ఒక పిల్లవాడు నేతద్వారా విద్య నేర్చినాడనుకొనుడు. మామూలు నేతవానికంటె అతడు ఎక్కువ విషయజ్ఞానము గలవాడయి యుండగలడు. అందువల్ల నేత పారిశ్రా మికుడు ఆర్థికముగా నష్టదాయకుడని ఎవరును చెప్పజాలరు. జేసికు నేత పారిశ్రామికుడు పనిముట్ల ఉపయోగములు, పనితనములోని మెలకువలు మామూలు నేతవానికంటె ఎక్కువ తెలిసికొనును. అందు వలన మంచిఫలితములు రాగలవు. ఈ పద్ధతివల్ల ఆర్థికముగా ఎంత లాభము వచ్చునో తెలిసికొనవలెనన్న, శ్రీమతి ఆశాదేవి కొన్ని అంకెలు ప్రోవుచేసినది. వానిని పరిశీలింపవచ్చును. మేమనుకొన్న వానికంటె మంచి ఫలితములు వచ్చినవి. స్వయంపోషక విద్య అనగా నా చూపులో అదియే స్వయంపోషకమని నేను వాడినప్పుడు పాఠశాల నిర్వహణముకొరకు పెట్టిన సొమ్మంతయు రావలెనను చూపుతో వాడియుండలేదు. పిల్లలు తయారుచేసిన వస్తువులవల్ల టీచర్ల జీతాలు పూడిన చాలునని మాత్రమే అభిప్రాయపడితిని. కనుక నవీన విద్యా ప్రయోజనము ఆర్థికముగా స్వయంనిరూపణము.

జాతీయ ప్రబోధము అని మరియొక అంశమున్నది. గ్రామీణ పరిశ్రమలపైన కుమారప్ప కమిటీవారు ఒక రిపోర్టు ప్రకటించి యున్నారు. మీలో ఎవరయినను దానిని చదివినారో లేదో, తెలియదు. భారతదేశములో ప్రతి ఒక్కరి సాలుసరి ఆదాయము సగటున

రు. 70 లు అని చెప్పుకొనుట ఆచారము. కాని మధ్యప్రదేశ్‌లోని గ్రామములలో ఒక్కని సాలుసరి ఆదాయము రు. 12 లేక రు. 14 లకు మించి యుండలేదని శ్రీ కుమారప్ప ఋజువు చేసియున్నారు. గ్రామావసరములను తీర్పగలవనియే నవీన విద్యలో వడుకు మొదలయిన గ్రామీణ పరిశ్రమలు చేర్పబడియున్నవి. అందువలన గ్రామ పరిశ్రమలద్వారా చదువు నేర్చుకొను విద్యార్థులు తమ జ్ఞానమును గృహజీవితమునకు పనికివచ్చునట్లు నడచుకొనవలెను. కనుక గ్రామ పరిశ్రమలను పునరుద్ధరించుటవల్ల గ్రామ జనుని ఆదాయము తేలికగా రెట్టింపు కాగలదు. మీరు ప్రజాసేవకులయి, ఈ నవీన విద్యా నిర్వహణమందు ఆసక్తి చూపుచున్న యెడల, మీకు జిల్లాబోర్డుల ఇబ్బందులు ఉండజాలవు. ఒక పాఠశాలలోని విద్యార్థులు రోజునకు నాలుగు గంటల చొప్పున 30 రోజులు నూలువడికి రు. 75 ల పై చిల్లర సంపాదించి యున్నారని ఈ మీటింగుకు వచ్చుచున్నప్పుడు నాకొక ఉత్తరము వచ్చినది. 30 మంది విద్యార్థులు నెలకు రు. 75 లు సంపాదింప గలిగిన యెడల, ఇండియాలోని ప్రాథమిక పాఠశాలా విద్యార్థులవల్ల ఎంత ఆదాయము రాగలదో మీరు లెక్కలుకట్టి చూడండి. అంతేకాదు, దేశాదాయమునకు కొంత తోడ్పడుచున్నా మనియు, సమాజములోని అసమానత్వమును తొలగించుచున్నా మనియు తలచుటలో విద్యార్థులకు ఎంత ఆత్మ విశ్వాసము, ఎంత బుద్ధివికాసము కలుగుచున్నవో ఒక్కసారి ఊహించుకొనుడు. అట్లు జరుగుటవల్ల సహజముగానే రాజకీయ చైతన్యము గలుగును. స్థానిక వ్యవహారము లెట్లు జరుగుచున్నవో, లంచగొండితనమును అంత మొందించు టెట్లో, ఈ మొదలయిన సంగతులు మన విద్యార్థులకు తెలియవలెను. ఇటువంటి రాజకీయ విద్య మన పిల్లలలో ప్రతి ఒక్కరికి రావలెనని నా అభిప్రాయము. అట్లు చేయుటవలన వారిలో తప్పక కొంత అభివృద్ధి కనబడును.

అందువల్ల నవీనవిద్యద్వారా దేశములో రాజకీయ, ఆర్థిక అభ్యుదయము గలుగునని నిండుగా ఋజువు చేసి యున్నానని తలంచెదను.

ఇంత వివరించిన మీదట మీకు నేనొక విన్నపము చేసెదను. మీ రిక్కడకు వచ్చియున్నారు గనుక ఈ విద్యా విధానమును మీరు లెస్సగా పరిశీలించి, మీకు నచ్చినదో లేదో శ్రీ శుక్లజీతోను, శ్రీ ఆర్య నాయకమ్‌తోను చెప్పి వెళ్ళండి. మీరు మూడు నెలలపాటు విశ్వాసముతోను, ఉత్సాహముతోను పనిచేసిన యెడల మీ విద్యాలయముల లోను, మీ విద్యార్థులలోను నూతన జీవము, నూతన శక్తి కలిగింప గలరు. ఒక విత్తనము మహా వృక్షముగా పెరుగవలెనన్న ఎన్నో సంవత్సరములు పట్టును. కాని యీ నవీన విద్యాబీజ ఫలితములు చూచుటకు కొన్ని నెలలు సరిపోవును. ఇండియాలో అద్భుత మయిన మార్పులు తేగలిగిన అతి సామాన్య విషయములను, అనగా ఖాదీ, మద్య నిషేధము, చేతి పరిశ్రమలను పునరుద్ధరించుట. చేతి వృత్తుల ద్వారా విద్య అను దానిని మీకు వివరించి చెప్పితిని. ఇప్పుడు పరిపాలనలో మీకుగల మత్తు లేక నిషా తొలగిపోయిన గాని ఆ అతి సామాన్య విషయములు మీకు బోధపడవు.

మీ రేపనిని చేసినను నిష్కల్మష చిత్తముతో చేయండి. మిమ్ము మోసము చేసికొనకండి. మమ్ము మోసము చేయకండి. మీ కీ విద్యా పద్ధతి నచ్చని యెడల మాతో స్పష్టముగా చెప్పండి.

ఇంక స్థిరమైన పెట్టుబడి ఖర్చులను (capital expenditure) గురించి ఒకమాట. భవనములమీద ఖర్చుపెట్టిన సొమ్మువలె ఈ పెట్టుబడి సొమ్ము వృథా వ్యయముకాదు. మీరు కొన్ని పనిముట్లు, కొంత స్టాకు కొనుటకు సొమ్మును ఖర్చుచేయవలెను. ఆ పరికరములు కొన్ని సంవత్సరముల వఱకు పనికి రాగలిగినవే. రాట్నములు, మగ్గములు, ఏకుడు కమానులు మొదలయినవి రాబోవు విద్యార్థి

జట్టులకు ఉపయోగపడగలవు. యంత్ర పరిశ్రమల విషయములో లక్షలు, కోట్ల కొలది పెట్టుబడి, వానిలో తలుగులు, బొలుగులు, అరుగుదలలు ఎన్నో ఉన్నవి. అటువంటి నష్టము లేవియు మనకు లేవు. గ్రామ పరిశ్రమలను చక్కగా వ్యవస్థాబద్ధము చేసినయెడల అసలు నష్టములే యుండవు.

చివరిమాట ఒకటి వినుడు. రాజకీయ విధానములో జరుగు చున్న మార్పులను చూచి భయపడకండి. మంత్రులు వచ్చినదారినే పోగలరు కూడ. అతి స్వల్ప కాలపు నోటీసుతోనే మీరు ఖాళీ చేయ వలసియుందురని చెప్పియే మంత్రుల నక్కడ కూర్చుండబెట్టితిమి. ఇప్పుడు వారు సెక్రటరీ కార్యాలయములకు నడచుచున్నారు. రేపు శ్రీకృష్ణజన్మస్థానమునకు పోవలసియుందురు. చిఱునవ్వు రేఖలు మొగమున తాండవించుచుండగా పోగలరు. కాని మీ కార్యక్రమము నకు, పనిపాటులకు, మంత్రిత్వముతో సంబంధములేదు.

గట్టి పునాదులపైన మీరు మీ కార్యములు ప్రారంభము చేసి తిరా, ఎన్ని మంత్రిత్వములు వచ్చినను, పోయినను, మీ పనులకు అడ్డు రావు. అయితే అదంతయు మీవిశ్వాసముపైన ఆధారపడియుండును. కాంగ్రెసు సంస్థ సత్యాహింసలకు కట్టుబడియున్నంతవఱకు, స్థిరముగా నిలిచియుండును. నేను కాంగ్రెసు సంస్థను దయావిహీనముగా విమ ర్శించితిని. దాని దోషములను ఎత్తిచూపితిని. ఇంతజరిగినను, కాంగ్రెసువల్ల కొంత ఉపకారము జరిగినది. కనుకనే ప్రతిష్ఠ నిలిచినది. కనుక ఖర్చు పద్దుకంటె ఇప్పటికిని జమపద్దే ఎక్కువగానున్నది.

నూఱు చెప్పినను, లక్ష చెప్పినను సర్వము, మీ విశ్వాసము, నిశ్చయబుద్ధిపైననే ఆధారపడియున్నది. మీకు దృఢసంకల్పము ఉన్నయెడల, కార్య సఫలత గలిగినదే అనుకొనుడు. ఈ నవీనపద్ధతి అమలు జరిగి తీరవలెనను సంకల్పము మీకు గలిగినయెడల ఇబ్బందు లన్నియు, మంచువిడిపోయినట్లు పోగలవు. ఆ విశ్వాసము మాత్రము

సజీవమయి యుండవలెను. వేలకొలది జనులు ఈశ్వరభక్తులమని చెప్పుకొందురు, కాని ఏదో ఒకమూల అపాయ సూచన కనబడగానే, కాళ్ళు విఱుగద్రొక్కుకొని పాఱిపోయెదరు. ఇది చచ్చు విశ్వాసము. దీనిలో ప్రాణములేదు. ఒకనికి విశ్వాసము ప్రాణవంతముగానున్నచో, అవసరమయిన జ్ఞానము గలుగుటయేగాక తాను పట్టిన కార్యక్రమమును విజయవంతముగా సాగించుటకు, తగిన ధీశక్తి, సాధన సంపదయేర్పడగలవు. అటువంటి విశ్వాసమే మీకందఱకు గలదని విని నేను సంతోషించుచున్నాను. అదే నిజమయినయెడల మీ రాష్ట్రమే యితర రాష్ట్రములకు మార్గదర్శకము కాగలదు.

(హరిజన్ 28-10-39)

మార్చి 31 వ తేది 5 గంటలతో ఖాదీ యాత్ర* పూర్తి అయినది. సాయంకాలము ప్రార్థనానంతరము ప్రశ్నలున్న యెడల సమాధానము చెప్పెదనని గాంధీజీ చెప్పుటవల్ల చాలమంది ఆ రాత్రికి ఉండిపోయిరి.

*ప్రశ్న*: నవీన విద్యలో తక్లీని ప్రవేశపెట్టినారు గదా. అది ఆర్థికలాభముకొఱకా అనగా స్వయంపోషణకా? లేక అందు విద్యా ప్రయోజనమేమయిన నున్నదా?

*గాంధీజీ*: నవీనవిద్యలో ప్రవేశపెట్టిన ప్రతి అంశమునకు విద్యా ప్రయోజనమే లక్ష్యము. చేతిపరిశ్రమద్వారా బాలకులకు శారీరిక, మానసిక, నైతిక వికాసమును గలుగజేయుటయే నవీన విద్యా ప్రయోజనము. ఏ ప్రణాళిక అయినను సరే విద్యాప్రయోజనము దృష్ట్యా సమర్థమైన యెడల అది ఆర్థికముగా కూడ లాభకరముగా నుండగలదు. అయితే దక్షతతో దానిని నిర్వహింపవలెను. పిల్లలచేత మట్టిబొమ్మలు తయారుచేయించి వెంటనే పాడుచేయించితి మను కొనుడు. దానివలనకూడ పిల్లలకు బుద్ధివికాసముకలుగును. అయితే అందు ప్రధానమగు నైతిక సూత్రమునకు భంగము గలుగుచున్నది. మానవశక్తిని పనికిమాలిన వస్తువులనిమిత్తము వృథా వ్యయము చేయ రాదన్నదియే ఆ నైతిక నియమము. ప్రతివాడును తన జీవితములోని ప్రతి క్షణమును, ఉపయోగకరముగా గడపవలెను. అట్టి శిక్షణయే ఉత్తమ పౌరునిగా చేయదగు ఉత్తమవిద్య. దానివల్లనే నవీనవిద్య స్వయంపోషకము కాగలదు.

---

* వర్ధాజిల్లాలోని ఖాదీప్రియులందఱు శ్రీ వినోబాజీ ప్రేరణపైనను నాయ కత్వము క్రిందను ప్రతియేటను ఖాదీయాత్ర జరిపి, సేవాగ్రామములో మహాసభ జరుపుకొనుచుండెదరు.

*శ్రీ నరహరి పరీఖు ఇట్లు వ్రాయుచున్నారు :*

మన ఖాదీని విద్యాలయములలోను, ఇతర పాఠశాలలలోను సాహిత్య విద్యకు ప్రాధాన్యమిచ్చుచుండుట తప్పని నా అభిప్రాయము. చేతిపరిశ్రమకు కొన్ని గంటలకు, సాహిత్య పాఠములకు కొన్నిగంటలు కేటాయించుచున్నారు. పుస్తకములు చదువుటవల్లనే జ్ఞానాభివృద్ధి గలుగునని వారి అభిప్రాయము. పుస్తకములకంటె చేతిపరిశ్రమ ద్వారానే బుద్ధివికాసము ఎక్కువ గలుగునని తలచుచున్నాను. మీ అభిప్రాయమేమి ?

*గాంధీజీ వ్యాఖ్య :*

ఈ లేఖకులు వ్రాసిన విషయము సరియయినదే. సాహిత్య శిక్షణవల్ల బుద్ధివికాసము గలుగునని చెప్పజాలము. ప్రధానముగా కంఠతా పట్టుటయే అక్కడ జరుగుచున్న పని. బొమ్మలవలె అక్షరములుకూడ మనస్సుపై చిహ్నితములగుచుండును. సాహిత్య శిక్షణ అనగా కేవలము పుస్తకములు చదువుట కాదు. చేతిపరిశ్రమల విషయములోకూడ అంతే. చేతిపరిశ్రమల జ్ఞానము గలిగినదనగా అందలి సుళువులు తెలియుటయేకాదు. దాని శాస్త్రజ్ఞానముకూడ రావలెను. అప్పుడు, ఇప్పటి పాఠశాలలలోను, కళాశాలలలోనుకంటె అధికముగా బుద్ధివికాసము గలుగును. పాఠశాల కార్యక్రమములో చేతిపరిశ్రమను అప్రధానముగా చూచుట దుఃఖింపవలసిన విషయము. అట్లు చేయుట వలన విద్యార్థులకు చేతిపరిశ్రమ యెడల శ్రద్ధ పర్పడదు. అందువల్ల వారికి బుద్ధివికాస మేర్పడదు. పుస్తకములు చదువుటవల్ల కళ్ళు

చెడిపోవుటయే గాక బుద్ధికిని, ప్రతిభకును మాంద్య మేర్పడును. చేతి పరిశ్రమలను, వానికి సంబంధించిన శాస్త్రమును నేర్చుకొనుటవలన ఇటువంటి ప్రమాదములేదు. ఇందుకొఱకు కూడ కొన్ని పుస్తకములు చదువవలెను. ఆ చదువు చేతి పరిశ్రమలకు సంబంధించినదే గనుక, దానివలన బుద్ధివికాస మేర్పడును. నేననుకొన్న నవీనవిద్య యిది. అందు వాస్తవికత ఇమిడి యున్నది గనుక ఎప్పటికయినను అది శక్తి గలది కాక తప్పదు. అంతవఱకును పుస్తకాల చదువుకును, చేతి పరిశ్రమకును తేడా చూపరాదు. చేతిపరిశ్రమ, విద్యలో ప్రధానాంశ మని, అది యే యితర విషయమునకును తీసిపోదని గుర్తుంచుకొనవలెను. కనీసము జాతీయ పాఠశాలలలో నైనను యీ సత్యమును గుర్తింపవలయును.

(హరిజన్ 5-4-1942)

---

# 37 చేతి పరిశ్రమ - బుద్ధి వికాసము

ఈ నవీన విద్యలో చేతిపనులకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చు చున్నారని మీలో కొందఱు సణుగుచున్నారు. చేతిపనులు మహత్తర విద్యా సాధకములని నేను గట్టిగా నమ్ముచున్నాను. ఇండియాలో సామ్రాజ్య శక్తిని బలపఱచుటకును, దానిని కొనసాగించుకొనుటకును యిప్పటి విద్యాలయములలో విద్యాబోధ జరుగుచున్నది. మీలో కొందఱు ఆ చదువులలో పుట్టి పెరిగి యుండుటవల్ల చేతిపను లనగా మీకు బాధగా నున్నది. రోడ్లు, పాకీదొడ్లు ఎట్లు శుభ్రము చేయవల యునో, విద్యార్థులకు బోధింపవలెనని గవర్నమెంటు స్కూళ్ళలోను, కాలేజీలలోను ఎవరికినిపట్టదు. ఇక్కడ పరిశుద్ధత, పరిశుభ్రత ఓనమాల వంటివి. పాకీపని ఒక మంచి కళ. దానిని మీరు శ్రమపడి నేర్చు కొనవలెను. మాటిమాటికి ప్రశ్న లడుగుచుండుటవల్లను, యోగ్య మయిన విషయములు తెలిసికొనవలెనను ఆసక్తి చూపుటవల్లను జ్ఞానము వృద్ధికాగలదు. విద్యార్థులు గురువులయెడ భక్తిశ్రద్ధలు, వినయము గలిగి విద్యాసక్తిని చూపుచుండవలెను. ఆ ఆసక్తి నిర్ల క్ష్యములోనికి దిగజాఱిపోరాదు. అట్లు చేయుటవలన మనస్సునకు గ్రహణశక్తి క్షీణించిపోవును. వినయము, దీక్ష లేనిదే ఎట్టి జ్ఞానము కలుగజాలదు.

ఉపయోగకరమగు చేతి పరిశ్రమను బుద్ధి సూక్ష్మతతో సాధిం చిన యెడల బుద్ధి వికాసమున కంతకంటె ఉత్తమోపాయము కన బడదు. వేఱొక విధముగా కూడ ఒకడు బుద్ధివికాసమును పొంద వచ్చును. అయితే ఆ వికాసమునకు సమానత ఉండదు. అది గతుకులు గతుకులుగా, హెచ్చుతగ్గులుగా నుండును. శారీరిక, మానసిక, ఆత్మిక

వికాసములు సమముగా జరిగినప్పుడే సమముగా బుద్ధి వికాసము జరిగిన దనవలెను. అట్లు కానినాడు ఒకడు తుంటరి కావచ్చును. దుష్టుడు కావచ్చును. అందువల్ల విద్యలో చేతి పరిశ్రమకు కీలక స్థానమును ఏర్పఱచుచున్నాము. సమాజమునకు ఉపయోగపడునట్టి చేతి పరిశ్రమ నేర్పుచున్నాము. కనుక విద్యార్థిలో సేవాభావము గలుగ గలదు. అతడు పెడదారులు పట్టుట కవకాశము ఉండదు. ఈ ప్రధాన విషయమును గ్రహించితిరా, ఇక్కడకు శిక్షణ నిమిత్తము మిమ్ము పంపి, మీ గవర్నమెంటులు వెచ్చించిన సొమ్ము వృథా కాలేదన్నమాట.

(హరిజన్ 8-9-46)

# 38 బేసికు స్కూలు విద్యార్థుల లక్షణములు

శ్రీ ఆర్యనాయకమ్ నవీన విద్యాలయములో 7 వ తరగతిలో చదువుచున్న 9 గురు విద్యార్థులను గాంధీజీ వద్దకు తీసికొనివచ్చెను. ఈ విద్యార్థులందఱు సేవాగ్రాం నవీన విద్యాలయములో ఏడేండ్ల విద్యను పూర్తిచేసియున్నారు. వీరు సేవాగ్రాం పిల్లలు. ఆ చుట్టుప్రక్కల పల్లెటూళ్ళ పిల్లలు అయియున్నారు. కేవలము పొలములలో మాత్రమే పనిచేయుచు, బొత్తిగా స్కూలు మొగమెఱుగని పిల్లలకంటె వీరు ఎంతో ఉత్సాహముతో నున్నారు. అందువల్ల నవీన విద్యాలయములోని మొదటి ఫలితములు ఉత్సాహజనకముగానున్నవి. వీరు పరిశుభ్రముగాను, క్రమశిక్షణతోను, మంచి అలవాట్లు గలిగియున్నారు. గాంధీజీ వీరిని ఎకసక్కెములు పట్టించి నవ్వించి యున్నారు. ఈ పిల్లలుకూడ కడుపుబ్బ నవ్వసాగిరి. వీరిలో ఒక పిల్లవాడు గాంధీజీని 'అయ్యా, మీ విద్యాలయములో 7 ఏండ్లు శిక్షణ పొందిన విద్యార్థి ఏ యే లక్షణములు గలిగియుండవలెనో'నని తెంపుచేసి అడిగినాడు. అందుకు గాంధీజీ ఇట్లుచెప్పియున్నారు. నవీన విద్యాలయములోని శిక్షణ కట్టుబాట్లతోను, పూర్ణముగాను ఉన్నయెడల పదునాలుగు సంవత్సరముల బాలకులు సత్యవంతులుగాను, పరిశుద్ధులుగాను, ఆరోగ్యవంతులుగాను ఉండవలెను. వారి మనస్సు గ్రామములమీదనే ఉండవలెను. వారి బుద్ధి, చేతలు సమముగా వికసించి, నైపుణ్యము గలిగియుండవలెను. వారిలో కపటము ఉండరాదు. వారి బుద్ధి నిశితముగా నుండవలెను. కాని డబ్బు సంపాదింప

వలెనను ఆసక్తి యుండరాదు. న్యాయమైన పనిని దేనినయినను సరే చేయుటకు వారి చేతులు సిద్ధముగానుండవలెను. వారు నగరము లోనికి పోవలెనను కోరిక కలిగి యుండరాదు. వారు తమ విద్యాలయములో సహకారము, సేవాధర్మము నేర్చుకొనియున్నారు గనుక వానినే తమ చుట్టుప్రక్కల వారికిని అందజేయవలెను. వారు ఎన్నడును బిచ్చగాండ్రుగా గాని సోమరులుగాగాని మారిపోరాదు.

(హరిజన్ 8-9-46)

---

# 39 మంత్రుల మహాసభలో* అడిగిన ప్రశ్నలు

*ప్రశ్న* : స్వయంపోషణ అంశము తీసివేసి, నవీన విద్యను నడపు కొనవచ్చునా ?

*గాంధీజీ* : మీరు తప్పక ప్రయత్నము చేయండి. కాని నన్ను సలహా అడిగినయెడల, మీరు ఆ అంశమును తీసివేయదలచు కొన్ననాడు జేసికు విద్య అన్నమాట మఱచిపొండి. స్వయంపోషణ అనునది ప్రధానము కాకపోవచ్చును. నాకు మాత్రము అది సర్వ ప్రధానవిషయము. అయితే నవీన విద్య మొదటినుండియు స్వయం పోషకము కాగలదని అర్థము కాదు. ఏడేండ్ల శిక్షణను తీసికొన్న యెడల మొత్తముమీద ఆదాయము, వ్యయము సరిపోవలెను. అట్లు కానినాడు, నవీనవిద్యాశిక్షణ పొందిన విద్యార్థులు అనంతరము జీవితములో పనికిరాకపోవుదురు. ఇది నవీనవిద్యా ప్రయోజనమునకు విరుద్ధము. స్వయంపోషణ కాని నవీన విద్య అనగా ప్రాణములేని శరీరము వంటిది.

*ప్రశ్న* : చేతి పరిశ్రమద్వారా విద్యాబోధ జరుగవలెనన్న అంశమును మే మంగీకరించితిమి. ఎందువల్లనోకాని ముసల్మానులు చేతి రాట్నమును వ్యతిరేకించుచున్నారు. మీరు వడుకు పరిశ్రమను గుఱించి నొక్కి చెప్పుచున్నారు. ప్రత్తి పండు ప్రదేశములలో మీ

---

* 1946 జూలై 29,30 తేదీలలో పూనాలో మంత్రుల మహాసభ శ్రీ బి. జి. ఖేర్ అధ్యక్షత క్రింద జరిగినది. గాంధీజీ ఆ మహాసభలో ఒక గంట వఱకు ఉండిరి.

బోధ అక్కఱకు వచ్చును. కాని ప్రత్తి పండని ప్రదేశములలో మీ బోధ పనిచేయదని మీరు అంగీకరింతురా, లేదా. అటువంటిచోట వడుకునకు బదులు వ్యవసాయము మొదలగు పరిశ్రమలు ప్రవేశ పెట్టరాదా ?

*గాంధీజీ :* ఇది పురాతనమైన ప్రశ్న. విద్యాపద్ధతిలో మనము ప్రవేశపెట్టు చేతిపరిశ్రమ అందఱకు పనికివచ్చునదై యుండవలెను. ఇండియా స్వతంత్రము కావలెనన్నను, స్వయంపోషకముగానుండ వలెనన్నను ప్రతి యింటను రాట్నము ఆడుచుండవలసినదే అని నేను 1908 లోనే నిర్ణయించుకొంటిని. ఇంగ్లాండు, ఇండియాకును, లోకములోని ఇతర దేశములకును వస్త్రములను ఎగుమతి చేయు చున్నది. కాని అది రవంత ప్రత్తికూడ పండించదు. అట్లయినప్పుడు ఇండియాలో ఒక రాష్ట్రమువారు మఱియొక పొరుగు రాష్ట్రము నుండి ప్రత్తి తెప్పించుకొని వడుకు పరిశ్రమను సర్వత్ర అమలుజరుపు కొనుటలో ఆక్షేపణ యెందుకు ఉండవలెనో అర్థమగుటలేదు. నిజ మునకు, పూర్వకాలములో ప్రత్తి పండించనిచోటులేదు. ఇప్పుడు ప్రత్తిపండు ప్రదేశములని కేటాయించుట, ఫలానా ప్రదేశములలోనే అది పండగలదని పేర్లుపెట్టుట, అది యీమధ్య వచ్చిన అవాంతర విషయము. పేదరైతుల, వడుకు పారిశ్రామికుల ఇబ్బందిని ఆలో చింపకుండ వస్త్రపరిశ్రమ మిల్లు యజమానులు చేసిన పన్నాగమిది. ఈ రోజువఱకు ప్రత్తిచెట్టు ప్రతిచోటను పెరుగగలదు. ఈ విధముగా మీరు వాదించుచున్నారనగా కార్యారంభము చేయుటకుగాని, నూతనోద్య మమును సాధించుటకుగాని, సాధనసంపత్తిని సమకూర్చుకొనుటకు గాని మీకు ఉత్సాహము, శక్తి సన్నగిలిపోయినవని అర్థము. ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు ముడిపదార్థములు రాకూడ దని మీరు వాదించునెడల, పరిశ్రమ లన్నియు మూలబడి పోవును.

అదియుగాక, ఒకడు స్వయంకృషి చేయనియెడల వస్త్రహీనుడుగా నుండవలసి వచ్చుననుకొనుడు. అట్టి స్థితిలో అతడు తన బట్టను తాను సంపాదించుకొనగలుగుట కూడ విద్యయే. వడుకు పరిశ్రమను గురించిన వివిధ విషయములను నేర్చుకొనుటవల్ల ఎంతో జ్ఞానాభివృద్ధి కలుగును. అందు విద్యావిషయము లన్నియు రాగలవు. ఇంత సదుపాయము మఱియొక పరిశ్రమలో లేదు. ప్రస్తుతము ముసల్మానులు పొరపడుచున్నారు గనుక వారిసందేహములను ప్రస్తుతము తీర్పలేము. కాని మనము దృఢసంకల్పముతోను, దీక్షతోను కార్యసాధన చేయుచు జయమును వరించినప్పుడు, వారు తమంతతామే మనవద్దకువచ్చి, సర్వ విషయములు నేర్పవలసినదని కోరగలరు. నిఱుపేదలగు ముసల్మానులకు చేతిరాట్నము చేసినంత ఉపకారము ముస్లిములీగుగాని మఱియే యితర ముసల్మాను సంస్థగాని చేసియుండలేదని బహుశా వారికి తెలియకపోవచ్చును. బెంగాలులోని నేతవారు చాలవఱకు ముసల్మానులు. డక్కా మజిలినులని ప్రపంచ విఖ్యాతిపొందిన సన్నవస్త్రములు ముసల్మాను స్త్రీలు వడికినవి, ముసల్మాను నేతపారిశ్రామికులు నేసినవన్న సంగతి మఱచిపోరాదు.

మహారాష్ట్రము విషయములోకూడ అంతే. ఇతరులకుగలిగిన భ్రాంతిని పోగొట్టవలెనన్న మనము మన కర్తవ్యసాధనయందు దీక్షాబద్ధులమయి యుండవలెను. సత్యమొక్కటే కలకాలము నిలువగలదు. జరిగినదంతయు కాలప్రవాహమునబడి కొట్టుకొనిపోగలదు. జనులందఱు నన్ను ఒంటరిగా విడిచిపెట్టిపోయిననుసరే, నేను సత్యమునే నమ్ముకొని కార్యాచరణ చేయవలసిన వాడనే. ఈ రోజున నా పాట అరణ్య రోదనమే కావచ్చును. కాని నా బోధయందు సత్యమే ఉన్నయెడల, సమస్త బోధలు వ్యర్థమయినరోజున నాబోధయే అందఱకును వినబడగలదు.

## దుష్ట వలయము :-

"నవీన విద్యను బోధించుటకు ఉపాధ్యాయులను తయారు చేయవలెనన్న కొంత కాలము పట్టును. అందువలన ఈలోపుగా విద్యాలయములలోని విద్యా విధానమును బాగుచేయు టెట్లు ?" అని శ్రీ అవినాశలింగం చెట్టియారు ఇంగ్లీషులో ప్రశ్నించిరి. అందుకు గాంధీజీ పరిహాసము చేయుచున్నట్లువలె నవ్వుచు "మీరు హిందుస్తానీలో మాట్లాడజాలని యెడల, మీకు కావలసిన సంగతులు మీ ప్రక్కవారి చెవిలో ఊదవచ్చును. వారు నాకు హిందుస్తానీలో చెప్పగలరు" అనగా అందఱును నవ్విరి.

*గాంధీజీ* : ఇప్పుడుండే విద్యావిధానము ఇండియాకు స్వరాజ్యము తేజాలదనిన్ని, పైగా దాస్యశృంఖలములను మఱింత బిగదీయుననిన్ని మీరు గుర్తించిన యెడల, ఈ విధానమును మార్చుటకు సదుపాయములు దొరకనీయండి, దొరకకపోనీయండి, దీనిని ఏమాత్రము ప్రోత్సహింపజాలరు. ఇప్పుడు నవీన విద్యలో నుండు సదుపాయములతో తృప్తిపొంది మీకు చేతనైనంత వఱకు కార్యసాధన చేయగలరు. ఇటువంటి పద్ధతిలో మీరు పనిచేయుటకు ప్రజలు సమ్మతింపని యెడల మంత్రిపదవులకు రాజీనామా యిచ్చుట మంచిది. సదుపాయములన్నియు కుదరలేదనిన్ని లేదా ప్రజలు ప్రాణాధారకమగు ఆహారమును కాదనుచున్నారనిన్ని తలచి మీరు విషమును పంచిపెట్టరాదు.

*ప్రశ్న* : నవీన విద్యకు మనుష్యులు కావలెను కాని, సొమ్ము అక్కఱలేదని మీరు చెప్పుచుందురు. మనుష్యులకు శిక్షణ యిచ్చుటకు శిక్షణాలయములు కావలెను. అందుకు సొమ్ము కావలెను. ఈ దుష్ట వలయమునుండి తప్పించుకొను టెట్లు ?

*గాంధీజీ* : ఆ పని మీ చేతులలోనే యున్నది. మీరు స్వయముగా కార్యరంగములోనికి దిగవలెను. "దానము ఇంటి నుండియే

ప్రారంభము కావలె" నను ఇంగ్లీషు సామెత ఉన్నదిగదా! మీరు సాయిబులవలె పడకకుర్చీలో కూర్చుండి తక్కువరకము వారిని పని లోనికి దిగుమన్న యెడల ఈ వ్యవహారము నెరవేరునట్టిది కాదు. అది నా పద్ధతికాదు. బాల్యమునుండియు నాకు చేతనైనంతవఱకు ఆచరించుట, చుట్టుప్రక్కల వారిచే ఆచరింపజేయుట— ఇది నా పద్ధతి. ఈ విషయములో బ్రిటిషువారి చరిత్రనుండి మనము గుణపాఠమును గ్రహింపవలెను. మొట్టమొదటసారి కొద్దిమంది ఇంగ్లీషువారు ఇండియాలో పాదము మోపి క్రమక్రమముగా రాజ్యస్థాపన చేసి యున్నారు. వారు స్థాపించిన సామ్రాజ్యము రాజకీయముగాకంటె సాంస్కృతికముగా మిక్కిలి బలమైనది. అందువల్లనే బానిసవాడు తన చేతులకు వేసికొన్న సంకెళ్ళను ముద్దు పెట్టుకొని మురిసిపోవునట్లు, మనముకూడ మాతృభాషలయందాదరము విడిచిపెట్టి ఇంగ్లీషు భాషను తలకు కట్టుకొని తిరుగుచున్నాము. కనుక బ్రిటిషువారిలోని నిష్ఠ, విశ్వాసము, పట్టుదల, లక్ష్యశుద్ధి, త్యాగము గమనింపుడు. కనుక దృఢ సంకల్పమున్నచోటనే దారికూడ ఉండును. నూఱు కష్టములు వచ్చినను సరే మేము విడిచిపెట్టము అన్న కార్యదీక్షతో మనము మొదలుపెట్ట వలయును. అప్పుడు కష్టము లన్నియు మంచు విడిపోవునట్లు విడిపోగలవు.

## ఇంగ్లీషునకు గల చోటు :

*ప్రశ్న :* మన పాఠ్యక్రమములో ఇంగ్లీషునకు గల చోటు ఎట్టిది? దానిని నిర్బంధముగా బోధింపవచ్చునా లేక ఐచ్ఛిక విషయముగా రెండవ భాషగా బోధింపవలెనా?

*గాంధీజీ :* నూఱు కష్టములు వచ్చినను సరే నేను తల్లి వక్షమును విడిచిపెట్ట జాలనట్లు నా తల్లిభాష నంటిపెట్టుకొనియే యుండెదను. ఆ తల్లిమాత్రమే నాకు ప్రాణాధారకమగు స్తన్యము

ఇవ్వగలదు. నాకు ఇంగ్లీషుభాష ఇష్టమైనదే, అయితే అది తనచోటు లోనే ఉండవలెను. అది తనచోటు తప్పించి, తాను ప్రవేశింపకూడని చోటు నాక్రమించిన యెడల నేను దాని గర్భశత్రువును. ఈనాడు ఇంగ్లీషు లోకభాషయని సర్వులును అంగీకరించినదే. కనుక దానిని ఐచ్ఛిక విషయముగా, రెండవ భాషగా అంగీకరింతును. అదికూడ పాఠశాల పాఠ్యక్రమములో ఉండరాదు. యూనివర్సిటీ పాఠ్య క్రమములో ఉండవలెను. ఆ భాష కొద్దిమంది అసాధారణులకు మాత్రమే ఉండవలెను గాని కోట్లకొలది సామాన్య ప్రజలకు అనవ సరము. ప్రస్తుతము మనము మన ప్రజలకు నిర్బంధోచిత ప్రాథమిక విద్యనే ఇవ్వలేనప్పుడు ఇంగ్లీషుబోధకు మన మే యేర్పాటు చేయ గలము? రష్యాదేశము ఇంగ్లీషుతో నిమిత్తము లేకుండగనే, విజ్ఞానాభి వృద్ధిని గడించియున్నది. మనము ఇంగ్లీషు లేకుండ బ్రతుకలేమను కొనుట, మన మనస్సునకు పట్టుకొన్న దాస్యభూతము. ఇట్టి నిరాశను నేనెన్నడును అంగీకరింపను.

(హరిజన్ 25-8-46)

*ఒక విద్యావంతు డిట్లు వ్రాయుచున్నాడు :*

"మీరు శ్రద్ధతీసికొనని యెడల, నగరములలోని నవీనవిద్య గ్రామములలోని నవీన విద్యకంటె భిన్నముగా పెడదారిని పట్టగలదు. ఉదాహరణ చెప్పెదను. మాతృభాషకు నష్టముగలిగించి ఇంగ్లీషును ప్రవేశపెట్టెదరు. ఇంగ్లీషు చదువుకున్నవా రధికులుగను, చదువుకోని వారు అధములుగను చూడబడుదురు.

*గాంధీజీ వ్యాఖ్య :*

నా ప్రణాళిక ప్రస్తుతము గ్రామములకొఱకు మాత్రమే అయి యున్నది. అయితే నగరములలో దానిని ప్రవేశపెట్టదలచుకున్నప్పుడు కొంతమార్పు అవసరమని కూడ చెప్పియుంటిని. ఏ యే చేతిపరిశ్రమల ద్వారా విద్యాబోధ జరుగవలెనన్నదే చర్చనీయాంశము. ప్రాథమిక విద్యలో ఇంగ్లీషునకు చోటివ్వవలెనని నే నెన్నడును తలంచియుండ లేదు. అయినను నా ప్రణాళిక ప్రాథమిక విద్యకు సంబంధించినట్టిది మాత్రమే. అయితే నవీన ప్రాథమిక విద్య, ఇంగ్లీషులేకుండ మెట్రికు స్థాయి నందుకొనవలెననికూడ ప్రణాళికలో నున్నది. చిన్న బిడ్డలపై ఇంగ్లీషును రుద్దుట వారి వికాసమును శిథిలపఱచి, వారి ప్రతిభను నులిమివేయుటయే. భాషను నేర్చుకొనుటనగా ముఖ్యముగా జ్ఞాపక శక్తిని పెంపుచేసికొనుటయే బాల్యమునుండియు బిడ్డకు ఇంగ్లీషు నేర్పుట వానిని శ్రమపెట్టుటయే. వాడు ఇంగ్లీషును నేర్చుకొనవలె ననగా మాతృభాషను అప్రధానము చేయవలెను. గ్రామ ప్రజలు మాతృ భాష యను గట్టి పునాదిపై విద్య నేర్చుకొనుట ఎంత అవసరమో నగర ప్రజలుకూడ అంతే. ఇండియాలో ఈ సంగతిని ఋజువుచేయ వలసిన గ్రహచారము పట్టినది.

(హరిజన్ 9-9-38)

## 41 నవీన విద్య - వైద్యము

శ్రీమతి ఆశాదేవి నిరంతరము తన పనిపాటులలో మునిగి తేలుచుండును. నాకును తీరిక ఉండదని ఆమెకు తెలియును. అందు వలన కారణములేకుండ నాతో ఎక్కువ కాలము గడపుట ఆమె కిష్టము ఉండదు. మొన్నటి దినమున నేను ఢిల్లీకి ప్రయాణమయి పోవుచుండగా ఐయిదు నిమిషములు మాట్లాడవలెనని నావద్దకు వచ్చి 'నవీన విద్యలో వైద్యము నేర్పవలసిన అవసరమున్నదా ? అట్లయినచో నేను కూడ డాక్టర్లవలె నాలుగైదేండ్లు వైద్య శిక్షణ పొందవలెనా ?' అని అడిగినది.

ఆశాదేవి ప్రాత విద్యాపద్ధతిలో ఎం. ఏ. ప్యాసయినది. ఎంత ప్రయత్నము చేసినను ఆమెను ఆ వాసనలు విడిచిపెట్టవు. నాకు చెప్పుకొనదగిన డిగ్రీలు లేవు. నాకు హైస్కూలులో వచ్చిన జ్ఞానమే అల్పము. దానిలో విశేష మేమియు లేదు. ఆ సంగతులను అప్పుడే మఱచిపోతిని. నేను ప్రకృతి చికిత్స అను అమృతపానమును కడుపార సేవించితిని. అందువలన ఆమెతో ఇట్లంటిని :

మన పిల్లలు తాము పరిశుద్ధులుగా నుండి తమచుట్టు ప్రక్కలు కూడ పరిశుద్ధముగా నుంచవలెను. ఇదియే వారికి మనము నేర్పు మొదటి పాఠము, అనిగదా చెప్పుచుందువు. అందువలన నీకు కావల సిన వైద్య విద్య అంతయు ఇందే ఇమిడి యున్నది. మన నవీనవిద్య కోట్లకొలది గ్రామీణుల క్షేమము కొఱకు ఏర్పాటు చేయబడినది. వారు ప్రకృతి ఒడిలోనే పెరుగుచుందురు. కాని ప్రకృతి నియమ ములు ఎఱుగరు. వారికి తెలిసిన నియమములనైనను పాటింపరు. గ్రామీణుల దయనీయస్థితిని చూచియేగదా మనము నవీన విద్యను

కనుగొంటిమి. కనుక పుస్తకములు చదువుటవల్ల ఈ నవీన విద్యకు ప్రాణమురాదు. ఇంతవఱకును మనము ప్రకృతి జననినుండియే నేర్చుకొని యుంటిమి. అందువల్ల ఇకముందు కూడ గ్రామ వైద్యము ను ప్రకృతి నుండియే నేర్చుకొనవలెను. మనము పరిశుద్ధత, పరిశుభ్రత, పుష్టిగల ఆహారములను గుఱించి శ్రద్ధ చేయవలెను. ప్రకృతి వైద్యములోని సారమింతే. ఆ విధముగా చేసిన యెడల ప్రతి ఒక్కరును డాక్టరు కాగలరు. జీవించుటకు మాత్రమే భుజించు వాడును, ఆకాశము, వాయువు, సూర్యుడు, జలము, భూమి ఈ పంచభూతములకు మిత్రుడుగా నుండువాడును, ఈ సృష్టికర్త అయిన ఈశ్వరునకు దాసుడుగా నుండువాడును ఎన్నడును జబ్బుపడడు. ఒక వేళ జబ్బుపడిన యెడల, ఈశ్వరునిపయి భారము మోపి, అవసర మయినచో శాంతముగా మరణింపగలడు. తన గ్రామములోని పొల ములలో ఓషధు లున్నయెడల వాని నతడు ఉపయోగించుకొన వచ్చును. ఈ విధముగా కోట్లకొలది జనులు మూలుగకుండ మరణించు చున్నారు. వారు డాక్టరు పేరయినను వినియుండరు. ఇంక డాక్టరు దర్శనము సంగతి చెప్పనక్కఱయే లేదు. మన మనస్సులు గ్రామ పరిసరములతో నిండిపోవలెను. గ్రామ పాలకులును, యువతీయువకు లును మనయొద్దకు వచ్చుచుందురు. న్యాయ జీవనము చేయుటెట్లో మనము వారికి బోధింపవలెను. నూటికి 99 మంది రోగులకు అపరి శుభ్రతవల్ల, తినరాడని ఆహారము తినుటవల్ల, చాలినంత ఆహారము లేకపోవుటవల్ల రోగములు వచ్చుచున్నవని డాక్టర్లు అంగీకరించు చున్నారు. ఈ 99 మంది జనులకు మనము జీవిత కళను బోధించిన యెడల మిగిలిన ఆ ఒక్కరిని గుఱించి విడిచిపెట్టవచ్చును. అటువంటి వారు డాక్టరు సుశీలానయ్యారు వంటి పరోపకార పారీణులను వెదకు కొన దగుదురు. వారిని గుఱించి మనము బాధపడరాదు. ఈ రోజు లలో పరిశుద్ధ జలము, మంచి మన్ను, మంచి గాలి అపురూపమయి

పోయినవి. గాలి, సూర్యుడు మనకు ఎంత ఉపకారము చేయుచుండిరో ఊహింపలేము. పంచభూతములను చక్కగా వినియోగించుకొన్న యెడలను, యోగ్యమయిన, సమానమయిన ఆహారమును సేవించిన యెడలను యుగములనుండి పేరుకొని యున్న పనిని నెరవేర్చినట్లే. ఇంతమాత్రము జ్ఞానము సంపాదించుటకు మనకు డిగ్రీలు అక్కఱలేదు. కోట్లకొలది సొమ్ము అవసరములేదు. మనకు ఈశ్వరుని యందలి విశ్వాసము, సేవాసక్తి, పంచభూతముల పరిచయము, ఆహార పరిజ్ఞానము కావలసియున్నవి. కాలేజీలలోను, స్కూళ్ళలోను సమయమును వృథాచేయకుండ ఈ జ్ఞానమును మనము సంపాదింపవచ్చును.

(హరిజన్ 1-9-46)

---

# 42 విద్యాశాఖీయులతో మంతనములు

1947 ఏప్రిలు 22, 23 తేదీలలో పాట్నాలో హిందుస్తానీ తాలిమీ సంఘసభ జరిగినప్పుడు గాంధీజీ తమ హృదయమును విప్పి ప్రసంగించిరి.

## స్వయంపోషణ :

ప్రారంభములో సభ్యులు ఆదాయవ్యయ అంచనా పట్టికను చర్చించు చున్నప్పుడు, గవర్నమెంటుపై ఆధారపడరాదని గాంధీజీ వారిని హెచ్చరించుచు, ప్రభుత్వమువారు మనము అడిగినంత ఇవ్వ వచ్చును. కాని వారిమీద ఆధారపడితిమా, మన నవీనవిద్యకు నీళ్ళు వదలినట్లే. ఈ అంచనా మూడు సంవత్సరములకు వేయుచున్నారు. మూడు సంవత్సరములు పూర్తిఅగునప్పటికి మీరు పూర్తిగా స్వయం పోషకులయి యుండవలెను. దానిని చూపులో పెట్టుకొని మీరు అంచనా వేయతగుదురు. ఒక వేళ పై కాలపరిమితికి మీకు స్వయం పోషణ సాధ్యము కానియెడల మాకు చేతకాలేదని దేశము ముందు మీరు ఒప్పుకొనవలెను. సరిగా గుర్తించినయెడల అపజయముకూడ విజయము సాధించుటకు రాచబాటయే అనిరి.

మీ హద్దులు మీరు గుర్తుంచుకొనుడు. హిందుస్తానీ తాలిమీ సంఘమువారు మదరాసులో ఒక ట్రెయినింగు విద్యాలయమును నడపవలెననియు, దానికి కావలసిన సొమ్ము మదరాసు గవర్నమెంటు ఇవ్వగలదనియు, మదరాసు విద్యామంత్రి శ్రీ అవినాశలింగం చెట్టి యారు కోరినప్పుడు గాంధీజీ మరల హెచ్చరించుచు ఇట్లనిరి— మీ శక్తికిమించిన వాగ్దానములు చేయకండి. అట్లు చేసినయెడల మీ

శక్తి క్షీణించుటయేగాక, మదరాసు గవర్నమెంటునుకూడ చిక్కులలో పెట్టినవారు కాగలరు. ఇప్పుడు కాంగ్రెసువారు అధికారములోనికి వచ్చినారు గనుక వారిచేతికి కోట్లకొలది రూపాయలు వచ్చినవి. హిందుస్తానీ తాలిమీ సంఘమువారు ముందు వెనుకలు తెన్నగా ఆలోచించుకొని బోధించుటకు ఉపాధ్యాయులున్నారో లేదో చూచుకొని, తప్పక సాధింపగలమని నమ్మకమున్నప్పుడే, అక్కడ నడప వచ్చును. కనుక ప్రతివారును తమ శక్తిని తాము తెలిసికొనుట మంచిది. తమ హద్దులు తాము గుర్తుంచుకొనుట మంచిది.

## మూడువిధముల అభివృద్ధి:

*గాంధీజీ :* మన నవీన విద్య శారీరిక, మానసిక, ఆత్మిక వికాసములకు తోడ్పడును. ఇప్పుడున్న విద్యావిధానము మానసిక వికాసమునకే సహాయముచేయును. కొంచెము వడుకు, కొంచెము పాకీపని నేర్పుటతో నవీనవిద్య పూర్తికాదు. ఇవికూడ అవసరమే అనుకొనుడు. అయినను పైన జెప్పినట్లు త్రివిధముల అభివృద్ధి సమానముగా కలుగని యెడల ఈ విద్య నిరర్థకమే. నా కితరపనులున్నను, నామనస్సునుండి నవీనవిద్య తొలగిపోదు.

## ఖాదీ :

నవీనవిద్యలో ఖాదీకిగల స్థానమును వివరించెదను. 1908 లో నేను దక్షిణాఫ్రికాలో నుండగా ఖాదీ ప్రధానవిషయమని నా బుద్ధికి తోచినది. ఖాదీకంటె ఉత్తమమయిన గ్రామపరిశ్రమ కనబడినయెడల, నవీన విద్యకొఱకు ఖాదీని ప్రధానము చేయను. ఇండియాలోని జనులందఱు నిత్యము ఒక గంటసేపు నూలు వడికినయెడల మనకు కావలసిన గుడ్డ అంతయు సప్లయి కాగలదు. నిత్యము, ఆఱు గంటలు వడకవలసియున్న యెడల ఖాదీకి చోటు ఇవ్వజాలము. ఆహారమును

పండించుకొనవలెను. కొంత మానసిక శ్రమ చేయవలెను. నవీన విద్యలో, బానిసలవలె పనిచేయించుటకు చోటు లేదు. ఒక గంటసేపు నూలు వడికినయెడల, వడుకు వానికి ఆత్మోన్నతి కలుగవలెను.

## ఖాదీ - పోస్టు బేసికు (నవీన విద్యానంతరము) :

కనీసము ప్రారంభిక విద్యానంతరమయినను మిల్లులో జరిగే మెలకువలు బోధించుట మంచిదని సయ్యాదీన్ సాహెబు చెప్పినారు గాని నా కంగీకారము కాదు. పోస్టు బేసికు విద్యలో కూడ వడుకు పరిశ్రమ ద్వారానే విద్యాబోధన జరుగుట సర్వోత్తమము. అదిగాక కోట్లకొలది విద్యార్థులకు ప్రధానవృత్తి రాకుండ ఉండరాదు. శ్రీ దేవప్రకాశ్ తాను తక్లీ, చీపురుకట్టను గుఱించి వ్రాసిన విషయములను నిన్న నాకు చూపించియున్నారు. ఆయన వ్రాసినదంతయు యథార్థమైనయెడల ఈ రెండింటి ప్రయోజనమును గుఱించి జ్ఞానమును అధికముగా సంపాదించినారని చెప్పవలెను. ఈ జ్ఞానమంతయు బేసికు విద్యా కాలములో సంపాదించుట సాధ్యము కాదు. అందఱకు మేలు కలుగునట్లు ఈ ప్రధానవృత్తుల శాస్త్ర పరిశీలన మనము చేసి యుండలేదు. అదే గొప్ప చిక్కు. మిల్లులలోని వడుకు, నేతలకు ఆధారము చేతి తక్లీ, చేతి మగ్గములే. పశ్చిమ దేశీయులు మనలను దోచుకొనదలచి మిల్లులను నిర్మించియున్నారు. మనకు ఎవరిని దోచుకొనవలెనను కోరికలేదు. అందువల్ల మనకు మిల్లులక్కఱలేదు. కాని తక్లీ, చేతి మగ్గముల శాస్త్రము మనకు రావలెను. ఈ విషయములో ఇండియా, ఐరోపాను ఆక్రమించు పక్షములో ఇండియాకును లోకమునకును వినాశనము తప్పదు.

## ఖాదీ - మిల్లులు :

"బేసికు విద్యాలయములలో చదువు పూర్తిచేసికొన్న విద్యార్థులు, ఉద్యోగముల నిమిత్తము మిల్లుల వెంటబడుచున్నారు. దీని

మూలమున విద్యాశాఖీయులకు ఆందోళనగా నున్న"దని డాక్టరు జాకీరు హుస్సేను గాంధీజీతో చెప్పినప్పుడు వారిట్లనిరి :

నా అభీష్టము ప్రకారము జరుగు విద్యాలయములో చదువు ముగించుకొన్న విద్యార్థులు మిల్లులలో ఉద్యోగము సంపాదింప వలెనని కోరరాదు. నిజమునకు ఖాదీబట్ట ప్రక్కన మిల్లుబట్ట అమ్మ రాదు. మనదేశీయ మిల్లులు తమ వస్త్రములను ఇండియాకు వెలుపల దేశములలో అమ్ముకొనవలెను. లంకషైరులో తయారయిన వస్త్రము ఇంగ్లాండులో పోరకదు. సమస్తమును ఎగుమతి చేసెదరు. మన మిల్లులుకూడ చిరకాలము ఇతర దేశములలో తమ వస్త్రములను అమ్మజాలవు.

## మన తరణోపాయము :

మీ మనస్సులో గల ఆరాటమును నేను గుర్తింపగలను. మన చుట్టు ప్రక్కల వాతావరణమంతయు మిల్లులతో నిండియున్నది. చివరకు మన మంత్రులుకూడ మిల్లుల ప్రసంగమే చేయుచుండెదరు. అట్టి స్థితిలో మన సిద్ధాంతములకొఱకు మరణించుట ఒక్కటే మనకు మిగిలిన మార్గము. ఖాదీ తత్త్వమును గుఱించి మనకు నమ్మకమున్న యెడల, మన జీవితములో దానిని జీర్ణము చేసికొనవలెను. ప్రచారము లోనికి తేవలెను. దేశ కల్యాణమునకిదే ఉత్తమసాధనమని మంత్రులకు బోధింపవలెను.

కాంగ్రెసు, హిందుస్తానీ తాలిమీ సంఘమును నిర్మించినది. కాని ఎన్నడును శ్రద్ధతీసికొని యుండలేదు. అట్లే చరఖా సంఘము కూడ కాంగ్రెసు బిడ్డయే. కాని కాంగ్రెసు దానిని తన బిడ్డగా గుర్తించి యుండలేదు. ఈ రోజున ఈ సంఘములను లెక్కచేయువా రెవరు? కాంగ్రెసువారి చేతిలో కొద్ది సొమ్ము, కొద్ది అనుభవము ఉన్నప్పుడు నిర్మాణ కార్యక్రమమును గుఱించి శ్రద్ధచేసి యున్నారు.

కాని ఈ నాడు ప్రభుత్వమే మన చేతిలోనికి వచ్చియున్నది. వారింకను తమ అధికారమును జీర్ణించుకొని యుండలేదు. జీర్ణమగుటకు కొంత కాల వ్యవధి కావలెను.

## వెనుకటి పలుకుబడి లేదు :

నవీన విద్యవల్ల నూతన సమాజ నిర్మాణము జరుగగలదని గాంధీజీ గుర్తించి యున్నారు. అధికారములో నున్న మంత్రులు తాలిమీ సంఘమువారి అభిప్రాయములను పూర్తిగా అంగీకరించుట లేదు. ప్రభుత్వమువారిపనులను, సంఘమువారిపనులను సమన్వయము చేయవలసినదనియు అట్లు సాధ్యము కాని యెడల సంఘమును అణగారి పోనీయవలసినదనియు డాక్టరు జాకీరు హుస్సేను గాంధీజీని కోరియుండిరి.

*గాంధీజీ :* నాకు పూర్వమువలె ఈ నాడు పలుకుబడి లేదని ఒప్పుకొనుచున్నాను. గవర్నమెంటువారి వ్యతిరేకతకు వారిని నిందింపను. వారొక యంత్రములో చిక్కుకొని యున్నారు. వారు దానిలో పనిచేయవలెను. నేనుకూడ మంత్రినయినచో అట్లే ఆచరించి యుందును. అయినప్పటికిని పండిత జవాహరులాలుతోను, తదితరులతోను ఈ విషయములనే ముచ్చటించుచున్నాను. విషయబోధ చేయుట విద్యాశాఖీయుల కర్తవ్యమయి యున్నది. అవునా, కాదా ?

*డాక్టరు జాకీరు హుస్సేను :* కాంగ్రెసు ఎన్నడును తన విద్యావిధానమును మంత్రులకు బోధించి యుండలేదు. అది గొప్ప తప్పిదము. ఇక్కడకు రాబోవుముందు నేను మౌలానా అబుల్ కలామ్ ఆజాదును కలిసికొని యుంటిని. వారు సానుభూతితో ప్రసంగించి తాలిమీ సంఘమువారిని కలిసికొనగోరుచున్నామనిరి. సంఘము వారుకూడ వారిని కలిసికొనుటకు నిశ్చయించుకొనిరి.

*గాంధీజీ :* ప్రారంభములోనే ప్రభుత్వమువారు మిమ్ము ఆహ్వానించి యుండవలసినది. తాలిమీ సంఘమువారి యాజమాన్యమున శ్రీ సార్జంటు పని చేయవలెను. మీకు ఆహ్వానము పంపవలసినదని నేను గవర్నమెంటునకు సూచించియుంటిని.

## మత విద్య :

*డా. జాకీరు హుస్సేను :* మన విద్యాలయములలో మత విద్యాబోధకు సదుపాయములు చేయవలెను. అందుకు కాలనిర్ణయముకూడ జరుగవలెను. అట్లు జరిగిన యెడల మత విద్యను జీర్ణించుకొన్నవారు వచ్చి బోధచేయగలరు. ప్రభుత్వమువారు అనవసరముగా మతములో జోక్యము కలిగించుకొనుచున్నారను నింద పోగొట్టుకొనుటకుగాను వారు ఈ ప్రమేయము పెట్టుకొనరాదు.

*గాంధీజీ :* ఈ విషయములో మీరు మౌలానాగారితో మాట్లాడవలెను. గవర్నమెంటువారు మతవిద్యకు సదుపాయములు చేయవలెనన్న విషయమును నేనంగీకరింపను. ఎవరయినను మతవిద్య పేరుతో దారి తప్పించిన యెడల మీరు ఆపలేరు. ఒకవేళ మీరు ఆపుచేసిన యెడల దాని ఫలితము అనుకూలముగా నుండదు. మతవిద్య, రాజశాసనమునకును, నైతిక జీవనమునకును భంగము కానంతవఱకు దానిని ఆ మతవిద్యా గురువులు తమ బాధ్యతపైన, ఖర్చుపైన అట్లు చేసికొనవచ్చును. సమస్త మతములకును సమానములగునట్టియు పక్షములన్నిటికిని అంగీకృతము లగునట్టియు నైతిక సూత్రములను ప్రభుత్వమువారు బోధింపవచ్చును. నిజమునకు మనది మతేతర (సెక్యులరు) రాజ్యము.

## ప్రమాణ పత్రములు (సర్టిఫికెట్లు) :

*గాంధీజీ :* బేసిక విద్యలో ఉత్తీర్ణులయిన విద్యార్థుల కిచ్చు ప్రమాణ పత్రముల విషయమయి ఆలోచింతము. వారి అర్హతను

గుఱించిన పేరు చిన్నదిగాను, తూచినట్లుగాను ఉండవలెను. ఆ విష యమునే ప్రమాణ పత్రములో ఏమాత్రము స్తోత్రపాఠము లేకుండ తేట హిందుస్తానీలో స్పష్టముగా వ్రాయవలెను. పేరుగొప్ప, ఊరు దిబ్బ అన్నట్లు మనము చేసినయెడల ప్రమాణపత్ర ప్రదాతలకు గౌర వము ఉండదు.

## సహవిద్య (కో-ఎడ్యుకేషను):

మదరాసు విద్యామంత్రి శ్రీ అవినాశలింగం చెట్టియారు ఇట్లనిరి: "బాలబాలికలను కలిపి చదువుచెప్పవలసినదని తాలిమీ సంఘము వారు కోరుచున్నారు. ఆ పద్ధతి మదరాసు రాజ్యమునకు సరిపడదు. చిన్నపిల్లలను గాని, బాగా వయస్సు వచ్చినవారిని గాని కలిపి చదువు చెప్పించుటకు నా కే ఆక్షేపణలేదు. కాని ట్రయినింగు విద్యాలయ ములలోనికి వచ్చే బాలికలు చాలమంది 15, 16 సంవత్సరముల ప్రాయము వారయి యుందురు. అప్పుడు వారి మనస్సులు అపక్వ ములయి యుండును. కనుక ఆ ప్రాయములో బాలురను, బాలికలను కలిపి చదువు చెప్పించుట నాకిష్టములేదు."

*గాంధీజీ* : నేనంగీకరింపను. మీ పాఠశాలలో సహవిద్యను అంగీకరించుచు, ట్రెయినింగు విద్యాలయములలో అంగీకరింపము అనుటలో ఏదో దోషము ఎక్కడనో ఉన్నదని విద్యార్థులు తలంపగలరు. అట్టి ప్రమాదము నెదుర్కొనుటకే పిల్లలను తయారుచేయవలెను. ఒక నాటికైనను మనము ఈ స్త్రీపురుష విభేదమును మఱచిపోవలెను. పశ్చిమ దేశములలో ఏదో జరుగుచున్నదని ఆ ప్రమాణములు ఇక్కడ తెచ్చుకొనరాదు. ట్రెయినింగు విద్యాలయములలో సయితము ఉపాధ్యాయులు తెలివిగలవారయినచో, పరిశుద్ధులయినచో, నవీన విద్యా తత్త్వమును జీర్ణించుకొన్నవారయినచో మన కే అపాయ మును రాదు. ఏవయినను పొరపాట్లు జరిగినవే అనుకొనుడు. అంత

మాత్రముతో మనము భయపడి పారిపోరాదు. అటువంటివి ఎక్కడ నైనను జరుగవచ్చును. నేనింత తెంపుతో చెప్పుచున్నాననగా అందున్న కష్టములు నాకు తెలియక కాదు. మీరు బాధ్యతగల మంత్రులు కనుక స్వబుద్ధితో ఆలోచించుకొని తదనుగుణముగా వ్యవహరించుకొనండి.

## ఖాదీ - స్వయంపోషణ :

*శ్రీ జాజూజీ :* వడ్రంగము మొదలయిన పరిశ్రమలకంటె వడుకుటవల్లను, నేతవల్లను తక్కువ సొమ్ము వచ్చుచున్నది. ఏడు సంవత్సరముల బేసికువిద్య (నవీనవిద్య) చదువుకొన్న అనంతరము కూడ విద్యార్థులు స్వావలంబులుగా ఉండగలుగుదురా అన్న సందేహము నన్ను పట్టుకొన్నది. చరఖా సంఘము రేటు ప్రకారము వారు రోజునకు పదెనిమిది అణాలు సంపాదింపగలరు.

*గాంధీజీ :* మనము సొమ్ముతో ఎన్నడును లెక్కలు కట్టరాదు. మనకందఱకు బట్టకావలెను గనుక మన కార్యకలాపములన్నిటికి ఖాదీయే కేంద్రబిందువుగా నుండవలెను. ఏడులక్షల గ్రామములలో నివసించువారికి బట్టను సప్లయిచేయు పూచీని మనము పెట్టుకొని యున్నాము. ఈరోజున మనము నేతవారికి హెచ్చు మజూరీలు ఇచ్చి బట్ట నేయించుకొనుచున్నాము. నేను అందఱను నూలు వడకవలసినదని ఎట్లు కోరుచున్నానో అట్లే నేతకూడ నేర్చుకొనవలెనని బోధించియుండవలసినది. కాని పొరపాటు చేసితిని. దానికి ఎక్కువకాలము పట్టదని తెలియగలదు. అయితే మన సమయమంతయు దానికే సరిపోవు పక్షములో మనము పునర్విచారణ చేసికొనవలసియుండును.

## పనియందలి ప్రేమ :

నవీన విద్యలోని ఉపాధ్యాయుడు చేతి పారిశ్రామికుడును, విద్యావేత్తయు నగును. అతడు కేవలము జీతమును ప్రధానముగా

ఎంచడు. జీతమన్నది చెడ్డమాట. అతడు న్యాయోచితమైన సొమ్మును పుచ్చుకొను పనివాడు. అతని భార్య, బిడ్డలు సయితము పనిచేయు చుండగలరు. నిజమయిన సహకారమిట్లే రావలెను. ఇట్లు చేసినప్పుడే ఇండియాలోని ప్రతిగ్రామములోను నవీన విద్య వ్యాపింపగలదు.

## వ్యవసాయము - ప్రధానమైన చేతిపరిశ్రమ (బేసికు క్రాఫ్టు):

వ్యవసాయము ప్రధానమైన చేతిపరిశ్రమగా నుండరాదా అని కొందఱు నన్ను అడుగుచున్నారు. దానిలో విద్యాబోధ చేయుటకు తగినన్ని అవకాశములు లేవు. వడుకులోవలె నైపుణ్యము సంపాదించుట కందు చోటులేదు. నవీన విద్య యనగా కేవలము వృత్తి నేర్పుట కాదు. తద్ద్వారా మానవుని పూర్ణవికాసము గలుగవలెను.

నేను వ్యవసాయముతో ప్రారంభము చేయకపోయినప్పటికిని అది చిట్టచివరకైనను రావలసినదే. కారణ మేమనగా నవీన విద్యాక్షేత్రము బహువిస్తృతమయినది. నేను సంకల్పించిన విద్యాలయము లోని బాలురను, ఉపాధ్యాయులును తమకు కావలసిన అవసరము లన్నిటిని తామే తీర్చుకొనుటకు సమర్థులయి యుండవలెను. నవీన విద్యలోని ఉపాధ్యాయుడు మంచి ఒకటవ రకము చేతి పారిశ్రామికు డయి యుండవలెను. ఆ గ్రామములోని బాలబాలికలందఱు తమంత తామే అతనివద్ద చేరుదురు. ఈ విధముగా విద్య సహజముగానే ఉచితమైనది, సర్వులకు అందుబాటులో నున్నది కాగలదు.

ఈ రోజులలో ఏ గ్రామములో పండుచున్న కూరగాయలు ఆ గ్రామములో అందుబాటులో నుండవు. తిరువాన్కూరు గ్రామము లలో ఉత్పత్తియగు కొబ్బరికాయలు అక్కడి ప్రజలకు అందవు. వాని నన్నిటిని ప్రోగుచేసి బస్తీల కెగుమతి చేసెదరు. నవీన విద్యాలయ

ములు స్థాపింపబడినచోట యిట్టి విపర్యయము జరుగదు. ఇంకను ఈ రోజులలో నల్లమందు, పొగాకు, ప్రత్తి మొదలగు వ్యాపారపు పంటలు ధనసంపాదనకై పండించుచున్నారు. నవీన విద్యలో శిక్షణపొందిన వారు తమ కవసరమయిన ఆహారమును పండించుకొందురు.

(హరిజన్ 9-11-47)

---

## ఆఱవ భాగము

# నవీనవిద్యా నిర్ణయములు

## 43 వడుకు - ప్రవర్తన

సెటిలుమెంటు పాఠశాలలలో జరుగుచున్న వడుకు పరిశ్రమను గురించి అఖిలభారత చర్ఖాసంఘము, కర్ణాటక శాఖవారు నా కిట్లు వ్రాయుచున్నారు.

చర్ఖాసంఘము, కర్ణాటక శాఖవారు, బీజపూరు, గడగు సెటిలుమెంట్లలోని నిరుద్యోగులకు ఏకుట, వడుకుట నేర్పుటకయి టీచర్లను పంపియున్నారని, హుబ్లీ సెటిలుమెంటు మేనేజరు శ్రీ విల్సను, సెటిలుమెంటు స్కూలు స్త్రీ సూపర్నెంటు శ్రీమతి బ్రిస్కో-కన్య పత్రికలలో చదివియున్నారు. అప్పటి నుండియు తమ సెటిలుమెంటులో కూడ పై పరిశ్రమలను స్థాపించుదమా యని ఆలోచింపసాగిరి. అంతట ఉభయులును కలిసి కర్ణాటక శాఖవారితో ఉత్తర ప్రత్యుత్తరములు నడపి మిగుల ఉత్సాహముతో పై పరిశ్రమలను తమ సెటిలుమెంటులోనికి రప్పించుకొని యున్నారు.

మేము పోయి రిమాండు (Remand) నివాసములోని బాలురకు శిక్షణ మొదలు పెట్టితిమి. ఆ నివాసములో మొత్తము 33 గ్గురు బాలురున్నారు. అందఱును 8-16 ఏండ్ల మధ్య ప్రాయమువారు. ఆ పిల్లలు అసాధ్యులు. ఆ పిల్లల తలిదండ్రులు గాని, పోలీసులు గాని వారిని తెచ్చి, నివాస గృహములో ఉంచి సూపర్నెంటు అధీనము చేసినారు. ఆ పిల్లలు చిన్నచిన్న దొంగతనములు చేయుచు, దారితప్పి తిరుగుచుండుటవల్ల పై విధముగా ఉంచబడిరి. నివాస గృహము

మేనేజర్లు, ఆ పిల్లలను మంచిదారిలో పెట్టుటకు సకల శ్రమలు పడు చుండిరి. చాలమంది పాఱిపోయెడివారు. వారిని తఱిమి, వెదకి, తీసికొని వచ్చి మరల నివాస గృహములో ప్రవేశపెట్టుటకు బ్రహ్మ ప్రళయమయిపోయెడిది. పోనీ వారిని నగరములోని ప్రయిమరీ పాఠశాలకు గాని, సెకండరీ పాఠశాలకు గాని పంపుదమూయన్న, పాఱి పోయెదరన్న భయమే. ఆ పిల్లల శరీరములకు, మనస్సులకు పని కల్పించుటెట్లో తెలియక యజమానులు తికమక పడుచుండిరి.

ఆ పిల్లలకు మూడున్నర నెలలు శిక్షణ యిచ్చుటకుగాను, చరఖా సంఘమువారు ఒక ఉపాధ్యాయుని పంపియుండిరి. ఆంధ్ర దేశములో జరుగుచున్నట్లు వలె ప్రత్తిని శుభ్రము చేయుట, ఏకుట, వడుకుట ఆ బాలురకు నేర్పబడెను. ముఖ్యముగా 14-18 సంవత్స రముల ప్రాయముగల పెద్ద పిల్లలే తీసికొనబడిరి. ఇప్పుడు ప్రతి పిల్ల వాడును ప్రతిరోజు 1200 మొదలు 1500 గజముల వఱకు నూలు వడుకుచున్నారు. నూలు నెంబరు 25 మొదలు 30 వఱకు ఉన్నది. ఈ శిక్షణ మొదలుపెట్టినది మొదలు పిల్లలకు కొంత కాలక్షేపము, ద్రవ్యరూపేణ ప్రతిఫలము ఉన్నందువల్ల వారి ప్రవర్తనలో చాల మార్పు వచ్చినదని ఆ మేనేజరు వ్రాసియున్నారు. బ్రిస్కో కన్య వ్రాసిన ఉత్తరమును ఇందుతో పంపుచున్నాను. సర్వ విషయములు దానివలన తెలియగలవు.

బ్రిస్కో కన్య నా కొక చక్కని ఉత్తరము వ్రాసియున్నది. ఇదిగో చూడుడు :

మా పాఠశాలలో జరుగుచున్న వడుకు పరిశ్రమను గుఱించి మీకు తెలియజేయవలసినదని చరఖా సంఘమువారు నన్ను కోరి యున్నారు.

1. మేము 1940 జనవరి 15 వ తేదీన వడుకు పరిశ్రమ మొదలు పెట్టినాము.

2. పిల్లలు 14, 16 ఏండ్ల ప్రాయమువారు. ఆ పని చేయుచున్నప్పుడు వారికిగల సరదా చూడగా మాకు ఆశ్చర్యము గలిగినది.

3. అంతకు మునుపు మేము విలువగల పరిశ్రమలు పెట్టలేకపోవుట వలన వారు గోళ్లు గిల్లుకొనుచు కూర్చుండ వలసినవారైరి. ఇప్పుడు వారికి ఎంతో సంతోషముగా ఉన్నది. చేతినిండుగా పనియున్నది. పాఱిపోవలెనను బుద్ధి ఉన్నట్లు కనుపించదు.

4. ఇప్పుడు నిత్యము ప్రతి ఒక్కరు అయిదు గంటలు పనిచేసి రెండణాలు, రెండణాల కాని సంపాదించుచున్నారు. ఈ వడుకు పరిశ్రమ నిమిత్తము వారికి ప్రయివేటుగా కొంత సొమ్ము పెట్టుబడి పెట్టబడినది. ఆ సొమ్మును తీర్చివేయుచున్నారు. వారి ఖర్చుకుగాను కొంత వారి చేతికేయిచ్చి మిగిలినదానిని వారిపేర జమచేయుచున్నాము. అట్లు చేయుటవల్ల ఇంటికి పోవునప్పుడు వారిచేతికి కొంత ధనము రాగలదు. మగపిల్లల విషయములో మాకు మంచి ఫలితము గలిగినది గనుక ఇంకా బాలికాపాఠశాలలోని పెద్ద బాలికలకు శిక్షణ యిచ్చుట మొదలుపెట్టితిమి. ఈ వార్తలు మీకు సంతోషము గలిగించునని నమ్ముచున్నాము. అందువల్లనే ఈ ఉత్తరమును, వడుకుచున్న పిల్లల చిత్రమును మీకు పంపుచున్నాము.

*గాంధీజీ వ్యాఖ్యా :*

వడుకు పరిశ్రమవల్ల ఎన్నో లాభములుగలవు. అందుకు పైసాక్ష్యమే ఉన్నది. దానిని ఋజువు చేయుటకును ఎన్నో ఆధారములున్నవి. క్రిస్టో కన్య తాను చేయుచున్న ప్రయోగమును గుఱించి అప్పుడప్పుడు నాకు రిపోర్టులు పంపుచుండగలదని ఆశించెదను.

(హరిజన్ 4-8-1940)

గవర్నమెంటు ఉద్యోగులు నవీన విద్యను గురించి ఆలోచన లేకుండ వ్యతిరేక విమర్శలు చేయుచున్నారు. అవన్నియు ఒక ఎడారి వలె నున్నవి. ఇట్లుండగా బీహారు గవర్నరుకు అడ్వైజరు (సలహాదారు) అయిన శ్రీ కజిన్సు నవీన విద్యాపాఠశాలలను మెచ్చుకొనుచు ఒక ఉత్తరమును హిందుస్తానీ తాలిమీసంఘ కార్యదర్శి శ్రీ ఆర్యనాయకమునకు ఇట్లు వ్రాసియున్నారు. అది పచ్చికలంకవలె నున్నది.

"నేను నవీన విద్యాపాఠశాలలను పరీక్షింపవలచి కార్యక్రమము వేసికొని యున్నాను. అయితే వానల మూలమున నా కార్యక్రమము తగ్గించుకొనవలసి వచ్చినది. ఉన్న 27 పాఠశాలలలోను 18 పాఠశాలల విద్యార్థులను, ఉపాధ్యాయులను కలిసికొన గలిగితిని. 6 బృందావన - రామపురాలోనివి. 12 చాబేతోలా - పారుకియాలోనివి ఆ పాఠశాలలన్నిటిని చూడగా నాకమిత సంతోషము గలిగినది. ఏడు తరగతులు పూర్తిఅయిన వెనుకగాని ఈ ప్రయోగ ఫలితములను గురించి పూర్తిగా చెప్పజాలము. అయినను పిల్లలు పరిశుభ్రముగాను తెలివితేటలతోను, తమ పనిపాటులయందు ఉల్లాసముతోను ఉండుట చూడగా మనము సరియయిన మార్గముననే పోవుచున్నామని నమ్మకము గలుగుచున్నది. నవీన విద్యాలయములలో 7 సంవత్సరములు చదువుకొని 14 సంవత్సరముల ప్రాయము వచ్చిన బాలకులు, ఆ వయస్సే గలిగి మామూలు పాఠశాలలలో చదువుకొన్న బాలురకంటె ఏమాత్రము తీసిపోరని చెప్పగలము.

ఒక్క విషయమును గురించి నేను మహదానందము పొందుచున్నాను. గ్రామీణులకు ఈ విద్యయందు ఎంత ప్రేమగలిగినదో

నేను చెప్పజాలను. వారికి ఈ శ్రద్ధ ఉన్నంతకాలము ఈ విద్యాపద్ధతికి అపజయము ఉండజాలదు. చౌజేతోలా - పారుకియా గ్రామస్థులును, భూస్వాములును విద్యాలయమునకు సర్వోత్తమమయిన ఆటస్థలములును, చక్కని బాటలును, మంచి బాలభట దళమును ఏర్పాటుచేసియున్నారు. అంత పెద్ద దళమును నేనింతవఱకు చూచియుండలేదు. పైగా విద్యార్థులందఱు క్రమము తప్పకుండ విద్యాలయమునకు రావలెనని కట్టుదిట్టము చేసియున్నారు. అందుకు వారిని మనసారఅభినందించుచున్నాను. నేను కొన్ని పాఠశాలలు చూడలేకపోయినప్పటికి అక్కడ కూడ ఇంత ఉత్సాహముతోను పనిచేయుచున్నారని వినియున్నాను. గ్రామస్థులు ఇంకను ఎక్కువపని చేయగలరని నమ్ముచున్నాను. భావికాలములో విద్యార్థులకు మామూలు చదువులే కాకుండ ఎంతో బుద్ధివికాసము, చేతి నైపుణ్యము, ఆరోగ్యము, పరిశుభ్రత ఏర్పడగలవు. అందువలన గ్రామములు ఇప్పటికంటె ఆరోగ్యవంతముగాను, ఆకర్షణీయముగాను, విజ్ఞానయుతముగాను ఉండగలవని ఆశించుచున్నాను.

(హరిజన్ 22-2-1942)

---

# 45 చేతి పరిశ్రమలద్వారా విద్య

*శ్రీమతి ఆశాదేవి ఈ క్రింది అంకెలను పంపుచున్నది. అవి సంతోషము గలిగించుచున్నవి :*

"1942 ఏప్రెలు నెలలో బిహారు, చంపారన్ జిల్లా, బెటియా తానాలోని 27 నవీన విద్యాలయములలోను మూడు సంవత్సరముల విద్యాక్రమము పూర్తి అయినది. 1941-42 సంవత్సరమునకు గాను 1, 2, 3 తరగతుల విద్యార్థుల ప్రగతిని గురించి కొన్ని అంకెలు తయారు చేసితిమి. వానిని చూచినప్పుడు మిగిలిన నవీన విద్యాలయములకు గూడ ఉత్సాహము కలుగగలదు. వివరములతో గూడిన చార్టును "నవీన విద్య" (నయీ తాలీమ్) అను మాస పత్రికలో ప్రకటింప గలము. నవీన విద్యయందు దాసక్తి గలవారికొరకు సంగ్రహముగా కొన్ని అంకెలను తెలియబఱచుచున్నాను. ఈ 27 పాఠశాలలలోను పిల్లల సగటు హాజరీ మొదటి తరగతిలో నూటికి 70, రెండవ తరగతిలో 76, మూడవ తరగతిలో 79 గురు అయియున్నది. ప్రతి ఒక్కరి సగటు ఆదాయము మొదటి తరగతిలో రు. 0-11-0; రెండవ తరగతిలో రు. 2-4-0; మూడవ తరగతిలో రు. 6-1-1. 390 మంది పిల్లలు పాఠశాల లన్నిటిలోను 10,264 గంటలు పనిచేయగా వారి ఆదాయము మొదటి తరగతిలో రు. 267-8-6 లు. 356 మంది పిల్లలు, 14,082 గంటలు పనిచేయగా రెండవ తరగతిలో వారి ఆదాయము రు. 804-13-6; 319 మంది పిల్లలు 14,362 గంటలు పనిచేయుగా వారిఆదాయము మూడవ తరగతిలో రు. 1935-14-11. అనగా 1065 మంది విద్యార్థులు సంవత్సరము మొత్తముమీద రు. 3008-5-1 సంపాదించి యున్నారు.

ఈ పాఠశాలలలో ప్రతి ఒక్కరి అత్యధిక సంపాదన సగటున మూడవ తరగతిలో రు. 15-12-0, రెండవ తరగతిలో రు. 6-2-0, మొదటి తరగతిలో రు. 2-10-1. మూడవ తరగతిలో చరఖామీద ఎక్కువ సగటు వేగము గంటకు 480 చుట్లు, తక్లీమీద 281 చుట్లు; రెండవ తరగతిలో చరఖామీద గంటకు 350 చుట్లు, తక్లీమీద 242 చుట్లు; మొదటి తరగతిలో తక్లీమీద గంటకు 164 చుట్లు."

*గాంధీజీ వ్యాఖ్య :*

ఇంత నూలు తయారైనది, ఇంత ఆదాయము వచ్చినది అని తెలుపుటకు పై అంకెలు ఇవ్వబడలేదు. వానికి తగిన ప్రాముఖ్యము ఉండనే ఉన్నదనుకొనుడు. వస్తు పరిమాణము, ఆదాయము, విద్యలో రెండవ స్థానమును మాత్రమే ఆక్రమింపగలవు. విద్యార్థులకు శిక్షణ యిచ్చుటలో చేతిపరిశ్రమలు ఎక్కువ ప్రాముఖ్యము గలవని తెలుపుటకే పై అంకెలు నిరూపింపబడినవి. ఎంతో పరిశ్రమ, శ్రద్ధ, దీక్ష ఉన్నగాని అటువంటి సూక్ష్మాంశములను సేకరించుట సాధ్యము కాదు.

(హరిజన్ 21-6-1942)

## ఏడవ భాగము

# ఉత్తర నవీనవిద్య

## 46 కాంగ్రెసు మంత్రివర్గములు

1946 జులై 29, 30 తేదీలలో పూనాలో కాంగ్రెసు రాష్ట్రములలోని విద్యామంత్రుల మహాసభ జరిగినది. శ్రీ బి. జి. ఖేరు అందఱను ఆహ్వానించి యున్నారు. వారే అధ్యక్ష పీఠమునుగూడ అలంకరించి యుండిరి. 29 వ తేదీ మధ్యాహ్నము గాంధీజీ ఒక గంటసేపు ఆ సభలో హాజరయియుండిరి.

1944 వ సంవత్సరములో గాంధీజీ తమ డిటెన్షనునుండి విడుదల కాగానే తాలిమీ సంఘము వారిని కలిసికొని ఇట్లనిరి : "మన నవీన విద్యావలయమును పెంపుచేయవలసిన తరుణము వచ్చినది. ఇప్పుడు మనము పూర్వ బేసికువిద్యను ఉత్తర బేసికువిద్యను సయితము చేర్చుకొనవలెను. నవీనవిద్య, జీవిత సాధనకు ప్రధానమయినదని యెంచియే మనము పాటుపడవలెను."

ఆ విద్యావిధానమును రూపొందించు టెట్లో, కొనసాగించు టెట్లో విద్యామంత్రుల కర్తవ్యమేమో గాంధీజీ ఆ సభలో సవిస్తరముగా వివరించిరి. అధికోత్సాహమువల్ల గొంతుక పట్టినదానికంటె పెద్ద ముద్ద మ్రింగి అవస్థపడెదరేమో జాగ్రత్త అని డాక్టరు జాకీరు హుస్సేను హెచ్చరించి యున్నారు.

## నేనే మంత్రినయితే :

*గాంధీజీ :* ఏమిచేయవలెనో నాకు తెలియును గాని, ఎట్లుచేయవలెనో మాత్రము గట్టిగా తెలిసికొనలేకపోవుచున్నాను. మనము ఏ దారిని పోవలెనో పటముమీద గీతలుగీసి యున్నారు. కాని సాధన సంపత్తి లేకుండ సముద్రములో ప్రయాణము చేయవలసి యున్నది. మీకు గల కష్టములను గుర్తించి యుంటిని. ప్రాత సంప్రదాయములలో పుట్టి పెరిగినవారు ఒక్క దెబ్బతో వానిని త్రెంచుకొని బయట పడజాలరు. నేనే మంత్రిపీఠము నధిష్ఠించి యున్నయెడల యింతటి నుండి గవర్నమెంటు విద్యాలయము లన్నియు బేసికు విద్యాలయములుగా మారిపోవలెనని విశాలావకాశములుంచి ఆదేశించెడి వాడను. వేలువేలు రాష్ట్రములలో వయోజన విద్యాప్రచారమునకును కృషి అధికముగా జరుపబడుచున్నది. ఆ ప్రచారమును కూడ నాకే వదలిపెట్టిన యెడల, చేతి పరిశ్రమ ద్వారానే దానిని నడపగలను. ఇందుకుగాను వడుకు పరిశ్రమ దానికి సంబంధించిన యితర కార్యములు సర్వశ్రేష్ఠములని నా యభిప్రాయము. ఎటువంటి పరిశ్రమ ద్వారా విద్యాబోధ జరుగవలెను అన్న విషయమును దానిలో కృషిచేయుచున్న వారికే విడిచిపెట్టుచున్నాను. అయితే ఏ పరిశ్రమ విద్యాబోధకు మిక్కిలి అనుకూలించునో అదే నిలువగలదు. మిగిలినవి పోగలవు. విద్యాశాఖలోని ఇనస్పెక్టర్లును, ఇతర ఉద్యోగులును ప్రజల వద్దకును, ఉపాధ్యాయుల వద్దకును పోయి గవర్నమెంటువారి నవీన విద్యా విధానమును గురించి గట్టిగా బోధింపవలెను. అది ప్రయోజనకారి యని నచ్చజెప్పవలెను. ఒక్కసారిగాక పదిసార్లు చెప్పవలెను. అది వారి ప్రధాన కర్తవ్యము. అంతేగాని వారిపయి అధికారపూర్వకముగా ప్రవేశపెట్టరాదు. ఆ ఉద్యోగులకు ఈ విద్యాపద్ధతి యందు నమ్మకము లేనియెడలను, వారు మనఃపూర్వకముగా ఈ

విద్యాప్రచారము చేయజాలని యెడలను, రాజీనామా యిచ్చుట మంచిదని సలహా చెప్పెదను. అయితే మంత్రులు తమ కర్తవ్యమును తాము గ్రహించి దీక్షతో పనిచేసిన యెడల రాజీనామాలు ఇవ్వవలసిన అవసరమే ఉండదు. కేవలము ఆర్డర్లు జారీచేసినంత మాత్రాన పనులు జరుగవు.

## యూనివర్సిటీ విద్యను పునరుద్ధరించుట :

నేను పయోజన విద్యను గురించి చెప్పిన మాటలే యూనివర్సిటీ విద్యకును వర్తింపగలవు. ఆ విద్య మన భారతీయ స్థితిగతులలో మిళితమయి పోవలెను. అందువల్ల అది నవీనవిద్యాక్రమమును కొనసాగించునదయి యుండవలెను. ఇదే ప్రధానాంశము. ఈ విషయములో మీరు నాతో ఏకీభవింపని యెడల నా సలహావల్ల మీకు ప్రయోజనము ఉండదు. అట్లుగాక, మీరు నాతో ఏకీభవించి, ఇప్పటి విద్యావిధానము దేశ స్వతంత్రమునకు పనికిరాక, బానిసత్వమును పెంపుచేయునదని గుర్తించిన యెడల నా వలెనే ఆవేశపూరితులయి యుండగలరు. ఇప్పుడుండే పద్ధతిని సాంతముగా తుడిచిపెట్టి, దేశావసరములకు తగినట్లుగా పునర్నిర్మాణము చేసికొని యుండెదరు.

ఈ నాడు ఈ యూనివర్సిటీలలో చదువుకొన్న విద్యార్థులు గవర్నమెంటు నౌకరీలకొఱకై పెంపరలాడుచున్నారు, లేదా భిన్న మార్గములు త్రొక్కి తమ నిరాశకు సాధనముగా ఆందోళన లేవదీయుచున్నారు. వారు బిచ్చమెత్తుటకు గాని, ఇతరులను పీడించుటకు గాని వెఱవరు. ఇది వారి దుస్థితి. దేశ స్వతంత్రము కొఱకు జీవింతుము, మరణింతుము అన్న విశుద్ధ సంకల్పము గల నిజమయిన దేశ సేవకులను తయారుచేయుటయే యూనివర్సిటీ విద్యాప్రయోజనము. కనుక యూనివర్సిటీ విద్యాలయములవారు తాలిమీ సంఘము వారి

నుండి బోధకులను తెప్పించుకొని, నవీన విద్యకు అనుగుణముగా, తమ విద్యను రూపొందించుకొనవలెను.

మంత్రులు ప్రజాప్రతినిధులుగా తమ అధికారమును గ్రహించి యున్నారు. ప్రజలనుకూడ తమతో కలుపుకొని పోనియెడల వారి అధికారపత్రమువిలువ కవున్సిలు హాలునకు లోపలమాత్రమే ఉండగలదు. ఇప్పుడు బొంబాయిలోను, అహమదాబాదులోను జరుగుచున్న విషయములు చూడగా కాంగ్రెసునకు ప్రజలలో పలుకుబడి పోయినదని తెలియగలదు. నవీన విద్య ఇంకను చిన్న మొక్క. భావికాలములో మహావృక్షము కాగలదు. ప్రజల సహాయ సంపదలు లభింపని పక్షములో మంత్రుల ఆదర్శపయిన నవీన విద్య వృద్ధిపొందరాదు. ప్రజాసహాయమును మీరు పొందజాలనియెడల రాజీనామా యివ్వండి. అరాజకము రాగలదని మీరు భయపడరాదు. శక్తిగలిగినంతవఱకు పాటుపడుట మీకర్తవ్యము. మిగిలినది ఈశ్వరునకు విడిచిపెట్టండి. ప్రజలు తమ అనుభవమునుబట్టి నిజమయిన స్వతంత్రమేమో గుర్తింపగలరు.

(హరిజన్ 25-8-46)

---

# 47 క్రొత్త విశ్వవిద్యాలయము

రాష్ట్రములలో క్రొత్త విశ్వవిద్యాలయములు స్థాపింపవలెనని ఉబుకులు పరుగులు పెట్టుచున్నారు. గుజరాతీ భాషకుగాను గుజరాతులో ఒకటి, మరాటీకిగాను మహారాష్ట్రములో ఒకటి, కన్నడికిగాను కర్ణాటకములో ఒకటి, ఓఢ్రమునకుగాను ఒరిస్సాలో ఒకటి, అస్సాములో ఒకటి, ఇంకను ఇంకను చాలచోట్ల విశ్వవిద్యాలయములను నిర్మింపవలెనని ఆలోచనలు చేయుచున్నారు. ఆయారాష్ట్రభాషలు, ఆయారాష్ట్ర ప్రజలు మహోన్నతిని పొందుటకై అట్టి విద్యాపీఠములు అవసరమనియే భావించుచున్నాను.

అయితే మనము తొందరపడి గమ్యమును చేరజాలమేమోయని కూడ భయపడుచున్నాను. మునుముందుగా రాజకీయముగా భాషాధారక రాష్ట్ర నిర్మాణము జరుగవలెను. అప్పుడు విడివిడిగా రాష్ట్రపాలన జరిగినప్పుడు విశ్వవిద్యాలయములు లేనిచోట వానిని స్థాపించుకొనగలరు. బొంబాయి రాష్ట్రములో గుజరాతీ, మరాటీ, కన్నడీ అను మూడు భాషలున్నవి. అందువలన ఆభాషలకు పెరుగుదలలేదు. మదరాసులో తమిళము, తెలుగు, మళయాళము, కన్నడము అను నాలుగు భాషలున్నవి. అవి ఒకదానిపై నొకటి చేరుటకూడ తటస్థించినది. ఆంధ్రదేశములో ఆంధ్ర యూనివర్సిటీ ఉన్నమాట నిజము. అయితే విదేశ పెత్తనములేకుండ ఆంధ్రదేశమొక రాజకీయరాష్ట్రమైన యెడల ఆ విశ్వవిద్యాలయము ఇప్పుడున్నట్లు ఉండజాలదు. రెండు నెలల క్రిందట మాత్రమే ఇండియాకు స్వరాజ్యము లభించినది. అన్నామలై యూనివర్సిటీ సంగతికూడ అంతే. ఆ యూనివర్సిటీలో తమిళభాషా గౌరవమున్నదో లేదో ఎవరు చెప్పగలరు ?

క్రొత్త విశ్వవిద్యాలయములకు తగిన పునాదులుండవలెను. ఆ విద్యాపీఠముల అధీనములో పాఠశాలలు, కళాశాలలు ఉండవలెను. వానిలో ఆయా మాతృభాషలద్వారా విద్యాబోధ జరుగవలెను. అప్పుడే సరియయిన వాతావరణ మేర్పడును. విద్యా పీఠము ఉన్నత స్థానమున నుండగలదు. గట్టిపునాదులున్నప్పుడే ఆ భవనోన్నతి నిలువ గలదు.

మనము రాజకీయముగా స్వతంత్రులమే యయినను, మనలో పాదుకొనియున్న పాశ్చాత్య వాసనలనుండి విముక్తులము కాలేదు. పశ్చిమ దేశములనుండియే మనకు జ్ఞాన ప్రసారము జరుగవలెననెడి రాజకీయవేత్తలకు నేను చెప్పవలసినదేమియులేదు. పశ్చిమ దేశముల నుండి మనము నేర్చుకోదగిన మంచి విషయములు కూడ ఏమియు లేవన్నవారితోను నేనేకీభవింపను. అయితే మనమిప్పుడు సరియయిన నిర్ణయము చేసికొనలేని స్థితిలోనున్నామని నాతలంపు. మనకు రాజ కీయ స్వతంత్రము వచ్చినంత మాత్రాన విదేశీ భాషా వ్యామోహ మును, విదేశీభావ వ్యామోహమును మనకు పోయినవని చెప్పజాలము. మనము నూతన విశ్వవిద్యాలయములు స్థాపింపబోవుముందు నవ్య లబ్ధమయిన స్వరాజ్య పరిమళమును మనము హృదయములనిండ నింపుకొనుట వివేకమును, కర్తవ్యమును కావా ? విశ్వవిద్యాలయము నకు మహోన్నతమయిన భవనములుగాని ధనరాసులుగాని అవసరము కావు. విచక్షణ సంపన్నమగు ప్రజాభిప్రాయమే దానికి ముఖ్యముగా కావలెను. ఉపాధ్యాయ బృందములు కొల్లలు కొల్లలుగా నుండ వలెను. దాని నిర్మాతలు పారద్రష్టలయి యుండవలెను.

ప్రజాతంత్ర రాజ్యములో ప్రభుత్వములు విశ్వవిద్యాలయము లకు సొమ్ము ఇవ్వరాదు. ప్రజలకు కావలసిన యెడల వారే సొమ్మిచ్చె దరు. ఆవిధముగా నిర్మింపబడిన విశ్వవిద్యాలయములు. దేశమునకు అలంకార ప్రాయములుగా నుండగలవు. పరిపాలన విదేశీయులచేతిలో

నున్నప్పుడు ప్రజలకేమిచ్చినను పైనుండియే క్రిందకురాగలదు. అందు వలన ప్రజలు మఱింతగా పరావలంబులగుట తటస్థించుచున్నది. ఆవిద్యా పీఠములు ప్రజాభిప్రాయముపై నిలిచియున్నయెడల ప్రతి విషయ మున అడుగునుండి పైకిపోగలదు. అందువలన చిరస్థాయిగా నుండ గలదు. అప్పుడది చూడ ముచ్చటగానుండును. పైగా ప్రజలకు బల మును గలిగించును. మంచినేలలో పాతిన విత్తనములవల్ల మనోహర మయిన సస్యమువచ్చినట్లువలె ప్రజాతంత్ర ప్రణాళిక ప్రకారము ఖర్చు పెట్టబడిన సొమ్మువల్ల ప్రజలకు పదిరెట్లు ఫలితము లభింపగలదు. విదేశీయుల యేలుబడిలో స్థాపితములైన విశ్వవిద్యాలయములు ప్రతి కూలముగా నడచినవి. అంతకంటె భిన్నముగా నడచుటకును వీలుం డదు. అందువలన మనము నవ్య లబ్ధమైన స్వరాజ్యమును చక్కగా జీర్ణించుకొని, నూతన విశ్వవిద్యాలయములు స్థాపించుటకు ముందు ఎన్నో జాగ్రత్తలు తీసికొనవలసియున్నది.

ఇంక హిందూ ముస్లిలాను సమస్యను తీసికొనుడు. దీనిమూల మున ఎంత విషవాతావరణము సృష్టి అయినదో చెప్పజాలము. చివ రకు మనకేమిగతికానున్నదో కూడ చెప్పజాలము. ఇండియాలో ఒక్క ముసల్మానుడు కూడ సురక్షితముగాను, గౌరవముతోను జీవింప జాలడనియు, అట్లే పాకిస్తానులో హిందువులు, సిక్కులు ఉండజాల రనియు ఊహించుకొనుము. అప్పుడు మన విద్యాపద్ధతిలోకూడ విషము ప్రవేశించును. అట్లుగాక హిందువులు, ముసల్మానులు, తది తరులు ఇండియాలోగాని, పాకిస్తానులోగాని సురక్షితముగాను, గౌరవముతోను జీవింపగలిగిన యెడల మన విద్యా పద్ధతికూడ సహ జముగా మారిపోవుటయేగాక సుఖప్రదముగాకూడ నుండగలదు. భిన్న భిన్న మతములవా రిక్కడ స్నేహ సౌజన్యములతో వర్తించి భిన్న సంస్కృతులను సుందరముగా సమన్వయించుకొని జీవించి యున్నారు. ఆ సమన్వయమును ఇంకను బలపడునట్లుచేసి ప్రోదిచేసి

కొనవలయును. లేదా హిందుస్థానములో ఒక్కటే మతమున్న రోజులలో, ఒక్కటే సంస్కృతి ఉన్న రోజులలో ఎట్లు ఉండెనో అట్లుండుటకు ప్రయత్నింపవలెను. చరిత్రలో మనకు ఆ తేదీ సరిగా దొరకదు. ఒకవేళ దొరకినదేఅనుడు. అట్లు దొరకినయెడల, మనము ఈ లోపుగా జరిగిన సమన్వయపద్ధతిని నాశముచేసికొనుచు తొల్లిటి సంస్కృతికడకు తిరుగుమొగమయిపోయినయెడల పాప ఫలితముగా ప్రళయ కాల భీషణ సముద్రములు వచ్చి మనలను ముంచివేయును. ఉదాహరణ కొరకు ఒకటి రెండు మాటలు చెప్పెదను. మనము మహమ్మదీయ మహాయుగమును తుడిచిపెట్టుటకు యత్నించితిమనుకొనుడ అప్పుడు లోకములో అప్రతిమానమని పేరుపొందిన ఢిల్లీలోని జుమామసీదును మనము మఱచిపోవలెను. అలీఘరులోని ముస్లిము యు వర్సిటీని మఱచిపోవలెను. లోకములోని సప్తసౌందర్యములలోను ఒకటి అయిన ఆగ్రాలోని తాజమహాలును మఱచిపోవలెను. మొగలుల కాలములో నిర్మితములయిన గొప్ప గొప్ప ఆగ్రా కోట ఢిల్లీ కోటలను మఱచిపోవలెను. ఆవిధముగా చరిత్రను మరల వ్రాసికొని రావలెను. భిన్న భిన్న దృక్పథములు నడచుచున్న ఈ దినములలో సరియయిన నిర్ణయములు చేసికొనలేకపోవుచున్నాము. రెండు నెలల క్రితము ఉపలబ్ధమయిన మన స్వతంత్రమునకు ఇంకను రూపురేఖలు దిద్దలేక తొట్రుపడుచున్నాము. చివరకు ఎట్టి రూపము ప్రాప్తమగునో చెప్పజాలకున్నాము. కనుక ఒక స్పష్టరూపము ఏర్పడువఱకు, ఉన్న విశ్వవిద్యాలయములలో తగినన్ని మార్పులు చేసికొనుచు, స్వతంత్ర భావములను విద్యాసంస్థలలో ప్రవేశపెట్టుచు పోవుట దొడ్డబుద్ధి. మనము నవ్య విశ్వవిద్యాలయములు స్థాపించునాటికి ఈ అనుభవమంతయు మనకు ఎంతగానో ఉపకరించును.

(హరిజన్, 2-11-1947)

---

# BOOKS BY GANDHIJI

(IN ENGLISH)

| | | | |
|---|---|---|---|
| An Autobiography | 7 | 0 | 0 |
| Satyagraha in South Africa | 4 | 8 | 0 |
| Hind Swaraj | 0 | 8 | 0 |
| Cent Per Cent Swadeshi (Enlarged Edition) | 2 | 0 | 0 |
| Constructive Programme — Its Meaning & Place | 0 | 6 | 0 |
| Non-violence in Peace and War — Vol. I | 7 | 0 | 0 |
| Women and Social Injustice | 3 | 0 | 0 |
| Gandhiji's Correspondence with the Government (1942–44) | 2 | 8 | 0 |
| From Yervada Mandir | 0 | 8 | 0 |
| Self-Restraint v. Self-Indulgence | 2 | 0 | 0 |
| Delhi Diary | 3 | 0 | 0 |
| The Nation's Voice | 3 | 0 | 0 |
| Key to Health | 0 | 10 | 0 |